# 'ఘంట' నిక్షిప్త చిత్రం



'మాయాబజార్'లోని 'సుందరి నీవంటి దివ్య స్వరూపంబు' పాటను తొలుత పిఠాపురం నాగేశ్వరరావు గారి చేత పాడించారు. టేక్ పూర్తయి ఆయనకి పారితోషికాన్ని ఇచ్చి పంపించేశాక 'నా కోసం ఒక్క టేక్ పాడు' అని ఘంటసాల గారిని కె.వి.రెడ్డి గారు అడిగారట. ఘంటసాల అలా పాడాక "ఇలాగే నాకు కావాలి ఇది ఉంచెయ్యండి" అని అన్నారట కె.వి. పిఠాపురం నాగేశ్వరరావు పాడుతున్నప్పుడు తీసిన ఈ ఫోటోలో వున్నవారు ఘంటసాల, పిఠాపురం నాగేశ్వరరావు (మూడవ వ్యక్తి) కె.వి.రెడ్డి, సావిత్రి తదితరులు

'హాసం'
హాస్య-సంగీత పత్రిక

Also available on net - www.haasam.com

# ఇదీ సంగతులు

31

# హాస్యం - సంగీతం

















కర్టెసీ:
2 వ, 75వ పేజీల ఫొటో కర్టెసీ
శ్రీమతి ఘంటసాల సావిత్రి

'సెంటర్ స్ప్రెడ్'లో - 'ఒక్కడు', 'పెళ్లాం ఊరెళితే' సినిమా పాటల పుస్తకాలు కలర్‌లో

ముఖచిత్రం: 'నాగ' సినిమాలో 'ఎన్టీఆర్'

మా అమ్మ పేరున సంవత్సర చందా డి.డి. పంపిస్తూ పాత సంచికలు వెంటనే పంపమని మిమ్మల్ని రిక్వెస్ట్ చేసాను. నా కోరిక మన్నించి మీరు పాత సంచికల పార్శిల్ ఆమెకు చేర్చారుట. She Was Very Much Surprised as well as thrilled తనకు ఎవరు ఈ పార్శిల్ పంపించారా అని చాలా ఆశ్చర్య పోయిందట. ఒక వేళ నేనయి వుంటామోనని నాకుఫోన్ చేసింది. ఆ వృద్ధ ప్రాణానికి అంత తృప్తిని సంతోషాన్ని కల్గించినందుకు మీకు కృతజ్ఞతలు చెప్పుకుంటున్నాను. ఆమె రోజూ చదువుకునే వేదాంత గ్రంథాలతో పాటు 'హాసం' కూడా సత్కాలక్షేపమేనని నేను చందా కట్టినాను. ఇందుకు మా శ్రీవారికి కూడా ధన్యవాదాలు చెప్పు కుంటున్నాను. మీకు, మీ పత్రిక సభ్యులకు కుటుంబ సభ్యులకు నూతన సంవత్సర శుభాకాంక్షలతో...

**-పి.యస్. జలజ,విజయవాడ.**

కర్ణాటక సంగీతం శీర్షికలో శ్రీ పారుపల్లి వారి గురించి చక్కని వ్యాసం అందించేరు తనికెళ్ళ భరణి గారు. వారి వ్యాసాలు నిజంగా 'హాసం'కు వజ్ర వైడూర్య కంఠాభరణాలే 'హాసం' ఓ మానస పుత్రిక వారికి అనిపిస్తోంది.

బ్రహ్మ సృష్టి రహస్యాన్ని భాస్కరభట్ల వారు బట్టబయలు చేసి- యల్లారీశ్వరి ఎల్లలు దక్షిణ ప్రాంతంకే పరిమితం చేసాడా బ్రహ్మ అన్నారు. ఆ స్వరం భాస్వరం అయి దే దివ్యమానంగా కాంతిరేఖలు నలు దిశలా చిమ్మింది కదా! ఒకవేళ పరాకు పడి ఉంటే 'చిరాకు దంపతుల చింతకాయ పచ్చడి' మాకు దొరక్కపోను శ్రీ రాఘవేంద్ర గారి కలం నుంచి చిమ్మిన నవరసాలు. పాఠకులు పరమాన్నంలా చవిచూస్తారంటే అది పాత చింతకాయ కాదనేగా. 'మనస్విని' విజేతకు మరోఅభినందనమాల సమర్పిస్తూ...

**-శ్రీమాన్ శ్రీకాశ్యప్, సింహాచలం.**

శ్రీ తనికెళ్ల భరణి గారి సంగీత - సాహిత్య సంగమ వ్యాసాలు మా లాంటి పాత తరం వారికి మనోల్లాసం కలిగిస్తున్నాయి. వారినుండి మరికొన్ని మధురమైన సంగతులు వినవస్తాయని ఆశిస్తున్నాను. శ్రీ చిత్తరంజన్‌గారి వ్యాసం 'లలితసంగీతం' సంగీతం నేర్చుకుంటున్న యువ గాయనీగాయకులకు ఓ చక్కటి బహుమానం. నూతన సంవత్సరంలో మరెన్నో సంగీత, సాహిత్య, హాస్య జల్లులు పాఠకులపై కురిపిస్తారని ఆకాంక్షిస్తూ...

**-జి.బి.వి.ఎస్.ఎన్.మూర్తి, బొబ్బిలి.**

'హాసం' 16-31 డిసెంబరు 2002 సంచిక చూడగానే నాకెంతోగానో నచ్చింది. మా అభిమాన




నటుడు అక్కినేని నాగార్జున, సోనాలిబింద్రేల ముఖచిత్రం చాలా చూడముచ్చటగా వుండి ముద్దొచ్చింది. 'హాసం' పత్రికను మొదటిసారిగా సెప్టెంబరు లో చూసాను. 'ఇద్దరు మిత్రులు' సీరియల్ మమ్మల్ని బాగా ఆకట్టుకుంది. ముందుముందు మరిన్ని సినిమా నవల్లు అందిస్తారని ఆశిస్తూ...

**-దోవారి నాగేశ్వరరావు, వేకనూరు.**

నేను 'హాసం' రెగ్యులర్ పాఠకుడను. ఈ పత్రిక కోసం ప్రతి 15 రో॥లకు ఎంతో ఆసక్తితో ఎదురు చూస్తుంటాను. పద్మనాభం,కిషోర్‌కుమార్ సీరియల్‌లు చాలా చక్కగా వున్నాయి. ఇలాంటి పత్రికను మాకందిస్తున్నందుకు మాలాంటి పాఠకులు మీకు ఎంతగానో ఋణపడి వుంటారనటంలో ఏ మాత్రం అతిశయోక్తి కాదు. ఇంకా 1931 నుండి మొదలైన టాకీ చిత్రాల గురించి క్రమంగా వివరించగలరని కోరుతున్నాను. బ్యానర్ పేరు- దర్శకుడు- సంగీత దర్శకుడు- నటీనటులు - కథావివరం ఇలా విశేషాలతో ప్రచురించితే పాఠకులకు ఆనందాన్ని పంచినవారవుతారు.

**-కె.ఎల్.ఎన్.మూర్తి, సత్తెనపల్లి.**

విశాఖపట్టణం వెళ్ళినప్పుడు మీ 1-15 డిసెంబరు సంచిక చూసాను. పత్రికలోని విషయాలు నన్ను ఆకట్టుకున్నాయి. బాపు గారి వీరాభిమానినైన నేను ఆయన మీద ఏడాదిపాటు స్పెషల్ ఫీచర్ వేస్తాననడంతో పులకించిపోయాను. దీనితో సంవత్సరం చందా పంపుతున్నాను.

**-ఐ.వి. సుబ్బారావు, ఘట్‌కాపర్, ముంబాయి.**

'హాసం'పత్రిక విడుదలయిన తొలిరోజులలో హాస్య సంగీత పత్రిక ఎంతవరకు నిలదొక్కు కుంటుంది అని అనుకున్నాను. కానీ అమోఘమయిన మీ సంపాదకత్వంలో, పత్రికారంగంలో ఒక క్రొత్త ప్రయోగాన్ని విజయవంతంగా అమలు చేసారు. దీనికి నా హార్దిక అభినందనలు. ముళ్ళపూడి వారి వెండితెర నవలలు, మా చిన్నతనంలో పదే పదే చదివేవాళ్ళం. దీనిలో బాపు గారి బొమ్మలను కూడా ప్రాక్టీసు చేసుకునేవాళ్ళం. మీరు ప్రచురిస్తున్న ఇద్దరుమిత్రులు నవల, మా చిన్ననాటి సంగతులను తలంపుకు తెస్తోంది. శీర్షికలు కూడా ఎంతో బాగుంటున్నాయి.

**....ఓ పాఠకుడు**

కళాఖండంగా ఖ్యాతికెక్కిన మాయాబజార్ (1957)ఖండఖండాలుగా చేయబడినటువంటి ప్రదర్శన చూడవల్సిన దురదృష్టం మాకీమధ్య కలిగింది. పైన, క్రింద, కొంతభాగం కన్పించకుండా పోయిన సినిమాస్కోప్‌లో, పెయింట్ చేసినట్లున్న 'కలర్'లో అక్కడక్కడా ఘంటసాల, రాజేశ్వరరావుల పనితనాన్ని భ్రష్టు పట్టించే ఆధునిక నేపథ్య సంగీతపు కలబోతతో ఈ 'ఖండం' సాగిపోయింది. ఫిల్మ్ ఇనిస్టిట్యూట్‌లకు పాఠ్యాంశంగా నిర్ణయించబడిన విజయావారి అద్భుత చిత్రం 'మాయాబజార్'యొక్క ఆత్మను, ధ్వంసంచేసిన ఈ ప్రింట్‌తాలూకు ప్రదర్శన, నిషేధించబడేలా చూడటం సీనియర్ చలనచిత్ర అతిరథ మహారథులేకాదు, పాత చిత్రాల్ని ప్రాణంగా చూచుకునే వారి తక్షణ కర్తవ్యం కూడా.

**-మోటుపల్లి రామదాసు(అధ్యక్షులు)**
**ఘంటసాల కళా సమితి, అద్దంకి.**

'హాసం'అంటే హాస్య సంగీత పత్రికగానే కాక హాయిగా-సంతోషంగా చదువుకునే పత్రికగా తీర్చిదిద్దుతున్నారు. అన్ని శీర్షికలు ఒకదానికొకటి పోటీపడేలా ఉన్నాయి. కాని 'మీ పదసంపద' శీర్షిక మా అభిమాన గాయకులు బాలు గారికి తగ్గశీర్షిక కాదేమోననిపిస్తోంది. కొత్త సినిమా పాటలు పుస్తకాలు దాచుకునేటట్టు యివ్వడం ఎంతైనా హర్షణీయం. మాది చిన్నసూచన- త్యాగరాజు, అన్నమయ్య, రామదాసు వంటి ప్రముఖ వాగ్గేయకారుల కీర్తనలు, కృతులు వంటివి వరుస క్రమంలో ప్రచురిస్తే ఎన్నో విలువయిన సంగీత సాహిత్యాలను మేము భద్రపరుచుకొనే వీలుంటుంది. కనుమరుగైపోతున్నతరంగాలు, జావళీలు కూడా వీలుని బట్టి ప్రచురించండి. 'హాసం'వంటి పత్రిక పుట్టిందే మా లాంటివారి 'కోసం' అని రాయడానికి నేనెంతో గర్విస్తున్నాను.

**-కె.వి.జి.యస్.శాస్త్రి (కండక్టర్)**
**రావులపాలెం**

ఇన్నాళ్ళకు పాఠకులు తప్పనరిగా కొని తీరవలసిన పత్రిక తెచ్చారు. అక్షరం వదలకుండా చదివి తీరవలసిన పరిస్థితి కల్పించారు.అందుకోండి నూతన సంవత్సర శుభాకాంక్షలు మీకు, మీ సహచరులకు!

**-ఇలపావులూరి మురళీమోహనరావు, హైద్రాబాద్**

సంపుటి : 2 సంచిక: 7

**1-15 జనవరి 2003**

పేజీలు: 68 + 8

వెల : రూ. 10-00

సంవత్సర చందా : రూ. 200

The one and only Magazine devoted to Humour & Music



# హాసం

## హాస్య-సంగీత పత్రిక

31

మేనేజింగ్ ఎడిటర్
ఎమ్బీయస్ ప్రసాద్

ఎడిటర్
రాజా

రిఫరెన్స్ కర్టెసీ
డా॥ కె.వి.రావు
జె.మధుసూదన శర్మ

HAASAM HAASYA SANGEETHA PATHRIKA
Flat No. 502, Sri Balaji Nilayam
13-1-212, Motinagar,
Hyderabad-500 018
Ph: 2383 1388 / 5557 0215
*email:* haasammag@hotmail.com

Printed and Published by:
**K.I.Varaprasad Reddy**
on behalf of Hummus Infoway (P) Ltd.,
502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500 018
Fax: 040-3541713

**Printed at:** Kalajyothi Process Ltd.,
1-1-60/5, RTC X Roads,
Musheerabad, Hyderabad-20,

**Published at:** 502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500 018

**Editor: RAJA**

Marketed by:
Margadarsi Marketing Pvt Ltd.,
6-3-570, Eeenadu Compound
Somajiguda, Hyderabad-82

కర్నూలు, అద్దంకిలలో 'హాసం' సంపాదకవర్గం పాల్గొన్న ఇష్టాగోష్ఠి, సమావేశాలు సంగీత ప్రియుల నెందరికో స్ఫూర్తినిచ్చినట్టున్నది. ఆ వార్తలు 'హాసం'లో చదివిన వివిధ ప్రాంతాల నుండి ఉత్తరాలు, ఫోన్లు వస్తున్నాయి-'మా ఊళ్ళో కూడా ఇలాంటి సమావేశం ఏర్పాటు చేద్దామనుకుంటున్నాము... రాగలరా?' అని. సాటి సంగీతాభిమానులతో సత్కాలక్షేపం చేయడం ఎవరికైనా సరే ఉల్లాసాన్ని, ఉత్తేజాన్ని కలిగిస్తుంది. మా వద్దనున్న సమాచారాన్ని మరింత విస్తృతం చేసుకోవడానికి ఉపకరిస్తుంది. అయినా సమయం రీత్యా మా పరిమితులు మాకుంటాయి. క్వాలిటీ తగ్గకుండా ప్రతీ పదిహేను రోజులకు పత్రికను పాఠకులకు అందించవలసిన బాధ్యత మాపై వుంది. అందువల్ల అటువంటి సమావేశాలు ఏర్పాటు చేద్దామనుకునేవారు ఒకటి, రెండు నెలల ముందుగా మాకు తెలియజేస్తే మాకు అనువైన తేదీలు తెలుపుతాము.

నిజానికి ఈ సమావేశాల కంటే ఊరూరా ఆడియో క్లబ్బులు ఏర్పడడానికి మేము ఎక్కువ ప్రాధాన్యత ఇస్తాము. ఫిల్మ్‌క్లబ్ ఉద్యమంలా ఆడియో క్లబ్బుల ఉద్యమం ఊపందుకోవాలి. గ్రామగ్రామాన జనాభాలో ఒక శాతం మంది చేరువయినా రాష్ట్రంలో కనీసం 7 లక్షల మంది శ్రోతలు ఒక సంఘటిత శక్తిగా రూపొందుతారు. ఒక గాయకుడి పేర కావచ్చు, గీత రచయిత పేర కావచ్చు, సంగీత దర్శకుడి పేర కావచ్చు-ఎవరిమీద అభిమానంతోనైనా సమితిని ఏర్పాటు చేసిన వారందరూ ఈ ఉద్యమంలో పాలుపంచుకోవచ్చు.

ఈ ఉద్యమానికి చేయూత నివ్వడానికి 'హాసం' ఉపక్రమిస్తోంది. ఈ సంచికలోని 67వ పేజీలో కనబడే కూపన్ వరుసగా 4 సంచికలలో దర్శనమిస్తుంది. సంగీతానికి సంబంధించిన సమితులు, సమాజాలు నిర్వహించేవారు ఈ కూపన్‌ను నింపి మాకు పంపితే 'హాసం' వద్ద 'ఆడియో క్లబ్ డేటా బేస్' తయారవుతుంది. మాకందిన వివరాలను 'ఆడియో క్లబ్స్' శీర్షిక ద్వారా మేము పాఠకులకు తెలుపుతూ ఉంటాం. దీనివల్ల తాము నివసించే ఊరిలో భావసారూప్యత కలిగిన సమితిలో చేరే అవకాశం పాఠకులకు, సభ్యత్వం పెంచుకునే అవకాశం సమాజాలకు కలుగుతుంది. అంతేకాదు చుట్టుపక్కల నున్న ఊళ్లల్లో నిర్వహించబడుతున్న సమాజాల వివరాలు తెలిసినప్పుడు వారితో సంబంధ బాంధవ్యాలు పెంచుకుని తమ కార్యక్రమాలను అనువుగా రూపొందించుకొనవచ్చు. ఇటువంటి సమన్వయం కళాకారులకు గాని, విశిష్ట అతిధులకు గాని ఎంతో ఉపయుక్తంగా ఉంటుంది. తక్కువ సమయంలోనే ఎక్కువ ప్రదేశాలను, ఎక్కువ మంది అభిమానులను చూడగలిగే సౌకర్యం ఉంటుంది.

ఈ ఆడియో క్లబ్‌లు సలహా, సంప్రదింపుల ద్వారా తమలో తాము సఖ్యత నెరపడమే కాక మ్యూజిక్ కంపెనీలతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరపవచ్చు. 'ఫలానా కాసెట్ రిలీజ్ చేస్తే ఇంతమంది మా సభ్యులు కొనడానికి సిద్ధంగా ఉన్నారు' అని ఆ కంపెనీలకు తెలిపి కావలసినవి డిమాండు చేయవచ్చు. శ్రోతల అభిరుచులను సర్వే చేయడానికి కంపెనీల వారికి ఈ క్లబ్‌లు చాలా అనువుగా ఉంటాయి. ఆడియో వినిమయదారులు ఈ క్లబ్‌ల ద్వారా తమ ఇష్టాయిష్టాలనే కాదు, ఫిర్యాదులను కూడా కాసెట్ నిర్మాతలకు తెలియపరచవచ్చు.

ఇవన్నీ ఒక రోజులో జరిగే పనులు కాదు. ఎన్నో అవరోధాలు కలగవచ్చు. కానీ తొలి మెట్టుగా సమాచార సేకరణ జరగడం అతి ముఖ్యం. దానికి వేదిక కావడం 'హాసం'కు గర్వకారణం! 'హాసం' పాఠకులు తమకు తెలిసిన 'సంగీత సమితి' సభ్యులకు 'ఆడియోక్లబ్ డేటాబేస్, 'కూపన్' గురించి తెలిపి మా ప్రయత్నంలో సహకరించ వలసిందిగా కోరుతున్నాం.



# జగడొక్క వీరుడు - వ్యతిరేక సుందరి

- గొళ్ళమూడి పద్మజ

చాట్ బండి దగ్గర నిలబడి పానీపూరీ తింటున్నాడు శ్రీనాధ్. సుందరి, స్నేహితురాళ్ళ బృందం కిలాకిలా నవ్వుకుంటూ వచ్చి బస్‌స్టాప్ దగ్గర నిలబడ్డారు. శ్రీనాధ్ వైపు చూసి ఏదో చెప్పుకుని కిసుక్కున నవ్వుకున్నారు. శ్రీనాధ్‌కి యిదేమీ కొత్తకాదు. "ఆఁ ఏం చెప్పుకుంటారు? తిండిపోతు తిమ్మరాజు అని చెప్పుకుంటారు. అంతేగా అభిరుచి లేని వాళ్ళు" అనుకుంటూ చింతపండు నీళ్ళ రుచిని లొట్టలేసుకుంటూ ఆస్వాదిస్తున్నాడు. అతన్ని వెతుక్కుంటూ అక్కడకు వచ్చిన శ్రీనాధ్ మేనమామ గండూరావు అతన్ని పట్టుకుని "ఎన్నాళ్ళిలా తిండిబండిల చుట్టూ ప్రదక్షిణాలు చేస్తావురా. పద... నేనందుకే అసలు వచ్చింది. రేపే నీ పెళ్ళిచూపులు, ఈసారైనా ఫలహారాల



వైపు కాకుండా పిల్లని సరిగ్గా చూడు" అంటూ అతన్ని లాక్కెళుతుంటే తల్లి పొదుగు నుంచి లాక్కెళుతున్న లేగ దూడలా వెనక్కి వెనక్కి బండిని చూసుకుంటూ బలవంతాన అతన్ని అనుసరించాడు.

ఫైవ్‌స్టార్ హోటల్లో డిన్నర్‌కి ఆర్డరిచ్చి వెయిట్ చేస్తున్నట్టుగా అసహనంగా కూచున్న శ్రీనాధ్‌కి ఫలహారాల పళ్ళెంతో హాల్లోకి అడుగుపెడుతున్న సుందరి అమృత కలశాన్ని తీసుకొస్తున్న మోహినిలా కనిపించింది. అతని దృష్టంతా పళ్లెంలో ఏమేమి ఐటమ్స్ వున్నాయా అనే వుంది. మలాయ్ శాండ్‌విచ్, పాలక్‌పకోడీ కన్పించగానే కాస్త స్థిమితపడ్డాడు. గుండూరావు అతన్ని చూస్తూ "ఏమిటో పిచ్చి సన్నాసి, వీడికింత తిండిపిచ్చి" అనుకుని నిట్టూర్చాడు.

"ఏమేవ్ మన చాట్ బండారే!" అని సుందరి వెనుకవున్న బృందం పెద్దగా అరిచేసరికి తలెత్తి అతన్ని చూసిన సుందరి కిసుక్కున నవ్వింది. రోజూ తను పానీపూరీ తింటున్నపుడు బ్యాక్‌గ్రౌండ్‌లో వినపడే కిసుక్కు శబ్దం యిక్కడ కూడా విన్పించిందేమిటి చెప్మా అని అపుడు తలెత్తి సుందరిని చూశాడు శ్రీనాధ్. సగ్గు బియ్యం గింజల్లా వున్న ఆమె పలువరుస, మెరుపు కొట్టిన షాక్‌లో పడి,

"ఇవన్నీ మా అమ్మాయే చేసింది బాబూ" అంటూ అందరు ఆడపిల్లల తల్లుల్లాగే ఆమె తల్లి ఆడుతున్న అబద్ధాన్ని అందరు పెళ్ళి కొడుకుల్లాగే అతనూ నమ్మేశాడు. 'అమ్మాయి అర్భకంగా వున్నా ఐటెమ్స్ అద్భుతంగా వండిందనుకున్నాడు. తన బ్రెడ్డు విరిగి సూప్‌లో పడిందనుకున్నాడు. 'అబ్బాయి అందగాడే కనుక అభిరుచుల గురించి అడిగేదేముందిలే' అనుకుంది సుందరి. వాళ్ళిద్దరే కాదు అందరూ యిష్టపడ్డారు.

పెళ్ళి పీటల మీద ఎవరూ చూడకుండా గుప్పెడు తలంబ్రాలు నోట్లో పోసుకుని పరపరమని నమిలి మింగేస్తున్న శ్రీనాధ్‌ని చూసి సుందరి తెల్లపోయి "అయ్యోరామా" అంది చెంపకి చెయ్యి ఆనించి. అన్న ప్రాశన నాడే అన్నం ముట్టించేలోపున అక్షింతల్ని తినేసిన ఘనుడని యీమెకి తెలిస్తే యింకెంత ఆశ్చర్యపోతుందో అనుకున్నాడతను సుందరివైపు కొంటెగా చూస్తూ.

వధూవరులిద్దరూ తిరుపతికి ప్రయాణం అయ్యారు. ప్రయాణంలో దారి పొడుగునా విరామం లేకుండా ఆడుతున్న శ్రీనాధ్ దవడల్ని చూస్తుంటే తాతయ్య గారి వూళ్ళో చిన్నప్పుడు చూసిన తిరగలి గుర్తొచ్చింది సుందరికి. రైలెక్కింది మొదలు ఇంటికి చేరేవరకు గుక్కెడు కాఫీ నీళ్ళయినా తాగని భార్యని చూసి యీమె నిరాహార దీక్షలకి బాగా పనికొస్తుంది, ఈసారి ఆఫీసులో ఏదైనా సమ్మె అయితే యీమెను కూచోపెట్టాలి నా తరపున అనుకున్నాడతను.

హైద్రాబాద్ చేరాక యింట్లోకి అడుగుపెడ్తూనే ఆమె చెయ్యి పట్టుకుని "రా సుందరీ నా కలల సామ్రాజ్యం చూపిస్తా" అంటూ ఒక అల్మారా

దగ్గరకు తీసుకెళ్ళాడు. బంగారు రంగు అక్షరాలతో "ఖానాఖజానా" అని రాసి వున్న డోర్ తెరిచి రకరకాల వంటల పుస్తకాలు, వంటకాల ఫోటోలున్న రంగురంగుల ఫోటోలు చూపించాడు. "చూడు నా కలెక్షన్. ఇవన్నీ యిన్నాళ్ళూ కలలో చూస్తూ ఆనందించా. నీ హస్త నైపుణ్యంతో యీ చిత్రాలకు జీవం పొయ్యి. పొయ్యి రాజేసి తక్షణం ఖజానాలో వున్న ఖానాతో యీ బాన నింపవా ప్లీజ్!" అంటూ పొట్టని చూపిస్తూ అతను అర్థిస్తుంటే ఆమెకి జాలేసింది. ఆఁ ఏముందిలే కాస్త రుచికరమైన వంట చేసి పెట్టడమే కదా అనుకుందామె.

కాని కిచెన్ ప్రవేశం చేశాక గాని ఆమెకి తెలియలేదు. తని పనింక బొగ్గు గనుల్లో కూరుకుపోయిన కార్మికుడి గతేనని. రోజా చాట్ బండి దగ్గర అతను ఆబగా తినే తీరు చూసి ఇంటికి దూరంగా వున్న బ్రహ్మచారులు మర్కటంలా మెక్కుతారు కాబోలనుకుంది. పెళ్ళి చూపుల్లోనూ, పెళ్ళి విందులోనూ అతను తినే పద్ధతి చూసి భోజన ప్రియుడేమో అనుకున్నారంతా. కాని రోజులు గడుస్తున్నకొద్దీ అతని తిండి పిచ్చి చూసి సుందరికి భోజనం మీదే ఏవగింపు కల్గుతోంది.

ఒకరోజు ఆఫీసు నుంచి లోపలికొస్తూ "సుందరీ, త్వరగా రెడీ అవ్వు. ఫుడ్ ఫెస్టివల్‌కెళ్దాం" అన్నాడు శ్రీనాథ్.

"అలా సడన్‌గా చెప్తే ఎలాగండీ? ముందుగా ఫోన్ చేసి చెప్పకపోయారా? వంటంతా చేసేశాను. మీకిష్టమైన చేమదుంపల వేపుడు..."

ఆ పేరు వింటూనే గబగబా కిచెన్‌లోకెళ్ళి కాస్త వేపుడు పళ్లెంలో పెట్టుకుని హాల్లోకొచ్చి కూచుని తింటూ... "సుందూ, వేపుడు పసందుగా వుంది. నువ్వేం వర్రీ అవకు... నీ వంట ఏమీ వేస్ట్ కాదులే. వచ్చాకా తింటాగా" అంటున్న అతని చూసి "అయ్యో రామ" అనుకుని "ఏమండీ! అక్కడ నన్నేమీ తినమని బలవంత పెట్టకండి. నాకీ చిరుతిళ్ళు సయించవు. వూరికే మీకు తోడుగా వస్తానంతే" అంది. ఇలాంటి వాళ్లు కూడా వుంటారా? అనుకున్నాడతను ఆశ్చర్యపోతూ.

దోశా ఫెస్టివల్‌లో అన్ని రకాల దోశలూ రుచి చూసి వచ్చేస్తూ దారిలో స్కూటర్‌ని సడన్‌గా ఆపేసి ఎటో చూస్తూ నిలబడి పోయాడు శ్రీనాథ్. సుందరి అతన్నంతగా ఆకర్షించినదేమిటా అని చూసింది. బర్గర్స్ అండ్ పిజ్జాస్ అని రాసి వున్న బోర్డు చుట్టూ కలర్‌లైట్స్ వెలుగుతూ కన్పించాయామెకు.

## కమల్ ప్రశ్న - ఢమాల్ కార్టూన్



**లారీ కింద ధైర్యంగా పెట్టగలిగే పీక?**

**చుట్ట పీక**

అబ్బ! ఏంటండీ చిన్న పిల్లాడిలా కలర్ లైట్లు చూస్తూ నిలబడ్డం? పదండి... అంది. ఇంతేనా సుందరీ! నువ్వు నన్ను అర్థం చేసుకుంది, నేనాగిపోయింది లైట్లు చూడ్డం కోసమా? ఎంత అవమానం... నువ్విక్కడే వుండు... పేక్ చేయించుకుని వచ్చేస్తా అని పరిగెత్తాడు.

ఈయన్ని దారిలోకి తేవడం ఎలా అని ఆలోచిస్తూ నిలబడ్డ సుందరికి చేతిలో పేకెట్స్ పట్టుకుని అతను తన వెనుకనుంచి రోడ్డు క్రాస్ చేస్తూ "ఫలూడా" అన్న బోర్డువైపు పరిగెత్తడం కన్పించి "అయ్యోరామ!" అని నెత్తికొట్టుకుంది. అతనొచ్చి కోపంగా చూస్తున్న ఆమె చేతికి పేకెట్స్ ఇచ్చి, "సారీ సుందరీ, నువ్వెలాగూ వద్దంటావని ఒక్కడినే వెళ్ళి లాగించేశాను", అన్నాడు స్కూటర్ స్టార్ట్ చేస్తూ.

### సులేమానీ కీడా

**సులేమాని కీడా** పేరుతో ప్రసిద్ధ హాస్యనటుడు జానీలీవర్ ఓ ప్రవేట్ ఆల్బం విడుదల చేస్తున్నారు. ఓ నటుడు ప్రైవేట్ గీతాలు పాడటం ఇదే మొదటిసారి కాకపోయినా (అమితాబ్ బచ్చన్ పాడిన సంగతి తెల్సిందే కదా!) ఓ హాస్య నటుడు పాడటం ఇదే మొదలుకావచ్చు. ఖవ్వాలీ గీత పరంపరలో సాగే ఈ అల్బమ్‌లో మొత్తం 6 పాట లున్నాయి. బాలీవుడ్ ఐస్ బేనర్‌పై ఎన్.ఫరూఖ్ నిర్మిస్తున్న ఈ అల్బంకు అసద్ అజ్మీరీ గీత రచనచేస్తే మజీద్‌శోలా, చిట్టిపిల్మై సంగీతాన్నందించారు. తనకు తాను కొత్తగా ఆవిష్కరించుకునే ప్రయత్నంలో భాగమే 'సులేమానీ కీడా' అని చెప్తోన్న జానీ వీడియో అల్బంగా కూడా దీనిని విడుదలచేయనున్నట్లు చెప్పారు. గతంలో విజుషా, ఆనంద్ రాజ్ ఆనంద్‌ల సంగీతంలో పాటలు పాడి ఆకట్టుకున్న జానీ 'సులేమానీ కీడా' తో ఆకట్టుకుంటారో లేదో కొంతకాలం వేచి చూడాలి!



ఇంటికొచ్చాక "మీరొక్కరే మెక్కేస్తున్నారని కాదండీ నా బాధ. మీ ఆరోగ్యం గురించే. అవన్నీ వికటించి ఏ వాంతులో పట్టుకుంటాయేమోనని" అంది సుందరి.

"అంతేనా! నాకేం కాదులే... మనది బకాసురుడి జాతి. కల్తీ లేనిది ఎందులో చెప్పు? ఆ మాటకొస్తే కాపురాలు కల్తీకాదూ? భార్యాభర్తలిద్దరూ పాలూ నీళ్ళలా కల్సిపోవాలంటారు కదా. అది కల్తీకాదా?" అన్నాడతను.

"నే చెప్పేదీ అదేనండీ! కల్తీ కనుకే కాపురాలు వికటిస్తున్నాయి. విడాకులకు దారి తీస్తున్నాయి..." సుందరి మాటలకు అడ్డు వస్తూ "ఆగాగు... అన్ని కల్తీలూ వికటించవులే. పాలూనీళ్ళూ అనుకో కల్సిపోతాయి. పాలూ నిమ్మకాయ కల్తీ అనుకో విరిగిపోతాయి. దాంతో రసగుల్లాలు చేసుకోవచ్చనుకో అది వేరే సంగతి. అందుకే మైడియర్ స్వీట్ హార్ట్! పుల్లగా పుల్ల విరుపు మాటలతో మనసులు విరక్కొట్టుకోకుండా ఫలూడాలో ఐస్‌లాగా కల్సిపోవాలన్నమాట" అన్నాడు శ్రీనాథ్.

"అంటే మీరేం చేసినా నేను నీరు కారిపోతూ పడి వుండాలనేగా మీ ఉద్దేశం" అంది వుక్రోషంగా.

ఇదిగిదిగో రూటు మార్చేస్తున్నావ్! జనరల్ డిస్కషన్స్‌ని పెర్సనల్‌గా తీసుకుని సీరియస్ అవకూడదు. అసలు సంగతి నీకు ఆకలేస్తున్నట్టుంది తిందాంరా..." అన్నాడు.

'నాకెందుకో మనసు బావుండలేదండీ, తినాలన్పించడం లేదు' అంటూ వెళ్ళి ఆమె డ్రెస్ మార్చుకుని వచ్చేలోగా అతను బర్గర్ పేకెట్ ఓపెన్ చేసి తినడం మొదలు పెట్టాడు. ఆమె అతని ఎదురుగా కూచుని చూస్తూ "ఇంకా నయం యీయన వెజిటేరియన్ కనుక సరిపోయింది, లేకుంటే పిజ్జాలకు బదులు పిగ్గుల్ని, బర్గర్స్‌కి బదులు బర్రెల్ని తినేసేవాడేమో'! అనుకుంది.

"ఏంటి సుందరీ అలా జాలిగా చూస్తున్నావ్. యీయనకి యీ బన్ను ముక్కలేం సరిపోతాయిలే పాపం ప్రేమగా అన్నం వడ్డించేద్దామని కదూ. మంచి ఆలోచన గుడ్. వడ్డించేయ్ వచ్చేస్తున్నా' అంటూ అతను లేస్తుంటే... శ్రీవారికి కొసరి... కొసరి వడ్డిస్తుంటే అహఁఅహ.... అంతొద్దు ఇది చాలు... అంటూ తన చెయ్యి పట్టుకోవడం...

తను సిగ్గుపడి పారిపోవడం యిలాంటి సీన్ లేదు కదా నా కాపురంలో అనుకుంది బాధగా.

ఒకరోజు పొద్దునే పెసరట్లు, ఉప్మా లాగించేసి పేపర్ చూస్తూ కూచున్నాడు శ్రీనాథ్. అతనికి పెసరట్లు అందించలేక రెండు పెనాలు పెట్టుకుని అట్లు వేసీవేసీ అలసిపోయిన సుందరి జిడ్డు మొహంతో వచ్చి ఫాన్ ఆన్ చేసి కూచుంటూ, ఏమండీ పేపర్ ఒకసారిలా యివ్వండి. గుజరాత్ ఎలక్షన్స్ చదివేసి ఇచ్చేస్తా అనడిగింది. అతనివ్వలేదు.

"మిమ్మల్నేనండీ... మీరు ఎలాగూ చదవరు. ఎంతసేపూ ఏయే హోటళ్లలో ట్రీట్‌లున్నాయీ, టెమ్టింగ్ ఆఫర్లున్నాయీ, డిస్కౌంట్లున్నాయీ చూస్తారంతేగా, అదొక్కటే న్యూస్ మీకు" అంది.

"ఎందుకు చదవనూ? ఇప్పుడే చదివా.... అమితాబచ్చన్ నేషనల్ గేమ్స్ ఓపెనింగ్‌కి వచ్చినపుడు బ్రేక్‌ఫాస్ట్‌లో యిడ్లీ, కారప్పొడి తిన్నాడుట, లంచ్‌లో బెంజీఫ్రై, ఆలూ, దాల్ తిన్నాడుట. ఏమాటకామాటే చెప్పుకోవాలి నుందూ. మన హైద్రాబాద్ తిండి విషయంలో వరల్డ్ ఫేమస్ అయిందనుకో. మొన్న క్లింటన్, పుతిన్, టోనీ బ్లెయిర్ వచ్చినపుడు మన వంటకాల్ని ఎంతో మెచ్చుకున్నారుట.."

రెండు చేతులతో చెవులు మూసుకుని "ఆపండి మీరెంతసేపూ తిండిగోలే. తిండితప్ప యింకేం మాట్లాడరు. ఆ పేపర్ల వాళ్లేదో రాస్తారు. అవన్నీ తలకెక్కించేసుకోవడమేనా! ఏ మంత్రికి ఏది యిష్టం అయితే మనకెందుకు? పేపర్ యిటివ్వండి".

"అన్నట్టు మంత్రంటే గుర్తొచ్చింది. వాజ్‌పేయికి బొబ్బట్లు ఇష్టం. జయలలితకేమో... మనకెందు కండీ. మీకిదేం పిచ్చి?"

"పిచ్చికాదు ప్రియా, సేకరణ"

"దాని వల్ల మీకేం ఒరిగింది?"

బావుంది. స్టాంపులు, అగ్గిపెట్టెలు, కాయిన్స్ సేకరించే వారంతా ఏదో ఒరగడం కోసం సేకరిస్తారేమిటి? అదో తృప్తి. నీకెలాగూ రుచులూ-అభిరుచులూ లేవు. ట్రీట్‌లకూ ఫీస్ట్‌లకూ రావు. వుపవాసాలతో శుష్కిస్తే నీకేం ఒరిగింది? బి.సి.ఎ. చదివీ బి.సి. కాలం దానిలా మాట్లాడతావ్. నీకంటే మా బామ్మ నయం. ఎంత అభిరుచి కలదో తెలుసా?"

"ఆఁ ఏం వుంది లెండి. అప్పడాల కర్రలో, అట్లకాడలో సేకరించి వుంటుంది. లేకపోతే మహా అయితే జాడీలో" వ్యంగ్యంగా మూతి తిప్పుతూ అందామె.

"ఆ... వేసేశావ్ పప్పులో కాలు. మా బామ్మేం నీలా వంటింటి కుందేలు కాదు. అన్నపూర్ణలా రుచిగా వండి, వడ్డించి, భుజించి ఆరోగ్యంగా మంచి అభిరుచులు కలిగి ఉండేది. ఆడవాళ్ళు వంటింటి సామాను తప్పించి ఏం సేకరించకూడదా?" అన్నాడు. సుందరికి ఆవిడ గురించి తెలుసుకోవాలని కుతూహలం కల్గినా తను అపోజిషన్ పార్టీలో వున్నానని గుర్తొచ్చి, "చాల్లెండి గొప్పలు, చెప్పండింతకీ ఆవిడగారి అభి... రుచి..." మాటలు విరుస్తూ వెటకారంగా అడిగింది.

"రకరకాల సెంటు సీసాలు, భక్తి పాటలు కలెక్ట్ చేసింది తెలుసా." అన్నాడతను గర్వంగా.

"ఆహా! అలాగేం... మీ తాతేం సేకరించలేదా? ముక్కు పొడుం డబ్బాలు...?"

"సగం కరెక్ట్... ముక్కు కాదు గాని కాస్త వుండుచెప్తా" అని కాస్సేపు ఆలోచించి లోపలివెళ్లి కొన్ని పేపర్ కటింగ్స్, ఒక డైరీ తీసుకొచ్చి ఆమెకిచ్చాడు.

ఇష్టం లేకపోయినా వాటినొకసారి తిరగేసింది. ప్రముఖులందరి పేర్లూ వాటికెదురుగా వారికిష్టమైన పదార్థాల పేర్లూ రాసున్నాయి డైరీలో. వరదలు, భూకంపాల విరాళాల కొచ్చినపుడు పుర ప్రముఖుల గౌరవార్థం ఏర్పాటు చేసిన విందుల ఫోటోలున్నాయి. "అయ్యొరామ! విందుల్లో వాళ్లు మెక్కిన మెక్కుళ్ళ ఫోటోలన్నీ

## కమాల్ ప్రశ్న - ఢమాల్ కార్టూన్



**ఎంత కొట్టినా దెబ్బ తగలనది ?**

**కన్ను**



## సినీ'హాసం'

**ఆరోజు కారోజే పాట రాసి, రికార్డుచేసి, మర్నాడు ఊటీ వెళ్ళి పోవాలి. అదృష్టవశాత్తూ, హీరోహీరోయిన్‌ల కాల్‌షీట్లు అలా కుదిరాయి. డైరెక్టర్ కూడా బొంబాయి నుంచి ఆ రోజే వచ్చాడు. అప్పుడే అయిదారు రకాల పల్లవులు రాసి, సిద్ధంగా కూచుని చరణాలు ఆలోచిస్తున్నారు, రచయిత - ఆ పల్లవుల కాగితం చూసిన డైరెక్టర్ -**

**"ఇవి నాకే అర్థం అవలేదు. జనానికేం అర్థమవుతాయి" అని పెదవి విరిచాడు.**

**"జనం నీ అంత మూర్ఖులు కారులే" అన్నాడు రచయిత,**

**"అయితే ఆఖరు పల్లవి ఓ.కే., చెయ్యండి" అని వెళ్ళిపోయాడు.**



## కమాల్ ప్రశ్న - ధమాల్ కార్టూన్



పెట్రోలు తాగని కారు?

షావుకారు

కిందకు దిగు. తెలీలేదు కదూ నీకు. అందుకే బెండకాయ తింటే బ్రెయిన్‌కి మంచిది. నువ్వేమో ఆ జిగురు కూర అసహ్యం అంటావ్. అందుకే నీకీ మధ్య తెలివి తగ్గిపోతోంది. చెప్పేయనా ఏమిటో... చుట్టలు, బీడీల కంపెనీల లేబిల్స్ కలెక్ట్ చేశాడు మా తాతయ్య.''

"అంతకంటే ఘనకార్యం మీ మగవాళ్ళేం చెయ్యగలరు లెండి'' అనీ చెప్పినా కంపుగొట్టుకుంటూ చుట్టల పిచ్చి కంటే తిండిపిచ్చే నయం అనుకుంది మనసులో.

ఇంతలో "కైసీ హో బేటీ?'' అంటూ ఒకామె వీధి గుమ్మంలోంచి పరిగెత్తుకుంటూ వచ్చి సుందరిని వాటేసుకుని కళ్ళనీళ్లు పెట్టుకుంది. 'వుండు పిన్నీ కాఫీ కలిపితెస్తా' అంటూ వంటింట్లో కొచ్చిన సుందరి వెనుకే వచ్చి "ఎవరు సుందరీ ఆవిడ ఎందుకలా ఏడుస్తుంది?'' అన్నాడు శ్రీనాథ్.

"అయ్యోరామ! మనపెళ్ళి కొచ్చింది కదండీ. మా పిన్నిని మర్చిపోయారా? టేబిల్ మీద సర్ది వున్న పదార్థాలు గుర్తుంటాయి కాని మనుషులు గుర్తుండరు మీకు. నన్ను అన్నారు గాని మీరే మందమతి. కాస్త డైట్ కంట్రోల్ పెట్టుకోకపోతే ఎట్టిగడ్డ వెళ్ళడం ఖాయం.

"అదలా వుంచు ఆ హిందీ ఏమిటి? కన్నీళ్ళేమిటి?''

"అదా మిస్ వరల్డ్ ఏడుపంటారు లెండిదాన్ని. ఆవిడెవరో ప్రపంచ సుందరి పోటీలో గెలిచినపుడు ఆనందబాష్పాలు కుమ్మరించినప్పటి నుండి ఫేషనైపోయాయి ఏడ్వడాలు. మీరెళ్ళి మాట్లాడుతుండండి. నే కాఫీ కలిపితెస్తా.''

ఆమెకి కాఫీ కలిపి తెచ్చే లోపల ఆవిడనెలా బుట్టలో వేశాడో కాని "మా నాయనే. ఆవ పెట్టిన కూరలు అంత ఇష్టమా నీకు. ఈవూరు వచ్చేశాంగా. అపుడపుడు మా యింటికి భోజనానికి రండి'' అని ఆహ్వానిస్తున్న ఆమె మాటలు వినబడి 'అయ్యో రామ' అని తలబాదుకోపోయి చేతిలో వున్న కాఫీ గ్లాసులు పడేసి తనుకూడా కళ్లు తిరిగి పడిపోయింది సుందరి.

"'ఏమయింది ఏమయిందం'టూ హాల్లోంచి యిద్దరూ పరిగెత్తుకొచ్చి సుందరిని లేవదీశారు. "ఏమిటో ఆంటీ, ఈ మధ్య యింతే! ఏమీ సరిగా తినదు. చేతులు వొణుకుతున్నాయంటుంది. కళ్లు తిరుగుతున్నాయంటుంది....'' శ్రీనాథ్ చెప్తుంటే

"ఇదంత బెంగపడే విషయం కాదులే నాయనా సంతోషించాల్సిందే అయ్యుంటుంది'' అంటూ గోడమీద కేలండర్లో పాపాయి బొమ్మ చూపించింది. మెల్లిగా సుందరిని ఆటోలో కూచోపెట్టి దగ్గరలో వున్న డాక్టర్ దగ్గరకు తీసుకెళ్ళారు.

డాక్టర్ చెప్తోంది "మీరనుకున్నట్టు ఇదేమీ సంతోషించాల్సిన విషయం కాదు. మాల్ న్యూట్రిషన్ వల్ల యిమ్యూనిటీ తగ్గిపోయి జబ్బులొస్తాయి. తిండి సరిగా తినక తెచ్చుకున్న జబ్బయ్యుండచ్చు. లేదా "ఏనొరెక్సియా నెర్వోసా'' అయ్యుండచ్చు. స్పెషలిస్ట్‌కి చూపించండి'' అని.

ఆ పేరు వినగానే పిన్నిగారు భోరుమని ఏడవడం మొదలు పెట్టింది. ఆమెను పక్కకు పిలిచి శ్రీనాథ్, "ఆంటీ మీరేదేదో వూహించు కుంటున్నట్టున్నారు ఆ పేరు విని. అదేం భయంకరమైన వ్యాధి కాదులెండి. డిప్రెషన్ వల్ల వస్తుంది'' అన్ని చెప్పాడు. "ఏమో నాయనా డిప్రెషనో కార్పొరేషనో నాకేం అర్థం అవుతాయి! స్పెషలిస్ట్‌కి చూపిద్దాం'' అంది.

స్పెషలిస్ట్ వారం తర్వాత అపాయింట్‌మెంట్ ఇచ్చాడు. "ఇంకా వారం రోజులా? నా సందూ ఎప్పుడు బాగుపడుతుంది? ఎప్పుడు వండిపెడుతుంది? చీపురు పుల్లల్లాంటి చేతులెప్పటికి బలం పుంజుకుంటాయి? నా సుందరిని బాగుచేసే నాథుడే లేడా నాథుడే లేడా?'' అని పెద్దగా అరిచాడు.

"ఆ నాథుడు నువ్వే శ్రీనాథా''! అని విన్పించి ఆశ్చర్యంగా తలెత్తి చూశాడు. వెనక్కి దువ్విన జుట్టుతో ఆరోగ్యంతో కళకళలాడుతున్న ముఖంతో స్లిమ్‌గా ట్రిమ్‌గా ఎదురుగా కన్పించినతన్ని చూసి "డాక్టర్ బాబాయ్ నువ్వెప్పుడొచ్చావ్ దుబాయ్ నుంచి'' అన్నాడు.

"మీ యింట్లో పరిస్థితి మన పారిశ్రామిక వ్యవస్థలాగానే వుందే. చేసేవాడి కష్టం మేసే వాడికేం తెలుస్తుంది? ఫైవ్‌స్టార్ హోటల్ ముందు బక్కచిక్కి గుంటలు పడ్డ కళ్ళతో గుప్పెడు మెతుకులు లేక పడుతున్న బిచ్చగత్తెలా ఎలా వుందో చూడు'' అంటూ సుందరివైపు చూశాడు.

"ఇప్పుడే రావడం. ఎయిర్‌పోర్ట్‌లోనే నీ కథ తెలిసింది. సరాసరి ఇటొచ్చేసా. ఎందుకో తెలుసా. నీ చేతికి సంకెళ్ళు తగిలించి, నీ మూతికి చిక్కం వెయ్యడానికి. భోజన ప్రియత్వం మన వంశపారం పర్యమనుకో. ఏమిటా అతి తిండి? యాభై ఏళ్లు పైబడిన నేను లేనా ట్రిమ్‌గా? ముప్పయ్యేళ్లు కూడా లేవు డ్రమ్‌లా ఎలా వున్నావో చూడు. రుచయినా అభిరుచయినా అతి అయి వెర్రిగా మారకూడదురా. నువ్వేం చేస్తావులే. వీధివీధికొక మిఠాయి కొట్టు, ప్రతి వీధి చివర ఒక దోశల బండి. జీవనోపాధికి వారు నడుపుతున్నంత మాత్రాన, అవసరం పడిన వాళ్లు కొనుక్కుంటారు గాని నీకెందుకురా ఫాస్ట్‌ఫుడ్? ఫాస్ట్‌గా పైకిపోయి బామ్మని కలుద్దామనా..జగడొక్క వీరా?''

"అమ్మాయ్! సుందరీ...వ్యతిరేక సుందరీ.. బావుందమ్మా మీ యిద్దరి వరస. అతి తిండి ఎంత ప్రమాదమో అసలు తినకపోయినా అంతే ప్రమాదం. స్త్రీ శక్తి స్వరూపిణి అంటూ జండాలు పట్టుకుని వూరేగుతారు. పదడుగులు వేసేసరికి పడిపోతారు. నీవంటి యువతిని ఆదర్శంగా తీసుకుంటే భావితరం గతేమిటి? అంటే నా వుద్దేశం మీ సంతానం ఎలా వుంటుందంటావ్? చూడు యిలా వుంటుంది'' అంటూ పక్కనే వున్న మేగజైన్‌లో పెద్ద పొట్ట సన్నటి కాళ్లు చేతులతో చూడగానే నవ్వొచ్చే ఒక కార్టూన్ చూపించాడు.

అది చూడగానే సుందరికి ఫక్కున నవ్వి "అయ్యోరామ అలాంటి గతి రానివ్వనులెండి. ఇకనుంచి మేమిద్దరం మీరు చెప్పినట్లు వింటాం'' అని మాట ఇచ్చేస్తుంటే శ్రీనాథ్ గిలగిల్లాడిపోయాడు.

ఏడాది తర్వాత ఆ రోజు జనవరి ఒకటో తేదీ. శ్రీనాథ్, సుందరిల వంశాంకురానికి ఇరవై ఒకటో రోజు. అందంగా ఆరోగ్యంగా మా తరం ఎంతో శక్తివంతమైనదిగా అన్నట్టు గర్వంగా నవ్వుతున్నట్టున్న పసివాడిని చూస్తూ నూతనోత్సాహంతో ఆశీర్వదిస్తూ అక్షింతలు చల్లారు బంధువులంతా.

# లలిత సంగీతం



ప్రముఖ గాయకుడు,
స్వరకర్త లలిత సంగీత
విద్వాంసుడు, వాగ్గేయకారుడు

**ఎం.చిత్తరంజన్**

సమర్పిస్తున్న శీర్షిక ఇది.
ఫోన్ నెం. 040-7402993

## యుగయుగాలుగా...

ప॥ యుగయుగాలుగా నన్నే కోరియుండె కాబోలును
నేనడిచే దారిచెంత నిలిచియుండెనో ఏమో॥

1.చ॥ ఏనాడోసంజవేళ మసకమసక వెలుతురులో
కనుగోనల నేనాతని కాంచియుంటిననిపించును
నేనడిచే దారిచెంత నిలిచియుండెనో ఏమో ॥యుగ॥

2.చ॥ వెలుగుజిలుగు పాటలతో నేడే జాబిలి నివాళి
వీడిపోవు నీలి ముసుగు నిశాముఖము నుండి వ్రాలి
వెన్నెల వెలుగుననాతడు కన్నులెదుట కనిపించగ
తెరలన్నీ చిటికెలోన సురిగి మాయమైపోవును
నేనడిచే దారిచెంత నిలిచియుండెనో ఏమో ॥యుగ॥



| | |
|---|---|
| రచన | : కీ॥శే॥ అబ్బూరి రామకృష్ణారావు |
| సంగీతం | : డా॥బాలాంత్రపు రజనీకాంతరావు |
| గానం | : ఎం.చిత్తరంజన్ |
| రాగం | : మధువంతి (హిందుస్తాని సంగీతం) |
| తాళం | : రూపకం (కర్ణాటక సం॥) |
| | - దాద్రా (హిందుస్తాని సం॥) |
| ఆరోహణ | : స రి గ మ ప ని స |
| అవరోహణ | : స ని ద ప మ గ రి స |

- షడ్జము, సాధారణ గాంధారం, ప్రతి మధ్యమం, పంచమం, కాకలినిషాదం ఆరోహణలోనున,
షడ్జము, కాకవినిషాదం, చతుశ్శృతి దైవతం, పంచమం, ప్రతి మధ్యమం, సాధారణ గాంధారం, చతుశ్శృతిరిషభం అవరోహణలోను వుండే స్వరాలు

మధువంతి ఔడవ సంపూర్ణ రాగమైతే, కర్ణాటక సంగీతంలో యీ స్వరాలతో సంపూర్ణ రాగంగా ధర్మవతి (59వ మేళకర్తగా) ప్రసిద్ధి చెందినది. బాగా వాడుకలో వున్న రాగమిది. మధువంతిలో ఆరోహణలో రిషభ, దైవతాలు లేకపోయినా, లలిత సంగీతంలో బాణీలు కూర్చేటప్పుడు స్వతంత్ర స్వరసంచారం గావించే వెసులుబాటు వున్నది గనుక స్వరకర్తలు కేవలం రాగ మూర్ఛనకు కట్టుబడకుండా ఆ రాగంలోని స్వరాలను మాత్రమే గ్రహించి వాటిని యధేచ్ఛగా వాడుకుంటూ ఎన్నో హృద్యమైన బాణీలు కూర్చడం జరుగుతూంటుంది. అనగా రాగంలోని స్వరాలను ఆధారంగా చేసుకుని రసభావాలకు అనుగుణంగా సంగీత రచన చేయడం అన్నమాట. అదే లలిత సంగీతంలోని ప్రత్యేకత, విశిష్టత. విశ్వకవి రవీంద్రనాథ్ టాగూర్ "Red Oleanders" అని ఇంగ్లీషులోను, దానినే "రక్త కరబీ" అని బెంగాలిలోను నాటకం వ్రాశారు. దానిని సుప్రసిద్ధ కవి అబ్బూరి రామకృష్ణారావుగారు "ఎర్రగన్నేరు" పేరుతో తెనిగించారు. 1960 ప్రాంతంలో ఆంధ్ర విశ్వవిద్యాలయానికి రిజిస్ట్రారుగా పనిచేసిన కె.వి.గోపాలస్వామిగారు హైదరాబాదు ఆకాశవాణిలో వున్న రజని గారిని విశాఖపట్టణానికి ఆహ్వానించి స్టేజి నాటకంగా ప్రదర్శింపజేశారు. అదే నాటకాన్ని 1961లో ఆకాశవాణి హైదరాబాదులో రజని గారు సంగీత రూపకంగా ప్రసారం చేయించి అందులో నాచేత అయిదు చక్కగా పాటలు పాడించారు. వాటిలోదే 'యుగయుగాలుగా" అన్న గీతం. ఎంతో భావుకత, మరెంతో ఆశాభావము నిండి వున్న మధుర కవిత యీ గేయం. విషయం పూర శృంగారం. ఆత్మీయ వ్యక్తితో గల జన్మాంతర అనుబంధం అడుగడుగునా తలవుల తలుపు తట్టినప్పుడు మనసులో వీచే



మధుర వీచిక. కన్ను కొసల నుండి ఎప్పుడో మసక వెలుతురులో ఆ వ్యక్తిని చూసిన జ్ఞాపకం. నీలినీడ నిశాముఖం నుండి జారినప్పుడు వెలుగు వెన్నెలలో ఆతడు కనిపించుననే విశ్వాసం మనిషిని ముందుకు నడిపించే రేపుపై గల నమ్మకం యీ పాటగా రూపు దాల్చిందేమో! రవీంద్రుని కవితా వైభవాన్ని బహు సుందరంగా రూపు కట్టించారు రామకృష్ణారావు గారు. రజని గారి సంగీతం పూవుకు తావి అబ్బినట్లుగా ఆ పాటకు వన్నె చేకూర్చింది.

**కీ॥శే॥అబ్బూరి రామకృష్ణారావు**

1896లో జన్మించిన సుప్రసిద్ధ కవి అబ్బూరి





2వ చరణంలో మొదటిరెండు పంక్తులు

"వెలుగు జిలుగు పాటలతో...

వీడిపోవు నీలి ముసుగు... పల్లవి లాగా పాడాలి

తరువాతి పంక్తులు

"వెన్నెల వెలుగుననాతడు..." మొదటి చరణం వలె పాడాలి.

రామకృష్ణారావుగారు మైసూరు మహారాజా సంస్కృత కళాశాలలోను, కలకత్తాసిటీ కాలేజీలోను విద్యాభ్యాసం చేశారు. బి.ఎ, ఎఫ్.ఎల్.ఎ. పాసయ్యారు. తెలుగు, కన్నడ, సంస్కృతం, హింది, బెంగాలి, ఇంగ్లీషు భాషలలో విశేషమైన పాండిత్యం గలవారు. ఆంధ్ర విశ్వవిద్యాలయంలో తెలుగు శాఖలో లెక్చరర్‌గాను, గ్రంథాలయానికి చీఫ్ లైబ్రేరియన్‌గాను పనిచేశారు. పద్యం, గేయం, నాటకం మొదలైన అన్ని సాహితీ ప్రక్రియల్లోనూ ఆయన తనదైన విశిష్టమైన శైలిలో రచనలు గావించిన గొప్ప కవి. ఊహాగానము-పూర్వప్రేమ, మల్లికాంబ, నదీసుందరి-అబ్బూరి వారి కృతులు. వీరు రచించి "ఓ విశాలావనీ శోభాతిపావనీ", "పాడవే పాడవే బంగారు తల్లీ", "రావె సంధ్యాకామినీ", "రేయిగడచె పొద్దుపొడిచె" మొదలగు సుందర గేయాలన్నీ వున్నాయి. ఆకాశవాణి వీరి గేయాలెన్నిటినో ప్రసారం చేసింది. ముద్దుకృష్ణ 1935లో సంకలనం చేసిన "వైతాళికులు" గ్రంథంలో "పద గుంభన యీయన ప్రత్యేక ప్రతిభ. గీతాలలో గొప్ప హుందా గోచరిస్తుంది. ఉత్తమ సంస్కృత కావ్యాలలోని పూర్ణతా, గౌరవమూ, గాంభీర్యమూ యీయన పద్యాలలో ప్రతిబింబిస్తవి. నన్నయనాటి అక్కరలకు మార్పులు తెచ్చి కొత్త నడకలు నడిపించడమే కాకుండా, స్వకపోల కల్పితాలైన నూతన ఛందస్సులు కూడా కల్పించాడు. ఈయన పద్యాలలో ఒక్క పలుకు పట్టి చూసినా ఉత్తమ సంస్కారి అని తెలుస్తుంది" అంటూ అబ్బూరి వారి ప్రతిభను కొనియాడారు.

## ధర్మవతి రాగం ఆధారంగా కొన్ని సినీ గీతాలు



| | పాట | చిత్రం | గానం | సంగీతం |
|---|---|---|---|---|
| 1. | అందెల రవమిది | స్వర్ణకమలం | బాలు, వాణీ జయరాం | ఇళయరాజా |
| 2. | కొంటెగాణ్ణి కట్టుకో | జెంటిల్‌మెన్ | బాలు, జానకి | ఎ.ఆర్.రహమాన్ |
| 3. | 'చీకటి వెలుగుల కౌగిలిలో' అనే పాటలో 'తేట నీటినీ ఏటి ఒడ్డున నాటిన పువ్వుల తోట' అనే చరణం | చీకటి వెలుగులు | పి.సుశీల, బాలు | చక్రవర్తి |
| 4. | డోన్ట్ మిస్ సోదరా | జయం మనదేరా | శంకర్ మహదేవన్ | వందేమాతరం శ్రీనివాస్ |

సీరియల్

11

# సినీతిచంద్రిక

రావి కొండలరావు



### జరిగిన కథ

ఒక ఊళ్లో ఒక ధనవంతుని కుమారుడు సినిమా తీస్తానని పట్టుబడతాడు. ఒక మాజీ దర్శకుడు వచ్చి వాళ్లకు సినిమా తీయడంలో సాధక బాధకాలు చెప్పసాగేడు. "నిర్మాత హీరోయిన్ మోహంలో పడడం వల్ల నా మొదటి సినిమా ఫెయిలయింది. ఆకలికి మాడుతుండగా ఫలానా అనే ఒకతను వచ్చి కొత్త నిర్మాత వద్దకు తీసుకెళ్లాడు. కథ గురించి చర్చించాక ఊరెళ్లి డబ్బులు తెస్తానని చెప్పి నిర్మాత మాయమయిపోయాడు. ఆకలిబాధలు తాళలేక ఓ పెద్ద డైరక్టరు వద్ద అసిస్టెంటుగా జాయిన్ అవుదామని వెళ్లాను ఒకామె వేషం కోసం వచ్చింది..."

(ఇక చదవండి)




"ఆ అబ్బాయిది ఏలూరో- ఒంగోలో, శ్రీకాకుళమో నాకు జ్ఞాపకం లేదు. వాళ్ళ ఊళ్ళో బాగా నాటకాలు ఆడినవాడట. ఆ నాటకాలు చూసినవాళ్ళు అతన్ని సినిమాలో చేరమన్నారట. ఇంకేముంది ఆ సలహాను గట్టి సిఫార్సు జేబులో వేసికొని, ఆ అబ్బాయి మద్రాసు జేరాడు. ఇంటినుంచి తెచ్చుకున్న నాలుగుడబ్బులూ ఉన్నాయిగావును హోటల్లో దిగాడు. అతని ఉద్దేశం ఏమిటి - వారం రోజులలో ఎక్కడైనా తాను బుక్కవుతానని!

అందుకని వారం రోజులకు సరిపడే గ్రాసం దీసుకొచ్చాడు. మద్రాసులో ఉన్న నిర్మాతలందర్నీ చూశాడు. తాను ఎంతటి మహానటుడో, తన ఊళ్ళో తనకు నటునిగా ఎంత పేరుందో అవన్నీ చెప్పాడు. వాళ్లు మామూలుగా అన్నట్టే 'చూదాం' అన్నారు. ఆ అబ్బాయికనిపించిందీ - నిర్మాతలూ వాళ్ళూ వెయ్యికళ్ళతో కొత్తవాళ్ళ కోసం ఎదురుచూస్తూ ఉంటారూ. తనవంటి నాటకానుభవం గలవాడైతే, కావలించేసుకుని వేలకువేలు పోసేసి బుక్ చేస్తారు అని! అదేం జరక్కపోయేసరికి తికమకపడ్డాడు. వారం రోజులూ 'టైటిల్స్'లా తిరిగిపోయినై. ఇంక 'కథ' ఎట్లా ప్రారంభమవుతుందో అతనికి అర్థం కాలేదు. హోటలు ఖాళీ చెయ్యాలి. ఖాళీ చేస్తే ఎక్కడికెళ్ళాలి? ఏం వేసుకు తినాలి? ఎట్లా? అని మధనపడ్డాడు. తెలిసినవాళ్ళేవరైనా ఉంటే, వాళ్ళ ఇళ్ళకు పోవచ్చుననుకున్నాడు. ఎవరుంటారు?

హోటల్లో ఉన్న సామాన్లు తీసుకుని బయల్దేరాడు. ఒక ప్రొడక్షన్ ఆఫీసుకొచ్చి - తాను ఫలానా అని ఏదో పనిమీద వచ్చానని, ఆ రాత్రికి

ఉంటానని బ్రతిమాలుకున్నాడు. వాళ్ళు జాలిపడి ఉండమన్నారు. ఆ రాత్రి అక్కడ ఉన్నాడు. ఆ మర్నాడు వెళ్ళాలంటే ఎక్కడికి వెళతాడు? ఆ రాత్రిలోగా తాను బుక్ అవనా, దివ్యమైన భవనంలోకి వెళ్ళిపోనా అనుకున్నాడు.

అక్కడో రెండు రోజులున్నాక, వాళ్ళు అడిగారు. తానింకా బుక్ అవాలనీ కాగానే వెళ్ళిపోతానన్నాడు. లేకపోతే వాళ్ళనే బుక్ చేసుకోమన్నాడు. ఈ వ్యవహారం వాళ్ళకు చిరాకెత్తి, పెట్టాబేడా బయటపారేశారు- అతను మళ్ళీ తిరిగాడు. ఇంకెవరూ రానివ్వలేదు. ఆకలివేస్తూవుంటే, ఆ సరుకులు కాస్త ఎక్కడో అమ్మేశాడు. అవీ అయిపోయినై. ఇంటికిరాస్తే అక్కణ్ణుంచి వచ్చేదేమీలేదు. ఆఖరికి చింకిగుడ్డలూ, చీకిపోయిన జుట్టుతో కొన్నాళ్ళు తిరిగాడు. వాళ్ళనూ వీళ్ళనూ అణా బేడా ముష్టెత్తాడు. ఎక్స్‌ట్రా వేషాలైనా వేస్తానంటే దానికీ అనుభవం కావాలన్నారు.

ఆ విధంగా ఆ కుర్రాడు ఈ 'ఎండమావుల్ని' చూసి, భ్రమించి నానాఅవస్తలు పడి శాడ్‌సాంగ్స్ పాడుకోవడానికి కూడా శక్తిలేనంతగా నీరసించిపోయాడు. ఆ తర్వాత ఏమయ్యాడో నాకు తెలీదు. ఎవరింట్లోనో నౌకరుగా కుదురుకున్నాడని ఎవరో అన్నారు. వాళ్ళ ఊరెళ్ళిపోయాడని ఇంకెవరో అన్నారు. మొత్తానికి ఆ విధంగా 'ఖేద' పడి ఆ అబ్బాయి కనిపించకుండా పోయాడు. చూశారా! ఇదంతా చిత్రఖేదం! ఇన్ని బాధలు పడాలి. పడినా అవకాశం వస్తుందో లేదో ఎవరూ చెప్పలేరు'' అని ముగించాను.

ఆమె కోపంగా చూసి - "ఇవ్వనని అనరాదూ! ఈ కథ అంతా ఎందుకు?'' అని చిరాగ్గా వెళ్ళబోయింది, ఆమెను నేను మళ్ళీ పిలువబోయేసరికి, నాకు పిలుపొచ్చింది - లోపల్నుంచి దర్శకుల వారి వద్దనుంచి.

"ఎవరది - నువ్వు మాట్లాడుతున్నావు?" అని అడిగాడు దర్శకుడు.

"ఎవరో - సినిమాల్లో వేషాలకోసం వచ్చింది."

"ఐతే, నువ్వు మాటాడటం ఏమిటి? - ఇట్లా రమ్మను" గద్దించాడు.

నాకు చాలా కోపం వచ్చింది - ఈ గద్దింపుకు. అయినా వెళ్ళి పిలిచాను. ఆమె లోపలికి వెళ్ళింది. నేను అక్కడే కూచున్నాను. కాసేపటికి దర్శకుడు పిలిచాడు.

"ఏమయ్యా - మంచీ మర్యాద అక్కర్లేకుండా ఈమెతో కథలేవో చెప్పావుట - నిన్ను ఇక్కడ కథలు చెప్పటానికా వేసుకున్నది? ఆ ఇంటరెస్టుంటే కథకుడిగా ట్రై చేసుకోరాదూ?... అసలు ఈ ఫీల్డులో ఉన్న తెగులు ఇదేనండీ. ఎవడి పని వాడు చేసుకోడు. ప్రతీదాంట్లోనూ ప్రతీవాడు తల దూరుస్తాడు. ఐనా మన చిత్రంలో వేషాలు లేవని ఎవరు చెప్పారు నీకు? అధిక ప్రసంగాలు." అని తిట్టాడు.

ఈపాటికే నాకు కోపం బాగా వచ్చేసింది. ఆమాటలింక సహించలేకపోయాను. లోపలున్న పౌరుషం పెల్లుబికింది. ఆ పాతిక రూపాయలు తీసి, టేబిలు మీద కొట్టి - "అయ్యా చాలా థాంక్స్! ఎంత అసిస్టెంటు డైరెక్టరు ఉద్యోగానికి నా ఖర్మంకాలి వచ్చినా, నాలోనూ మానం, పౌరుషం ఉన్నాయి. మీలాగే నేనూ దర్శకుడి హోదాలో ఉంటే మీరన్న మాటలకు సమాధానం ఇచ్చి వుండేవాడిని. కాని ఈనాటి నా స్థితి వేరు. ఎంత పొట్టకూటికని సహాయదర్శకుడిగా వస్తే మాత్రం ఇంత నీచంగా మాట్లాడతారా? నన్ను తూలనాడటానికి మీకేం అధికారం లేదు. ఇట్లా కాకపోతే అట్లా అని చెప్పండి. అంతేకాని, మేమంతా మీకింద బానిసలం అని మాత్రం అనుకోకండి. సెలవు. మీకో సెలవు - మీ ఉద్యోగానికి రెండు సెలవులు'' అని ఉద్రేకంతో గడగడా అనేసి, దూకుడుగా బయటపడ్డాను. అంతే! ఆ క్షణమే నిర్ధారణ చేసుకున్నాను. ఇటువంటి డైరెక్టర్ల దగ్గర అసిస్టెంటుగా చెయ్యరాదని! అంతకన్నా వీధినపడి ముష్టెత్తుకోవటం మేలు.

ఫలానా ఇచ్చిన అర్ధరూపాయితో ఆ పూట గడుపుకున్నాను. మధ్యాహ్నం అంతా ఎండలో తిరిగాను. ఎందుకు తిరిగానో తెలీదు - కాని ఉద్యోగం కోసం మాత్రం కాదు. సాయంత్రం పార్కు వైపు వెళ్ళేసరికి బెంచీమీద ఫలానా కూచుని ఉన్నాడు.

"రండి గురూ గారూ, బెంచీ చిన్నబోయింది గదండీ!" అంటూ ఆహ్వానించాడు. అతని ప్రక్కనే కూచుని, జరిగినదంతా చెప్పాను.

"మంచిపని చేశారు గురూజీ! మీకెందుకు గురూ, నిజం నిలకడ మీద తేల్తుంది. సత్యమే జయం .... ఉన్నమాటంటే ఉలు కెక్కువ... ఇటువంటి విలన్లంతా 'ది యెండ్' ముందు శిక్షణ పొందుతారు. అంటే, గురూ, పిక్చర్‌లో అని కాదు నా ఉద్దేశం. వాళ్ళ లైఫ్‌ల 'ఎండ్' ముందు అన్నమాట!... అదేమిటండీ, అట్లా ఖేదపడిపోతున్నారు మరీనూ, పిల్లాడు తప్పిపోయిన హీరోయిన్‌లా! మానవ జీవితమందు ఖేద మోదములు రాత్రీ పగళ్ళవంటివి. ఎండా, వెన్నెలా వంటివి. కలకాలం కాపురం ఉండనివాటినే కష్టాలంటారు. సరే, గురూ - చిన్నకథ చెబుతాను. అంతా విని సమాధానం చెప్పాలి. ఏమిటంటే....

ఒక ఊళ్ళో ఒక డబ్బున్నవాడున్నాడు.







అతనికో కుమార్తె ఉంది - ఆమె పేరు నిర్మల. ఈ నిర్మల ఒక బీద కుర్రవానిని ప్రేమించింది - అతనూ ప్రేమించాడు. కాని ఆ తండ్రి 'లైలా-మజ్నూ' ఫాదర్ లాంటివాడు. కుర్ర వాణ్ణి చంపేస్తానన్నాడు. ఆ అమ్మాయిని బయటకు రానివ్వకుండా కట్టడి చేశాడు. ఐనా వాళ్ళు ప్రేమ మానుకొన లేదనుకోండి. గురూజీ - చెప్పండీ ఈ ప్రేమ ఏమవుతుంది? ఫలిస్తుందా?... ఆలోచించి చెప్పండి."

"నాకు తెలీదు'' అన్నాను.

"అయ్యో గురూజీ - ఆ ప్రేమ జయిస్తుంది గురూ! ఎట్లాగంటారా - నిర్మల ప్రేమ జయిస్తుంది కాబట్టి! బావుందా? ఊరికే సీరియస్ సీన్ మధ్య హాస్యపు సీనులాగా, ఈ ఖేదాల మధ్య చిన్న తమాషా. అన్నట్టు - ఈ రాత్రి నాకో కాల్ షీటుంది గురోయ్!"

"అదెక్కడ?"

"ఫిల్మ్ స్టూడియోలోనే ఒక చిన్నవేషం ఉందిట. నన్ను వెయ్యమని బలవంతం చేశారు. నాకసలే తీరికలేదన్నాను. ఇప్పటి కిప్పుడు కాల్‌షీట్ అడిగితే ఎక్కడ తీనుకురాను అన్నాను. వాళ్ళుబ్రతిమాలారు. ఐతే నైట్ వేసుకోమన్నాను. తెల్లారేప్పటికల్లా పిక్చర్లోని నా వేషం అంతా కంప్లీటు చెయ్యాలన్నాను. అన్నింటికి వాళ్ళు ఒప్పుకున్నారు!" అని నవ్వాడు.

"కోతా?" అన్నాను.

"కోత కాదండి. నిజంగానే వేస్తున్నా. చిన్న వేషమంట .... ఈ రాత్రి మాత్రమే ఉంటుంది. ఊరికే చెప్పాను. మీకు తెలియదులెండి ఈ ఇండస్ట్రీలో అట్లాగే చెప్పాలి. లేకపోతే పెద్దవాళ్ళం కాలేమట."

"నాకేం తోచటం లేదోయ్."

"మీకెందుకు .... మీరూ రండి, నాతో షూటింగుకు, హాయిగా ఉంటుంది, అన్నట్టు గురూ. ఆ ప్రొడక్షన్ మానేజరు గట్టివాడు. నన్ను భోజనం చేసేసి, ఎనిమిదింటికల్లా ఈ బెంచీమీద కూచో మన్నాడు. పోతూ పోతూ అతనొచ్చి నన్ను తీసుకుపోతాట్ట! అదేం కుదరదు, ఎనిమిదింటి కయితే భోజనం నువ్వే పెట్టించు అన్నాను. నా దగ్గరా వేషాలు? ఏంలేదు, నాకు భోజనం పెట్టించినట్లు లెక్కచెప్పి, ఆ రూపాయి డబ్బులూ జేబులో వేసుకుంటాడు. అన్నట్టు .... నా దగ్గరో రూపాయుంది. ఎక్కడిదని అడక్కండి. దొంగతనం చేసి సంపాయించింది మాత్రం కాదు. మీరు వెళ్ళి భోజనం చేసి రండి. ఖేదంలో నయినా మోదపడుతూ ఉంటే, డబ్బులు యిట్లాగే వస్తావుంటాయి. ఇందండి,'' అని రూపాయిచ్చాడు.

నేనేమీ అనలేదు. తీసుకొని, జేబులో వేసుకున్నాను.

"ఈ ఇండస్ట్రీ మరి బాగుపడదేమిటోయ్ ఫలానా!" అన్నాను.

"ఇండస్ట్రీకేమండి .... నిక్షేపమ్మల్లే ఉంది. ఎటొచ్చీ మనం బాగులేముగాని, మనం బాగా లేకపోయినంత మాత్రాన ఇండస్ట్రీని ఎందుకండీ తిట్టడం! నాలుగు రోజులు ఇటూ, నాలుగు రోజులు అటూ కాస్త బాగున్నాం అనేసరికి ఇంక కలకాలం అట్లాగేఉంటాం కాబోలని అనుకోవడం మాత్రం పనికిరాదు. సినిమా పరిశ్రమలో ఎప్పటికి నిలబడగలిగనట్టో మనం చెప్పలేము. ఒక చిన్న కథ చెబుతాను ఖేదం మాని వినండి .... ఏమిటంటే....

ఆ మధ్య కొత్తగా ఒక అమ్మాయి చిత్రాల్లోకి వచ్చింది. చాలాకాలం నుంచి ట్రై చేస్తూనే ఉందనుకోండి. నాలుగేళ్ళ ప్రయత్నానంతరం చిత్రాల్లో చిన్నచిన్న వేషాల్లో ప్రవేశించి, క్రమక్రమేణా పెద్ద వేషాలు వేసింది. సెకండు హీరోయినయింది. అంతకుపూర్వం, ఎవరేనా ఏం పిక్చర్లో ఉన్నావని అడిగితే, ఫలానా పిక్చర్లో "సిక్స్త్ హీరోయిన్‌నండి, సెవెన్త్ హీరోయిన్‌నండి" అని చెప్పేది. అంతేగాని మామూలుగా చెప్పేదికాదు.

అక్కణ్ణుంచి అట్లా అట్లా సెకండ్ హీరోయిన్‌కు వచ్చింది, ఐదారు చిత్రాలొచ్చాయి. దాంతో టెక్కు బలిసింది. నాకేం అనుకుంది. అసలా అమ్మాయిని, అల్లా తయారుచేసింది వాళ్ళనాన్నేలే! పెత్తనం అంతా ఆయనదే. ఇంటికి వచ్చిన ప్రొడక్షన్ వాళ్ళ మీదా, చూడటానికి వచ్చిన వాళ్ళ మీదా, జర్నలిస్టుల మీదా ఎగిరేవాడు. చేతిలో పత్రిక ఉంది కాబట్టి జర్నలిస్టులు తెగ రాసేవారు. ప్రొడ్యూసర్లూ వాళ్ళూ వేషాలు ఇవ్వటం మానేసారు. నాలుగు చిత్రాలు రాగానే కారొకటి కొన్నారు. షూటింగుకు ఆలస్యంగా వెళ్ళటం, వెనకాల పనిమనిషిని, పెద్దపెద్ద బాస్కట్లనూ, ఫ్లాస్కులనూ తీసికెళ్ళటం, కాల్‌షీటులో ఇంకా, టయిముండగానే వెళ్ళిపోతాననటం - ఇవన్నీ నేర్చుకుంది.

**(ఇంకావుంది)**



జనవరి 3న శివకుమార్ శర్మ పుట్టినరోజు పురస్కరించుకుని....

# సంతూర్ వాదనలో హిమశిఖరం శివకుమార్ శర్మ



పసితనాన జమ్మూలోని హిమాలయాల లోయలు, శిఖరాల మీదుగా వినవచ్చే ప్రకృతి సహజ సంగీతం వెదజల్లే పరిమళాలు శీతల పవనాలుగా తన ఎదను మీటిన సందర్భాలింకా ఆయనకు కొత్తగానే అనిపిస్తాయి. తమ ఇంటి ముంగిట్లో నిలబడి చూస్తే కనపడే వైష్ణోదేవి ఆలయం, వినిపించే తావీనది అలల సవ్వడి ఇంకా గుర్తున్నాయి. కాశ్మీర్ కొండల్లో మంచుగడ్డలు కరిగిన నీరవుతున్నప్పుడు చోటుచేసుకునే సన్నసన్నని స్వరరాగాలను సహజంగా తన సంగీత సృజనలో ఆవిష్కరిస్తారు. మరోలా చెప్పాలంటే కాశ్మీరీ కొండ కోనల్లో జానపదులు మీటే వీపంబికి శాస్త్రీయతను ఆపాదించి దాన్ని ప్రపంచవ్యాప్తంగా ప్రశస్తంచేశారు. ఇప్పటికే ఆయనెవరో అర్థమై ఉంటుంది.

## శివకుమార్ శర్మ

ఇరవై రెండేళ్ల వయసులో బొంబాయి సెంట్రల్ స్టేషన్‌లో పెట్టేబేడతో దిగిన ఆయన జేబులో 500 రూపాయల నగదు మాత్రం ఉంది. జమ్ము రేడియో కేంద్రంలో తండ్రి ఇస్తానన్న మ్యూజిక్ ప్రొడ్యూసర్ ఉద్యోగాన్ని వద్దని శాస్త్రీయ సంగీతంలోనే తన భవిష్యత్తును వెదుక్కునేందుకు బొంబాయి వచ్చారు శివకుమార్ శర్మ. అంతకుముందే 1955లో బొంబాయిలో జరిగిన "హరిదాస్ సంగీత సమ్మేళన్'' లో అప్పటివరకూ అనవంతి లభించని శత తంత్రి వీణతో చేసిన కచేరి అతడికి జాతీయ స్థాయిలో గొప్ప పేరు తెచ్చి పెట్టింది.

సంతూర్ వాదకునిగా శివకుమార్ శర్మ ప్రపంచ వ్యాప్తంగా పేరొందిన కళాకారుడు. 1938 జనవరి 3న జమ్ములో జన్మించారు. తండ్రి ఉమాదత్ శర్మ బనారస్ ఘరానాకు చెందిన గాత్ర విద్వాంసులు. పండిట్ బడేరామదాస్‌జీ శిష్యులాయన. తండ్రి అడుగుజాడల్లో పయనించిన శివకుమార్ శర్మ అయిదవ ఏట నుండి సంగీత శిక్షణ ప్రారంభించారు. ఉమాదత్ శర్మ జమ్ము ఆకాశవాణి కేంద్రం ఇన్‌చార్జిగా ఉన్న సమయంలో సంతూర్ వాద్య పరికరాన్ని గురించి విని ఉన్నారు.

అప్పటికే తబలా, గాత్ర విద్వాంసుడిగా శిక్షణలో ఉన్న శివకుమార్ తండ్రి మాటకు కట్టుబడి సంతూర్ పై సాధన ప్రారంభించారు. పండిట్ శివకుమార్ శర్మ కృషి ఫలితంగా ఇపుడు దేశంలోనే కాదు ప్రపంచంలో ఎక్కడ సంగీత సభలు జరిగినా సంతూర్ వాద్య కచేరి లేకపోతే అవి సంపూర్ణం కావు. వాటికి నిండుదనమూ రాదు. తిశ్ర, చతురశ్ర, మిశ్రతుల్పి, విలంబిత జపతాళ్, ధృతతన్ తాళ్‌లోనూ మధురంగా సంతూర్‌ను వాయించినప్పుడు.

"బొంబాయి చేరుకున్న తొలినాళ్లలో సంతూర్ కచేరీలు చేయమనేకన్నా సినిమాల్లో వేషాలు వేస్తావా అనే అవకాశాలు ఎక్కువగా వచ్చేవని" అంటారాయన. "1955లో వి.శాంతారాం "ఝనక్‌ఝనక్ పాయెల్ బాజే''లో, "సాత్ హిందుస్థానీ" లో ఒక పాత్ర చేయమని అడిగారు. ఆ తర్వాత హేమంత్‌కుమార్ తన "బీస్ సాల్ బాద్" ప్రధాన పాత్ర పోషణకు ఆహ్వానించారు. కానీ సంతూర్ పై స్వరాలు పలికించడానికే నేనెక్కువగా ఇష్టపడ్డానని గత మే నెలలో ఒక పత్రిక కిచ్చిన ఇంటర్వ్యూలో చెప్పుకున్నారాయన.



శివకుమార్ శర్మ కుమారుడు రాహుల్ కూడా సంతూర్ వాదనలో నిష్ణాతుడై దేశ దేశాల్లో కచేరీలు చేసే స్థాయికి ఎదిగాడు. ఆదిత్య చోప్రా తీస్తున్న "ముఝే సే దోస్తి కరోగె'' కు ఏకంగా సంగీత దర్శకత్వం కూడా వహిస్తున్నాడు. మరో వైపు శివకుమార్ శర్మ కంపోజ్‌చేసిన సంతూర్‌రాగాలు ఎల్పీలుగా, కాసెట్స్‌గా, సి.డి.లు మార్కెట్లో విరివిగా విక్రయమవుతున్నాయి. తన సంగీత సేవలకు సంగీత నాటక అకాడమీ అవార్డు, 'పద్మశ్రీ', 'పద్మభూషణ్', 'పద్మ విభూషణ్'(2001) వంటి పలు పురస్కారాలు అందుకున్నారాయన.

**సినిమాల్లో నటించకపోయినా శివకుమార్ శర్మ తన సంగీత మిత్రుడు వేణుగాన కళాకారుడూ అయిన పండిట్ హరిప్రసాద్ చౌరాసియా తో కలిసి "శివ్ -హరి" గా ఏర్పడి 'సిల్‌సిలా', 'లమ్హే', 'చాందిని', 'డర్', చిత్రాలకు సంగీత దర్శకత్వం వహించారు. విశేషమేమిటంటే ఈ చిత్రాలన్నీ మ్యూజికల్‌గా హిట్ అయినవే.**

భారతదేశంలో శివకుమార్ శర్మ కచేరీ చేయని నగరమే లేదు. నార్వే, అమెరికా, ఇటలీ, ఇంగ్లాండ్ తదితర దేశాల్లో సంతూర్ వాదనలో విదేశీయులను మైమరిపించారు. భారతీయ హిందుస్థానీ సంగీతంలో షెహనాయ్‌కి - బిస్మిల్లాఖాన్, సితార్‌కు - రవిశంకర్‌లా, సరోద్‌కు - అంజాద్ అలీఖాన్ లు ఎంత గొప్ప వారో సంతూర్‌కు శివకుమార్ శర్మ అంత గొప్పవారు. ఎక్కడో కాశ్మీర్‌లోని మారుమూల ప్రాంతానికి పరిమితమైపోయి ఉన్న సంతూర్‌ను ఎందరికో అభిమాన సంగీతసాధనంగా మలిచి, తద్వారా భారతీయ సంగీతానికి ప్రపంచఖ్యాతి సంపాదించిపెట్టిన విలక్షణ సంగీతకారులు శివకుమార్ శర్మ.



**శివకుమార్ సంతూర్‌ను శాస్త్రీయ సంగీతానికి అనువుగా 4 మెట్లనుండి 29 మెట్లు (బ్రిడ్జిలు) అమర్చి దానికో కొత్తదనాన్ని తెచ్చారు.**

**నిజానికి సంతూర్ మండోలిన్ లాగే పాశ్చాత్య సంగీత పరికరం. పర్షియన్‌లు "సంతూర్"గా , చైనీయులు "యంగ్‌చీన్"గా , హంగేరియన్‌లు "సింబలోమ్" అని గ్రీస్‌లో "సంతూరీ"గా, జర్మనీలో "హాక్‌బ్రేక్" గా, అమెరికా, ఐరోపా దేశాల్లో "హమ్మెర్డ్ డిల్సిమోర్" గా వ్యవహరించే ఈ శతతంత్రి వీణను సూఫీలు 'కలామ్'లు ఆలపించేటప్పుడు ఎక్కువగా వినియోగించే వారు. కాలక్రమేణా ఇది కాశ్మీర్‌ద్వారా భారతదేశంలోకి ప్రవేశించింది.**

**సంతూర్ పై స్వర లయ స్థానాల మధ్య సమతుల్యాన్ని సాధించి గమకాన్ని పండించగల నేర్పు శర్మకు అబ్బింది. వీణలాగ ఈ శత తంత్రికి పరిమితులు లేవు. దీని నాదస్థానం ఒక చోట అని ఉండదు. ప్రతి తంత్రి పులకించి నిక్వాణం వినిపిస్తుంది. క్రమంగా ఇది సహకార వాద్యంనుండి సోలో వాద్యంగా కచేరి వేదిక మధ్య భాగానికి చేరుకుంది.**

-పద్మజారాయ్



**జరిగిన కథ**

అజయ్ అనే శ్రీమంతుడికి విజయ్ అనే నిరుద్యోగి తారసిల్లుతాడు. విజయ్‌కి తల్లి లేదు. తండ్రి అప్పులు చేశాడు. చెల్లెలు మీనా కాపురం చిక్కుల్లో పడింది. అజయ్‌కి బాల్యంలోనే తల్లి, ఇటీవలే తండ్రి పోయాడు. మేనేజర్ భానోజీదే పెత్తనమంతా. ఒక సంవత్సరం పాటు తమతమ స్థానాలను మార్చుకుని పరిస్థితులను ఎదుర్కొనాలని ఇద్దరూ నిశ్చయించుకుంటారు. మీనాను రౌడీలు అల్లరి చేయడం భరించలేక అజయ్ ఆమె అత్తవారింటికి వెళ్లి బావ బుజ్జి ని బెదిరిస్తాడు. బుజ్జి తండ్రికి తెలియకుండా వచ్చి మీనాను కలుస్తాడు. అజయ్ స్థానంలో వచ్చిన విజయ్ మేనేజరు భానోజీని ఎదుర్కోవడానికి ఉపక్రమిస్తాడు. (ఇక చదవండి)



# అన్నపూర్ణా వారి ఇద్దరు మిత్రులు



## సీరియల్ - నవల 8

**రచన : ముళ్లపూడి వెంకటరమణ**



విజయ్‌కుమార్ కోత, అద్భుతంగా పనిచేసింది. అజయ్ సంతకం సాధన చెయ్యడానికి కొంత అవకాశం వచ్చింది. మరీ ఫోర్జరీ కాకుండా, కొంత సొంతం కూడా ఉండేందుకు ఒక మార్గం కన్పించింది. ఉన్న ఆ కాస్త తేడానీ-ఎవరూ శంకించడానికి వీల్లేకుండా, ఈ తెగిన బొటనవ్రేలు అనేది ఎదురులేని 'వంక'గా అమరింది.



భానోజిగారు బ్యాంకు ఏజెంట్‌కు ఈ వైనం-సంతకంలో కొంచెం తేడా ఉన్నదన్న సంగతి, తెలియజేశారు.

'అదేం ఇబ్బంది లేదు భానోజీగారూ, స్పెసిమన్ సిగ్నేచర్ ఫారాలు పంపిస్తాను. అజయ్ బాబు గారితో మళ్లీ సంతకాలు చేయించి పంపించండి' అన్నాడాయన.

అక్కడితో, విజయ్‌కుమార్ స్వయంగా రంగంలోకి దిగి మిత్రుడి వ్యవహారాలు చక్కబెట్టడానికి తెరువు ఏర్పడింది. మరోప్రక్క భానోజీ గారు, రివాజు ప్రకారం తనకు తోచిన రీతిని తాను వ్యవహారాలు చక్కబెట్టేస్తున్నాడు. రాబడిపన్ను వ్యవహారం ఒకటి తాజా ఛాన్సు. అర్జెంటుగా లక్షా యాభైవేలు పుట్టించాలి. లంచాలకి ఓపెన్ టెండర్లు కావాలని ప్రకటించడం మినహా, అంత భారీ యెత్తున వ్యవహారం చేశాడు భానోజీ గారు. భానోజీగారి అప్పు అంటే, తాంబూలం ఖర్చులు వేలం పాటలా లేస్తాయి. ధనీరాం మంచి పాటగాడు. అతని పాటంటే ఈయన చెవికోసు కుంటాడు.

"నమస్తే, భాన్జీబాబూజీ!"

"నమస్తే, ధనీరాం సేఠ్‌జీ! మీ కోసమే ఎదురుచూస్తున్నాను. దయచెయ్యండి... చాయ్ మంగావూఁ!"



"రాం, రాం!" అన్నాడు సేఠ్‌జీ.

"అవతారం! అవతారం!" అని కేకేశారు భానోజీ.

ఒక్కసారిగా ఆఫీసులోని అవతారాలు మూడూ అవతరించాయి ఆ గదిలో. భానోజీగారు రివాజు ప్రకారం మండిపడ్డాడు. "ఒక్కడిని పిలిస్తే ముగ్గురు తగలడ్డారేం?... ఇదిగో సేఠ్‌జీ మాకు ముగ్గురు అవతారాలు వెలిశారు శేషావతారం, కూర్మావతారం, వరహావతారం."



బలం గల అవతారం కనుసన్నని చూసి, మిగతా రెండు అంతర్ధానం అయిపోయాయి.

దిగడిన అవతారం కేసి చూసి, "శేషావతారం! మొన్న టైపు చేయించిన డాక్యుమెంటు... ఏది, అది తీసుకురా" అన్నారు భానోజీ గారు.



"చిత్తం" అన్నాడు శేషావతారం గువ్వలా.

అతను ఇవతలికి వచ్చేసరికి తలుపు వెనక చెవీ, చెవి వెనక కూర్మావతారం

కనిపించాయి.

"ఒరేయ్ కూర్మం. నీ తాపత్రయమేగానీ ఏమైనా వినబడి ఛస్తుందిరా" అంటూ వరహావతారం కూడా అటే చేరుకుంటున్నాడు-ఏమైనా వినబడి ఛస్తుందేమో అన్న అపోహ చొప్పున.

"తప్పు కూర్మం. పెద్దవాళ్ళు ఏవో వ్యవహారాలు మాట్లాడుకుంటూ ఉంటారు. మనం వినకూడదు మరి" అన్నాడు శేషావతారం. వాళ్ళిద్దరికీ ఆయన హెడ్డు.

"మీరొకరు నోరు విప్పితే నీతులు చెప్పడానికి, అది కాదండీ, లోపల ధనీరాం సేటుతో మేనేజరు గారు అప్పు బేరం ఆడుతున్నారు గదా-"

"అవును. అయితే?"

"ఆ మరేం లేదు, మేనేజరు గారు తన తాంబూలం ఖర్చుకి ఎంత రాబడుతున్నారూ అని"



"ఐదు పిల్లి కూనలకి తక్కువుండదు" అని అంచనా కట్టాడు వరాహం.

"పిల్లి కూనలేవిటి?" అన్నాడు కూర్మం. అతనికన్నీ వింతలే.

"ఆ మాత్రం తెలీదూ? ఒక పిల్లికూన అంటే ఒక వెయ్యి" అన్నాడు అంతవరకూ శ్రోతగా నిలబడిన ఆఫీసు జవాను.

"ఇది వ్యాపార పరిభాష" అని వెల్లడించాడు వరాహం-హుందాగా.

"అయితే శేషంగారూ, అందులో తమకు ఒక అర్థపిల్లికూన-" అన్నాడు కూర్మం.

"ఉష్ నోరు పారేసుకోకండి. వెళ్ళి పని చూసుకోండి. యూస్లెస్ టాక్సూ మీరూను" అని విసుక్కున్నాడు హెడ్డుగారు.

ఆఫీసు అంతఃపురంలో యూస్ ఫుల్ టాక్సు హోరాహోరీగా జరిగిపోతున్నాయి.

"అయితే ఏమి చేస్తార్ భానోజీసాబ్" అన్నాడు సేఠ్‌జీ.

"మీరు న్యాయం మాట్లాడ్డం లేదు సేఠ్‌జీ!"

"మాది సెప్పేది బిల్‌కుల్ న్యాయం భానోజీసాబ్! అడై లక్షా రుపియా తీస్కోండి. మగర్, వడ్డీ 15 రూపియా రాయించండి. ఠీక్? అది ఖరార్ అప్పు వడ్డీ 15లొ మీరూ తాంబూలం ఖర్చు ఏక్ రుపియా తీస్కోండి."

మళ్ళీ అదే పాటా అని విసుక్కున్నాడు భానోజీ. "ఆఖరి మాట వినండి సేఠ్. వడ్డీ 12 రూపాయలు రాయిస్తాను. అది హెచ్చరు; అందులో నా తాంబూలం ఖర్చు రెండు రూపాయలు. ఇది తగ్గదు."

తాంబూలాల తబ్సీలు తెలిసేదాకా ఉండబట్టలేని కూర్మావతారం అదను చూచుకుని లోపల జొరబడి పోయాడు ఒక ట్రేలో తాంబూలాలు అమర్చి పట్టుకొచ్చాడు-గడుసుగా అమాయికత్వం నటిస్తూ.



"ఏం?" అన్నారు భానోజీ.

"తాంబూలం అన్నారుగా సార్! తెచ్చాను" అన్నాడు కూర్మం వినయం ఉట్టిపడేలా.

"పెద్ద మనుషుల్తో వ్యవహారం మాటాడుతూంటే, లోపలికి రావద్దని ఎన్నిసార్లు చెప్పాను!" అన్నాడు భానోజీ మండిపడి.

"పొరపాటు సార్!" అన్నాడు కూర్మం తాపీగా, అతను వచ్చిన పని అయిపోయింది.



"భానోజీసాబ్! మీరు చెప్పేదీ-" అంటూ తిరిగి పల్లవి ఎత్తుకున్నాడు సేఠ్‌జీ.

"నా దెప్పుడూ ఒకటే మాట ధనీరాం! బేరమాడడమంటే అసహ్యం. దర్జాగా ఉండండి సేఠ్‌జీ! న్యాయంగా, హుందాగా వ్యవహరించండి!" అన్నారు భానోజీ తిక్కగా.

ధనీరాంకు పట్టు విడుపులు బాగా తెలుసు. "ఏక్ హీ బాత్ అంటారు అచ్చా అచ్చా! డాక్యుమెంటు రాయించి అజయ్‌బాబుతో దస్కతు పెట్టించండి" అన్నాడు-విచారంగా తల తాటించుట నటించి.

అజయ్‌బాబు సొమ్ము విషయంలో భానోజీగారు యెప్పుడూ హుందాగానే వ్యవహరిస్తూ వచ్చారు. లక్ష రూపాయలు అప్పుకు అందరూ పది రూపాయలు వడ్డీ పారేస్తే, జాగీర్దారు గారి పేరు చెప్పి తను మరో రెండు పారేస్తాడు హుందాగా, తన సొమ్మేంపోయె! ఆ మాటకొస్తే, ఆ అదనపు 'రెండు'లో అర్ధో పర్ధో తనకు ఫిరాయింపవుతుంది. ఇంతా చేసి యిదంతా ఎవరి కోసం? తన ఒక్కగాని ఒక్క కూతురు సరళ కోసం. సరళ ఎవరి కోసం? అజయ్‌బాబు కోసం. ఆ మూడు ముళ్ళు పడితే ఆ ఆలీ ఈ 'ఓలీ' కూడా ఆయనవే! ఒకవేళ ఈ పెళ్ళి జరక్కపోతే మాట గదా...!





"అజయ్‌బాబు" దస్కతు అనుకున్నంత నులువుగా పడలేదు. అసలు పడనేలేదు, పేచీ పడింది.

"ఇంత వడ్డీ ఏమిటండి! ఫ్యాక్టరీ తనఖా ఏమిటి? ఈ ఏర్పాటు నాకేం ఇష్టం లేదు" అన్నాడు విజయ్. అక్కడితో ఆగలేదు. ఛర్రున చింపేశాడు.

అసలీకుర్రకుంక ఈ లిటిగేషన్ క్లాజులన్నీ చదువుతాడనే అనుకోలేదు భానోజీ గారు. ఈ అపశకునాని కాయన చిన్నబుచ్చుకున్నారు.

"నాకు మాత్రం ఇష్టమా అజయ్‌బాబూ! మనసులో చాలా బాధగానే ఉంది. కాని రేపటిలోగా లక్షా యాభైవేలు ఇన్‌కంటాక్సు కట్టాలి. ఎక్కడి నుంచి తేగలం? మీరే ఆలోచించండి." అన్నాడు.



"ఆలోచించేదేముంది ఇంట్లో డబ్బు లేకపోవచ్చు. బోలెడంత జవహరీ ఉందిగా" అన్నాడు విజయ్ కటువుగా.

"అమ్మగారి నగలు తప్ప మరేముంది" అన్నాడు మానేజరు-" అదోలా నవ్వి.

"ఆ నగలే అమ్మేస్తాం."

భానోజీగారు అదిరిపడ్డారు

"అమ్మగారి నగలు అమ్మడమా" అన్నారు.



"ఏం ఆక్షేపణేముంది?"

వాత్సల్యం లాటిది ప్రదర్శిస్తూ కొంత విజ్ఞానం ప్రసాదించ బోయారు భానోజీ గారు.

"ఉంది అజయ్‌బాబూ! ఈ ఇంటికి, కాబోయే కోడలు కోసం ఆ నగలు దాచి వుంచామని నాన్నగారు యెప్పుడూ అంటూండే వారు. ఇప్పుడేదో మనం తాత్కాలిక మైన ఇబ్బందిలో, పరమ పవిత్రమైన వారి ఆశయాన్ని..."



"చక్రవడ్డీలకు అప్పులు తెచ్చి వంశ గౌరవాన్ని తాకట్టు పెట్టడమే వారి ఆశయమంటారా?" అన్నాడు విజయ్.

"శివశివా ఎంతమాట!" అంటూ కళ్లు మూసుకుని గబగబా కర్తవ్యం ఆలోచించుకున్నాడు భానోజీగారు. "అయినా ఆ నగలు నాన్నగారి గదిలో ఉన్నాయి; వారి సంవత్సరీకాల తరువాత గాని ఆ గదులు తెరవకూడదు. తెరిస్తే అరిష్టం-"



"హుం,శాస్త్రాలు- అరిష్టాలూ- ఆ వచ్చే అరిష్టమేదో నేను భరిస్తాను" అంటూ లేచి నిల్చున్నాడు విజయ్.

"పెద్దవాణ్ణి చెపుతున్నాను. సాహసం వద్దు అజయ్‌బాబూ" అన్నాడు, భానోజీగారు కంగారుగా లేచి. అది హెచ్చరికో, ప్రార్థనో ఆయనకే తెలియలేదు.

"ఏం ఫర్వాలేదు, మీరు వెళ్ళి వెంటనే గదులు తెరిపించండి" అన్నాడు విజయ్ కృతనిశ్చయంతో.



"క్షమించండి. అలాంటి పని నా చేత చేయించకండి" అన్నాడు భానోజీ- తలవంచుకొని, ఓరగంట అజయ్‌ని చూస్తూ.

ఎత్తు పైయెత్తులు, మాటపై మాటలు చాలా దూరం వెళ్లిపోయాయి. ఇహ నెవరూ తగ్గరు.

"సరే. అయితే నేనే స్వయంగా చూసుకుంటాను" అంటూ చరచర మేడమీదికి బయల్దేరాడు విజయ్.



ఆఖరి ప్రయత్నంగా, అత్తయ్యగారి శరణుకోరి చక్రం అడ్డు వేయడానికని ఆవిడ గదికి పరుగెత్తాడు భానోజీ...

ఈ సంగతి వినగానే, అత్తయ్యగారు చాలా నొచ్చుకుంది. 'నిజంగా! అంత అఘాయిత్యానికి పూనుకున్నాడా! ఎంత అమంగళం' అంది తల్లడిల్లిపోతూ.

'అవునమ్మా, తొందరగా రావాలి. చెయ్యిదాటిపోయింది' అన్నాడు భానోజీగారు కంగారుపడిపోతూ.



అత్తయ్యను వెంటేసుకుని భానోజీగారు మేడమీదికి వెళ్ళేసరికే పరిస్థితి ఆయన చెయ్యిదాటి పోయింది. విజయ్ ఇనప్పెట్టె తెరిచాడు. కొన్ని పత్రాలు, చిన్న చిన్న నగలు కొన్నీ ఉన్నాయి.

'ఏమిటీ సాహసం బాబూ! ఎంత పని చేశావ్!' అంది అత్తయ్య ఆవేగంతో.



'అరిష్టం బాబూ' అని ఎంత చెప్పినా విన్నారుకాదు, అన్నాడు భానోజీగారు నిష్ఠురంగా.

'గదులు తెరవకముందే ఆ అరిష్టం జరిగిపోయింది భానోజీగారు' అన్నాడు విజయ్-కోపం అణగద్రొక్కుకుంటూ.

'అదేమిటి అజయ్‌బాబూ!' అన్నాడు భానోజీ- ఇనప్పెట్టెవేపు చూడకుండా.



'మన కళ్ళెదుట కనబడుతున్నదే. అత్తయ్య చూడలేదు. కాని, మీరు చూడగలరు, చూస్తున్నదేమిటో అత్తయ్యకు చెప్పండి.'

'ఏమిటి విజయ్! ఏం జరిగింది?' అంది అత్తయ్య.

'ఇనప్పెట్టె అంతా ఖాళీగా ఉంది. ఒక్క నగకూడా లేదు' అన్నాడు విజయ్ తాపీగా.

'ఆఁ! నగల్లేవా?'



'ఏమిటి అజయ్‌బాబూ? ఏమిటీ ఘోరకలి?' అన్నాడు భానోజీ తనూ యథాశక్తి ఆశ్చర్యపోతూ.

'అదేమిటి భానోజీగారూ, వాడి నడుగుతారు? వదినగారికి ఎంత జవహరీ ఉండేది! అన్నయ్యగారు స్వయంగా చేయించినవీ, తరతరాలనాటివీ పెట్టెనిండా ఉండేవే. ఏమైపోయాయి?' అంది అత్తయ్యగారు కఠినస్వరంతో.



'అదే నాకూ చిత్రంగా ఉంది. ఎంత బంగారం! ఎన్ని వజ్రాలు...'

'అన్నీ మంచులాగా కరిగి పోయాయా? రెక్కలొచ్చి ఎగిరి పోయాయా?... మీకు తెలీకుండా ఏదీ జరిగివుండదు-' అన్నాడు విజయ్ సాహసంగా.

'అజయ్‌బాబూ! ఉద్రేకపడుతున్నారు; అయ్యగారు ఆ నగలేం చేశారంటే, నాకెలా తెలుస్తుంది? వారు అన్ని విషయాలూ నాతో చెప్పే చేసేవారా? లక్ష వ్యవహారాలుండేవి వారికి' అన్నారు భానోజీగారు ఉద్రిక్తస్వరంతో.



'అదేమిటి భానోజీగారు! నాన్నగారి వ్యవహారాలన్నీ మీరే చూసేవారు. ఆఖరి గడియల్లో నాన్నగారి దగ్గరున్నది మీరు.'

'అంటే మీ ఉద్దేశ్యం?' అన్నారు భానోజీగారు తీవ్రంగా.

'నేను వేరేచెప్పాలా?' అన్నాడు విజయ్.

భానోజీగారు మళ్ళీ నిగ్రహం నటించారు. 'అజయ్‌బాబూ! అన్యాయంగా

మాట్లాడుతున్నారు. మీరు నా బిడ్డలాటివారు. చిన్ననాటి నుండి నా ఒడిలో పెరిగారు... రక్తమాంసాలోడ్చి మీ కుటుంబానికి సేవ చేశాను. అందుకు ఇదా ప్రతిఫలం?'



కథ కట్టు తప్పుతూందని గ్రహించి, అత్తయ్య కలుగజేసుకుంది. అవిడక్కావలసింది తెలిసింది.

'ఆగండి, ఇద్దరూ ఎందుకలా ఉద్రేక పడతారు? అజయ్! పెద్దా చిన్నా లేకుండా ఏమిటామాటలు?' అందావిడ అధికార స్వరంతో.

'నువ్వూ నన్నే అంటావా అత్తయ్యా?'



'కాకపోతే? ఏం జరిగిందో భానోజీగారికెలా తెలుస్తుంది? వాటిని మీ నాన్న ఏం చేశాడో! ఎన్నో సంగతులు నాతోనే చెప్పేవాడు కాడు.'

'సరే, అయితే అంతా మీరే చూసుకోండి!' అంటూ విజయ్ చరచర వెళ్ళిపోయాడు.



'భానోజీగారు!' అంది అత్తయ్య నెమ్మదిగా.

'అమ్మా!'

'పెద్దవారు మీరూ ఉద్రేకం తెచ్చుకొంటే ఎలాగ చెప్పండి? అన్నయ్య పోయిన దుఃఖంలోంచి వాడింకా తేరుకోలేదు. ఆస్తి బాధ్యతలన్నీ ఒక్కసారి మీదపడ్డాయి. తట్టుకోలేక ఉక్కిరిబిక్కిరి అవుతున్నాడు.'

'నాకు తెలియదా అమ్మా! అయినా-'

'నేను వాడిని మందలిస్తాను. మీరు మనసులో ఏమీ పెట్టుకోకండి.'

భానోజీగారి మనసు తెరిపిన పడింది- చిక్కులోంచి బయట పడ్డందుకు: పైగా క్షమాపణలుకూడా లభించినందుకు ఆనందం వేసింది. అయ్యగారి కుటుంబంమీద భక్తివిశ్వాసాలు పుంజుకున్నాయి. తుఫానుకు పోయిన ఆశలు తిరిగి మొలకెత్తాయి.



'అదేమిటి వదినగారూ! మనం మనం పరాయివాళ్ళమా' అన్నాడు ఆనందోద్వేగంతో.

'భానోజీగారు! అజయ్ పసివాడు. వాడిని కంటికి రెప్పలా కాపాడ్డానికి మీరుతప్ప ఇంకెవరున్నారు?'.

'ఎంతమాట. అది నా కర్తవ్యం! ఆ విషయంలో మీరు నిశ్చింతగా ఉండండి!' అన్నారు భానోజీగారు తృప్తిగా నిట్టూర్చి.

కాని, అదే జరగలేదు; లేదని ఆయనకి తెలీలేదు. ఇనప్పెట్టె తెరిచినప్పుడు కనిపించిన పత్రాలలో, అజయ్‌బాబు తండ్రిగారి వీలునామాఉన్న కవరొకటి కనబడింది విజయ్‌కి; తగాదా వచ్చాక, అది చేతపట్టుకపోయాడు. తన గదిలో అది తీసి చూశాడు. అతని అనుమానాలు పూర్తిగా ధ్రువపడిపోయాయి. ఆ రాత్రే, అత్తయ్యను కూర్చోపెట్టి, వీలునామా చదివి వినిపించాడు.

'తన యావజ్జీవితాన్ని ఈ యింటి శ్రేయస్సుకే ధారపోస్తున్న శ్రీ భానోజీరావు ఏకైక పుత్రిక అయిన కుమారి సరళ, నా యింటి కోడలు కావాలని నా కడసారి కోరిక. చిరంజీవి అజయ్ నామాటను మన్నిస్తాడనే నమ్మకం నాకుంది. ఏ కారణం చేతనయినా అజయ్ ఈ వివాహానికి యిష్టపడని యెడల నాకుగల స్థిరచరాస్తుల్లో సగపాలు కుమారి సరళకు చెందవలసిందని ఇందుమూలంగా నిర్ణయిస్తున్నాను. ఇది నా సమ్మతిని వ్రాసిన వీలునామా.'



(భద్రతకొరకు ఈ వీలునామా ప్రతి ఒకటి భానోజీ దగ్గర దాచి వుంచాను...)

'విన్నావా అత్తయ్యా!'



'ఇందులో ఏదో మోసం వుంది. అన్నయ్యకు ఇలాంటి ఉద్దేశ్యమేవుంటే మాటవరసకయినా నాతో అనకుండా వుంటాడా? వాళ్ల తాహతేమిటి? మన తాహతేమిటి? చివరకు మేనేజరు కూతుర్నా అజయ్ పెళ్ళాడేది?'...అందావిడ. అంతలో ఏదో ఊహపోయి, వెంకన్నను పిలిచింది. 'వాడు రాత్రింబవళ్లు నాన్న మంచం విడువలేదు. ఈ వీలునామా సంగతి వాడికేమేనా తెలుసునేమో...' అందావిడ సాలోచనగా.

వెంకన్న, అతనివెంట 'దుబాసీ' లచ్చి వచ్చారు. విజయ్, వీలునామా వత్రాన్ని వెంకన్నకు చూపించాడు - తిరగా బోర్లావేశాడు. దీని సంగతి నీకేమన్నా తెలుసా? అని సంజ్ఞచేశాడు. వాడు తల తాటించి, చాలా సంజ్ఞలతో గుడ్లు తిప్పుతూ తనకు తెలిసింది వెల్లడించాడు. లచ్చి ఆ మూగభాషను తన యాస బాసలోకి అనువదించింది.





'పెద్దోర, సొయిలేక పడున్నపుడు బానోజీ దొర గిసొంటి కాయిదమేదో తెచ్చుండంట. మరి దండొట్ల రాతగీత యాదీ లేకుండెనంట. కాని ఆ పుత్త కాయిదంల్నె దస్కతు పెట్టించుకొని పోయిండంట!' అంది.

వాళ్ళని పంపేసి, 'ఇప్పుడేమంటావు అత్తయ్యా!' అన్నాడు విజయ్.



'అజయ్! భానోజీ పరమ దుర్మార్గుడే కావచ్చు కాని, తొందర పడితే మనకే నష్టం. మన వ్యవహారాల ఆయువుపట్లన్నీ అతని చేతుల్లో ఉన్నాయి. పరిస్థితులు మన అదుపులోకి వచ్చేవరకు అతనితో సన్నిహితంగానే ఉండాలి. వీలయినంతవరకూ అన్ని విషయాలూ నువ్వే చూసుకో!' అందావిడ.

(ఇంకా వుంది)

జనవరి 14 జంధ్యాల జయంతి సందర్భంగా...

# సరిగమలు - పలుగలలు

## మాధవపెద్ది సురేష్

### (సినీ సంగీత దర్శకులు)



జె.వి.డి.ఎస్.శాస్త్రి (జంధ్యాల వెంకట దుర్గా శివ సుబ్రహ్మణ్యశాస్త్రి) నాకు 1969లో పరిచయ మయ్యాడు. అన్నయ్య రమేష్ పరిచయం చేశాడు. అన్నయ్య కోసం అప్పుడప్పుడు మాయింటికి వచ్చేవాడు. తమ నాటికల్లో హీరో, పైగా రచయిత



జంధ్యాల దంపతులతో మాధవపెద్ది సురేష్ దంపతులు

కూడా. గుండెలు మార్చబడును, 'సంధ్యా రాగంలో శంఖారావం, లాంటి పాప్యులర్ నాటికలు రాసి హీరోగా యాక్ట్ చేసేవాడు. వాటికి నేను కూడా కొన్ని సార్లు ఎకార్డియన్ వాయించాను. అన్నయ్యకీ, జె.వి.డి.ఎస్.కీ కామన్ ఫ్రెండ్స్ ఎక్కువ. అన్నయ్య, సుత్తి వీరభద్రరావు, విన్నకోట విజయరాం, సుబ్బరాయశర్మ నలుగురూ ఎ.కె.టి.పి.ఎం.హెచ్.స్కూల్లో (సత్యనారాయణ పురం, విజయవాడ) బెంచ్ మేట్‌లు. విన్నకోట రామన్న పంతులు గారు జంధ్యాలకి గురువు. ఆయనంటే జంధ్యాలకి చాలా గౌరవం. నేను 1969లో ఎస్.ఆర్.ఆర్. & సి.వి.ఆర్. ప్రభుత్వ కాలేజీలో పి.యు.సి.లో చేరాను. అన్నయ్య నాకంటే రెండేళ్లు సీనియర్, అదే కాలేజీలో బి.ఎ. (సైకాలజీ, సోషియాలజీ, ఫిలాసఫీ) చదివే జంధ్యాల నాకన్నా ఒక యేడు సీనియర్. ఎం.వి.రఘు, సాయినాథ్, తోటపల్లి మధు, నాని (ముద్దమందారం ప్రొడ్యూసర్) ఇలా చాలా మంది ఎస్.ఆర్.ఆర్. & సి.వి.ఆర్. కాలేజి స్టూడెంట్స్. జంధ్యాల డ్రెమెటిక్ సెక్రటరీ. రఘు ఆర్ట్ సెక్రటరీ. అన్నయ్య మ్యూజిక్ సెక్రటరీ. ఆ బ్యాచ్‌లో సుమారు 20 మంది సినీ ఫీల్డులో సెటిల్ అయ్యారు.

జంధ్యాల అందగాడు. కాలేజికి అంబాసిడర్ కార్‌లో వచ్చేవాడు. మొదటినుండీ మితభాషి. మేమందరం ఒక రకంగా మా కాలేజ్ హీరోస్.

జంధ్యాల నాన్నగారు శ్రీ జంధ్యాల నారాయణమూర్తి గారు బుష్ రేడియో డీలర్. అప్పట్లో ఎం.ఎస్.మూర్తిగారు జి.ఇ.సి. రేడియో డీలర్స్, రాజబాబు గారు (హీరో మురళీమోహన్) కిసాన్ ఇంజనీరింగ్ కంపెనీలో ఉండేవారు. అందరూ మంచి రంగస్థల నటులు. జి.ఎస్.ఆర్. మూర్తిగారు (ఆంధ్రా సిమెంట్స్) విన్నకోట రామన్న పంతులు గారు ఇలా ఎంతో మంది మహానుభావులు ఎంతోమందికి మార్గదర్శకులుగా నిలిచారు. అనుకోని పరిస్థితుల్లో జంధ్యాల నాన్నగారికి వ్యాపారంలో సమస్యలు రావటంతో జంధ్యాల 1975లో మద్రాసు వచ్చాడు. అప్పటికే అతనికి వివాహం అయింది. జంధ్యాల భార్య అన్నపూర్ణ దేవత. అన్నపూర్ణ మావయ్య గారి (హోతా పార్థసారథి గారు) అబ్బాయి భగవాన్‌కి మాచెల్లెలు శశినిచ్చి వివాహం చేశారు. ఈ రోజుల్లో సూర్యకాంతం గారు (జంధ్యాల అమ్మగారు) అన్నపూర్ణ లాంటి అత్తాకోడళ్లని చూడటం కద్దు. ఒక రకంగా జంధ్యాల మావగారివైపు అందరూ ఒక కాపు కాశారు. ఎంతో సఖ్యంగా వుండేవారు.

జంధ్యాలకి మొదటి నుండీ సంగీతం అంటే ఎంతో ప్రాణం. వాళ్ల నాన్నగారు విజయవాడలో హిందుస్థానీ సంగీత సభలు నిర్వహించేవారు. పండిట్ రవిశంకర్ లాంటి ప్రపంచ ప్రసిద్ధుల్ని విజయవాడకి క్లబ్ తరపున పిలిపించి కచేరీలు ఏర్పాటు చేసేవారు. మద్రాసులో డైరెక్టర్ కె.విశ్వనాథ్ గారింటి ఎదురుగా చందమామ రామారావు గారింట్లో మొదట్లో అద్దెకుండేవారు జంధ్యాల. హనుమాన్ జంక్షన్ తరువాత విశ్వంగారు ఎంతో ఆదరించి ప్రోత్సహించారు. జంధ్యాలకి విశ్వనాథ్ గారంటే ఆరో ప్రాణం. సిరిసిరిమువ్వకి పనిచేయటంతో జంధ్యాల జీవితం మలుపు తిరిగింది. అడవి రాముడు, శంకరాభరణం, యమగోల సినిమాలతో తొందరగా పర్‌ఫెక్ట్ స్క్రిప్ట్ ఇచ్చే ఏకైక రైటర్‌గా ఒక వెలుగు వెలిగాడు. మా కాలేజ్‌మేట్ నాని (కె.ఆర్.ప్రసాద్) 'ముద్ద మందారం' సినిమా తీసి జంధ్యాలను డైరెక్టర్‌గా పరిచయం చేశాడు. మొదటి సినిమా నుండి ప్రఖ్యాత దర్శకుల కోవలోకి వెళ్లాడు. బాపు గారు, విశ్వనాథ్ గారి తరువాత ప్రత్యేకత ఉన్న దర్శకుడిగా ఎంతోపేరు సంపాదించాడు.

స్నేహితులంటే ఎంతో ప్రాణం జంధ్యాలకి. 'ముద్ద మందారం' మొదలు పెట్టే ముందు నేనూ, జంధ్యాల, బాలు గారు విమానంలో వెళ్తున్నాం. నేను బాలు గారి కచేరీకోసం హైద్రాబాద్ వెళ్తున్నాను. జంధ్యాల వేరే పనిమీద ఢిల్లీ వెళ్తున్నాడు. మా ఇద్దరి మాటల సందర్భంలో 'ఏరా, నాకు ఒక పిక్చర్ వచ్చింది. నువ్వు అందరు సంగీత దర్శకుల దగ్గరా పనిచేస్తున్నావు కదా! 'నాకు మంచి



'పిబరే రామరసం...' పాట రికార్డింగ్

మ్యూజిక్ డైరెక్టర్‌ని సజెస్ట్ చేయరా' అని అడిగాడు. 'నీకు అన్ని రకాలుగా పర్‌ఫెక్ట్‌గా మంచి సంగీతం అందించాలంటే రమేష్ నాయుడు గారు,

ఎస్.పి.బాలసుబ్రహ్మణ్యం గారు అయితే బావుంటుంద'న్నాను. నా మాటకి విలువ ఇచ్చి, ఆ ఇద్దరు మహానుభావులతో ఎంతో అద్భుతమైన సంగీతాన్ని రాబట్టుకున్నాడు. ఆల్‌మోస్ట్ జంధ్యాల సినిమాలన్నింటికి నేను కీబోర్డ్ ప్లేయర్‌గా పనిచేశాను.

'ముద్దమందారం', 'ఆనందభైరవి', 'శ్రీవారికి ప్రేమలేఖ' లాంటి ఎన్నో మంచి సినిమాలకి రమేష్ నాయుడు గారు అందించిన సంగీతం అద్భుతం. గొప్ప మెలోడీ మేకర్. అలాగే అన్నమయ్య సినిమా తీద్దామనుకొని (జంధ్యాల జీవితాశయం అది) నాయుడు గారితో అద్భుతమైన పాటల్ని ఇండియాలో ఉన్న అందరు ప్రసిద్ధ గాయనీ గాయకులతో రికార్డు చేయించాడు. కానీ సినిమా చేయలేకపోయాడు, బ్యాడ్ లక్.



బాపుతో జంధ్యాల

అలాగే రాజన్-నాగేంద్ర గార్లతో 'నాలుగు స్థంభాలాట' లాంటి ఎన్నో విజయవంతమైన సినిమాలకి ఉన్నతమైన సంగీతం అందించాడు.

ఎస్.పి.బాలసుబ్రహ్మణ్యం గారితో 'వివాహ భోజనంబు', 'పడమటి సంధ్యారాగం' లాంటి ఎన్నో విజయవంతమైన సినిమాలకి అద్భుతమైన, అనిర్వచనీయమైన సంగీతాన్ని మనకు విని పించాడు. ముఖ్యంగా 'పడమటి సంధ్యారాగం'లో అన్ని పాటలూ హైలెట్.

తెలుగు చిత్ర సీమలో మొట్టమొదటిసారి తెలుగు సినిమా పాట 'అమెరికా' దేశంలో వాషింగ్టన్ డి.సి.లో రికార్డు చేయటం జరిగింది. జంధ్యాల ఎంతో శ్రమించి, కసిగా తీసిన చిత్రం 'ఆనందభైరవి'. ఆ యూనిట్ సన్మాన కార్య క్రమాలకు జంధ్యాల దంపతులు, నిర్మాత శాండిల్య గారూ, సీతాదేవి గారు, శివ, ఎస్.పి.బి. దంపతులు, శైలజ, నేనూ, నాభార్య, ఆర్కెస్ట్రా సభ్యులూ అందరం 1985లో అమెరికా వెళ్లాం. అక్కడే 'పడమటి సంధ్యారాగం' పుట్టింది. ఆ చిత్రానికి పేరు బాలూ గారు సజెస్ట్ చేశారు. అందుకు నిర్మాతలు ఆయనకి 116 యు.ఎస్. డాలర్లు ఇచ్చారు. 'పిబరే రామరసం' అనే పాట సాయంత్రం 6-9 కాల్‌షీట్‌లో వాషింగ్టన్ డి.సి.లో రికార్డు చేయటం జరిగింది. సౌండ్ ఇంజనీర్ ఒక మహిళ. అద్భుతంగా రికార్డు చేసింది. ఒక్క అసిస్టెంట్ లేకుండా ఆవిడే రికార్డు చేసింది. ఆర్కెస్ట్రా శ్రీనివాసమూర్తి (వయొలిన్ & ఎరేంజర్ - ప్రస్తుతం ఎ.ఆర్.రహమాన్‌కు అసిస్టెంటు), డ్రమ్స్ శివమణి (వరల్డ్ ఫేమస్ డ్రమ్మర్, పడమటి సంధ్యారాగంలో నీగ్రో అబ్బాయిగా నటించాడు కూడా), సూర్యనారాయణ (ఫ్లూట్), నేను ఎకోస్టిక్ పియానో, కీబోర్డ్, ప్రసాద్ (తబ్లా), రాజా (రిథమ్ బాక్స్) రాజేశ్వరరావు గారి అబ్బాయి, సంగీత దర్శకుడు వాసూరావు (బేస్ గిటార్) జోసెఫ్ (గిటార్). జీవితంలో మరచిపోలేని రోజది. నాకు ప్రత్యేకంగా నచ్చిన పాట అది.

ఒకసారి బాపుగారి సినిమా రీ రికార్డింగ్‌లో కీబోర్డ్ వాయిస్తున్నపుడు బాపు గారు నన్ను పిలిచి "ఏమయ్యా! మీ స్నేహితుడు జంధ్యాల 'ముద్దుగారే యశోద' పాటని ఎంతో గొప్పగా పిక్చరైజ్ చేశాడు" అని చెప్పారు. కాసేపయ్యాక జంధ్యాలకి ఫోన్ చేసి చెప్పాను. ఎంతో థ్రిల్ ఫీల్ అయ్యాడు. బహుశా జంధ్యాల జీవితంలో చేసిన ఎన్నో అద్భుతాలలో ఎన్నతగింది ఆ పిక్చరైజేషన్.

పాటలు విజువలైజ్ చేయుటంలో జంధ్యాల ఘనాపాటి.'సరిగమపదని స్వరధారా' అనే పాట పిక్చరైజేషన్ కూడా నాకెంతో ఇష్టం. ముఖ్యంగా బాలుగారంటే జంధ్యాలకిఎంతో ప్రాణం. అలాగే జానకి గారన్నా, సుశీల గారన్నా, చిత్ర అన్నా ఎంతో ప్రేమ తనకి. జంధ్యాల వాయిస్ అద్భుతంగా ఉంటుంది. నేను ఎన్నో సార్లు తనతో అనేవాణ్ని నీ వాయిస్ నాకుంటే చాలా బావుండేదని.

తనకి వాళ్ల అమ్మగారంటే మాటల్లో చెప్పలేనంత ప్రేమ. సహృదయుడు, విజ్ఞత ఉన్నవాడు. ముఖ్యంగా సినిమా ఫీల్డులో ఎంతో మందిని ఇంట్రడ్యూస్ చేయుటమే కాకుండా వాళ్లని విజయవంతమైన తోవలో నడిపాడు.

నేను మొట్టమొదట ట్యూన్ చేసిన పాటనే ఓకే చేశాడు. 'హైహై నాయకా' సినిమాకి 'ఇది సరిగమలెరుగనిరాగము, ఇది భాషేలేని భావము, ప్రేమగానము'. రచన శ్రీ జొన్నవిత్తుల, పాడిన వారు శ్రీ ఎస్.పి.బి., శ్రీమతి ఎస్.జానకి. (1998 ఆగస్టు 21న, ఎ.వి.ఎం.జి. రికార్డింగ్ థియేటర్) ఎంతోఆనందించాడు. ఆ పాట రికార్డు అవగానే.

జంధ్యాలన్నా, తన కుటుంబ సభ్యులన్నా నాకే కాదు, నా కుటుంబం అందరికీ ప్రాణం.

జంధ్యాల చాలా కమర్షియల్ సినిమాలకి రచయితగా పనిచేసినా ఏనాడూ అసభ్య పదజాలం ఉపయోగించలేదు. అలాగే తను దర్శకత్వం వహించిన ఏసినిమాలోనూ సెన్సార్ వాళ్లకి పని కల్పించలేదు. ఆరోగ్యకరమైన హాస్యాన్ని పండించాడు. అతని కలానికి రెండు వైపులా పదునుంది.

జంధ్యాల మంచి సంగీతానికి పెద్దపీట వేశాడు. ఆ తల్లిదండ్రులకు ఒక్కడే కొడుకు జంధ్యాల. పెళ్లైన చాలా సంవత్సరాలకి కవల పిల్లలు పుట్టారు. సాహితి, సంపద వాళ్ల పేర్లు. బంధువుల దగ్గరా, స్నేహితుల దగ్గరా ఇంట్లోనూ ఎంతో మంచిపేరు తెచ్చుకొన్న జంధ్యాల అందరికీ ఆప్తుడు. ఎంతో విజ్ఞత కలవాడు. కానీ టైం అనే రెండక్షరాల ముందు ఎటువంటి వాళ్ళైనా తలవంచాల్సిందే. 'లైఫ్ ఈజ్ ప్రీ రికార్డెడ్ క్యాసెట్'. నాకన్నా 7 నెలలు పెద్దవాడు.

చేసింది ఒక్క సినిమా అయినా చాలా బాగా చేశాడు. మంచిపాత్ర. తన గురువు గారి దర్శకత్వం. మంచిపేరు సంపాదించుకొన్నాడు. జంధ్యాల మితభాషి. మొదటి నుండీ ఖరీదైన బట్టలు ధరించేవాడు. ఎవరైనా గట్టిగా మాట్లాడినా, ఎవర్నైనా విమర్శించినా సహించేవాడు కాదు. నన్ను సినీ పరిశ్రమలో ఏరా! అని ఆప్యాయంగా పిలిచేవాడు తనొక్కడే.



పుచ్చా పూర్ణానందం,జంధ్యాల, గిరీష్ కర్నాడ్

ఘంటసాల గారి అంతిమయాత్రలో పాల్గొన్నాను. మళ్లీ ఇటు సినీ పరిశ్రమలోని ప్రముఖులందరూ, స్నేహితులందరూ, బంధువులు, ఆప్తులూ అందరూ మనస్ఫూర్తిగా జంధ్యాల అంతిమయాత్రలో పాల్గొనటం చూశాను. మనిషి చనిపోతే అలా పోవాలి. ఏనుగు ఉన్నా పోయినా ఒకటే. తను మరణించిన కొద్ది నెలల లోపే వాళ్ల నాన్నగారు చనిపోవటం ఆ కుటుంబానికి తీరని బాధ. పింగళిగారు, ఆత్రేయ గారి తర్వాత అంతపేరు సంపాదించుకొన్నాడు జంధ్యాల. జంధ్యాల గురించి నేను ఇలా రాస్తానని కలలో కూడా ఊహించలేదు. నా వరకు జంధ్యాల నా రక్తంలో ప్రతి అణువులోనూ ఉన్నాడు. తను మరణించలేదు నా దృష్టిలో.

సీరియల్ 7

# హాస్యవల్లరి సంగీతలహరి

# కిశోర్ జీవనఝరి



\- ఎమ్మెస్ స్వాతి

**అక్టోబరు13, 1987.**

58 వ యేట మరణించిన కిశోర్ కుమార్‌ది అకాలమృత్యువు అనే అనాలి. అతని కంటె పెద్దవాళ్లు జీవించి వున్నారు. (తల్లీ, తండ్రీ పోయారనుకోండి). తన కళ్ల ఎదుటే తనకంటె చిన్నవాళ్ల చావు చూడరావలసిరావడం ఎవరికైనా దుఃఖదాయకమే! ఆ బాధ అశోక్‌కుమార్, అనూప్‌కుమార్‌లకే కాదు కిశోర్‌కూ తప్పలేదు. అతని కళ్లముందే అతని భార్య మధుబాల మరణించింది. ఆమె అంత్యక్రియల్లో అతను పాల్గొనవలసివచ్చింది. అప్పుడతని వయసు 40 సంవత్సరాలే! వివాహానికి ముందు వాళ్లు మంచి స్నేహితులు. తెరపై హిట్ పెయిర్. కానీ వారి వైవాహిక జీవితం అతి క్లుప్తంగా, అతి విషాదకరంగా ముగిసింది.

## ఓ వీనస్

'వీనస్ ఆఫ్ ఇండియా' 'యేర్లిన్ మన్ ఆఫ్ ఇండియా' 'క్వీన్ ఆఫ్ చారిటీ' ప్రేమికుల దినంనాడు పట్టిన మధుబాలను వర్ణించే కొన్ని పదాలు ఇవవి. ఢిల్లీకి చెందిన బొంబాయికి వలస వచ్చినో పఠాను కుటుంబంలో పుట్టిన బేబీ ముంతాజ్ ఇద్దరు అక్కలు ముగ్గురు చెల్లెళ్లు. తండ్రి అతావుల్లాఖాన్‌కి సంపాదన ఏమీలేక ఈమెను 8వ యేట సినిమాల్లో ప్రవేశపెట్టాడు. సినిమాలలో చేర్పించాడు కానీ చచ్చేటన్ని నిబంధనలు పెట్టాడు. ఇంటినుండే అన్నం, నీళ్లు తీసుకెళ్ళాలి. ఎవరితోనూ మాట్లాడ కూడదు. సాయంత్రం ఆరుగంటలకల్లా షూటింగు ముగించుకుని ఇంటికి వచ్చేయాలి. ఇంటికి ఎవరూ రాకూడదు. సినిమా ఫంక్షన్‌లకు వెళ్లకూడదు. జర్నలిస్టులతో మాట్లాడ కూడదు. తెచ్చిన డబ్బంతా తన చేతిలో పోయాలి. అలా వచ్చిన డబ్బును అతను సినిమాలు తీయబోయి తగిలేసేవాడు.



ఇలాంటి పంజరంలో పెంచి అందాల చిలుక రెక్కలు విరిచి వేయడంతో మధుబాల స్వయం నిర్ణయాధికారం కోల్పోయింది. ఆమె మనసు దిలీప్‌కుమార్‌ను వాంఛించింది. కానీ చిన్నప్పటినుండీ పెరిగిన వాతావరణం వల్ల కుటుంబాన్ని విడవలేకపోయింది. "ఢాకకీ మల్‌మల్" (1956) సినిమా షూటింగ్ సమయంలో నటుడు ఓంప్రకాష్ సమక్షంలో దిలీప్‌కుమార్ మధుబాలకు ప్రపోజ్ చేశాడు. "కాజీ రెడీగా ఉన్నాడు. నువ్వు సరేనను. ఇవాళే పెళ్ళి. నీ కుటుంబాన్ని విడిచి రావాలి. అదొక్కటే నా షరతు" అన్నాడు. మధుబాల మాట నాన్చింది. "నాకు మా నాన్న కుటుంబమూ కావాలి, నువ్వూ కావాలి" అంది. "అది జరగని సంగతి అని నీకు తెలుసు. దీనర్థం నేను నీకు అక్కర్లేదన్నమాట" అని కోప్పడ్డాడు దిలీప్ పెళ్లి ప్రతిపాదన విరమించుకున్నాడు. తర్వాత మధుబాల రాజీ చేసుకోబోయింది. కానీ అప్పటికే అతని మనసు విరిగిపోయింది.

మధుబాల చాలా డిసిప్లిన్ ఉన్న మనిషి. ప్రొడ్యూసర్ల కంటే ముందే తన కార్లోవచ్చి సెట్స్‌పై వచ్చి కూచునేది. ఏ డిమాండ్లు చేయకుండా పూర్తి సహకారం అందించేది. వితరణశీలి. దానధర్మాలు చేసేది. పెద్ద తార అయిన తర్వాత కూడా పట్టుబట్టి డాన్సు, ఇంగ్లీషు అతి తక్కువ సమయంలో నేర్చుకుంది. అలంకారాలు ఎక్కువ చేసుకోకుండా సహజ సౌందర్యం ప్రదర్శించి ప్రేక్షకులనే కాదు. సహనటులను కూడా మంత్రంలు పోగొట్టుకునేట్టు చేసేది.

పూర్తి ప్రొఫెషనల్ అయిన మధుబాల బి.ఆర్.చోప్డా వంటి నిర్మాతతో వివాదంలో చిక్కుకుంది. అదీ తండ్రి కారణంగా. 'నయాదేర్' (1957) సినిమాకు దిలీప్‌కు జోడీగా మధుబాలను బుక్ చేయడం జరిగింది. ఆ సినిమాలో కొంత ఔట్‌డోర్ షూటింగు ఉంది. మధుబాల తండ్రి ఔట్‌డోర్‌కు వెళ్లడానికి వీల్లేదన్నాడు. దాంతో చోప్డాకు ఒళ్లు మండి ఆమెను తీసేసి ఆ వేషం వైజయంతిమాలకు ఇచ్చాడు. మధుబాలపై కోర్టులో కేసు వేశాడు. ఆ కేసులో దిలీప్‌ను సాక్షిగా పిలిచారు. తమ మధ్యనున్న ప్రేమను పరిగణించకుండా తనకు వ్యతిరేకంగా సాక్ష్యం చెప్పడం(నిజమే అయినా) ఆమె జీర్ణం చేసుకోలేకపోయింది. వారి మధ్య ఎడబాటు మరింత పెరిగింది.

'మొఘల్-ఏ-ఆజమ్'లో సలీం, అగార్కలిలుగా దిలీప్, మధుబాలల ప్రేమ చూసిన వారెవరో ఆ చిత్ర నిర్మాణ సమయంలో వారిద్దరి మధ్య

కిశోర్, మధుబాలలది విచిత్ర వివాహం. మధుబాల దిలీప్‌కుమార్‌ను ప్రేమించేరోజుల్లో వారిద్దరి మధ్యా ప్రేమలేఖలు చేరవేసే పని చేసినది కిశోరే! అలాగే మధుబాల కిశోర్ మొదటిభార్య రూమాదేవికి కూడా ఫ్రెండు. రూమా కిశోర్‌తో పోట్లాడినప్పుడు "ఇలా తగవులాడితే నేను కిశోర్‌ను పెళ్లి చేసేసుకుంటా జాగ్రత్త!" అని బెదిరించేది. తథాస్తు దేవతలు ఆ మాట నిజం చేసేశారు కూడా! 'నయాదౌర్' (1957) సినిమా నిర్మాణ సందర్భంగా తలెత్తిన వివాదం వల్ల దిలీప్, మధుబాల దూరమయ్యారు. కిశోర్, రూమా ఒకరితో ఒకరికి పడక విడాకులు పుచ్చుకున్నారు. చాలాకాలంగా స్నేహితులుగా ఉన్న కిశోర్, మధుబాలలు వివాహం చేసుకున్నారు!


సమ్మోహనకరం 'మధు' మధురహాసం

**తొలి పరిచయం - భూతం వేషంతో!**

మధుబాలకు కిశోర్‌తో పరిచయం ఏమంత రొమాంటిక్‌గానూ జరగలేదు. 'మహల్' (1949) సినిమాలో ఆమె నటించేరోజుల్లో హీరో అశోక్‌కుమార్ తమ్ముడిగా పరిచయమయ్యాడు కిశోర్. ఆ సినిమాలో మధుబాలది ఓ 'కామినీ పిశాచం' (తోటమాలి కూతురే అలా ట్రిక్కు చేస్తుందనుకోండి) వేషం. ప్రేక్షకులను హడలగొట్టే ఆ పాత్ర వేస్తున్న పాత్రధారిణినే హడలగొట్టి చూడాలనిపించింది కిశోర్‌కు.

దానికి ఓ సాయంత్రం వేళ ఎంచుకున్నాడు. కాస్త కాస్తగా చీకటి పడుతోంది. స్టూడియో పై అంతస్తులో మేకప్ రూమ్ ఉంది. షూటింగ్ ముగిసిన తరువాత మేకప్ తుడిచేసుకోవడానికి మధుబాల అక్కడికి వస్తుందని కిశోర్‌కు తెలుసు. కారిడార్‌లో చీకటిగా ఉన్న ఓ మూల పెద్ద పెద్ద మీసాలున్న మాస్క్ ఒకటి వేసుకుని కిశోర్ నిలబడ్డాడు. మధుబాల అక్కడికి రాగానే ఏదో వికృత జంతువులా అరుస్తూ మీదపడ్డాడు. టీనేజ్‌లో ఉన్న మధుబాల బెదిరిపోయి వెర్రిగా అరుస్తూ మెట్లు దిగి పారిపోయి వచ్చింది. యూనిట్‌లో అందరూ ఏమైందా అనుకుని పరిగెట్టుకుని వచ్చారు. మధుబాల వణుకు చూసి

మాటలు కూడా లేవంటే నమ్మగలరా! కిశోర్‌తో వివాహం భగ్నమయ్యాక, ఆమె మంచం మీద పడ్డాక దిలీప్ ఆమెను చూడడానికి వెళ్ళేవాడు. "నా ఆరోగ్యం బాగుపడితే నాతో మళ్లీ నటిస్తావు కదా?" అని అడిగేదామె దీనంగా. "తప్పకుండా" అంటూ ఆమెను ఓదార్చేవాడతను.

1969 ఫిబ్రవరి 23న ఆమె మరణించే సమయానికి దిలీప్ మద్రాసులో 'గోపి' సినిమా షూటింగులో ఉన్నాడు. బొంబాయికి తిరిగి వచ్చి సాయంత్రం ఆమె ఇంటికి వెళ్లేసరికి అంత్యక్రియలు పూర్తయిపోయాయి. "సరైన సమయంలో సరైన నిర్ణయం తీసుకోకపోవడం, చాలా ఎమోషనల్‌గా ఉండడం, పూర్తిగా తండ్రి చెప్పుచేతల్లో ఉండడం.. వీటివల్లనే ఆమె జీవితం విషాద భరితమయింది"

# విషాదగాథ

అని నిట్టూరుస్తాడు దిలీప్!

❑ మేర్లిన్ మన్రో, లాగానే మధుబాల కూడా తన 36వ యేట నిస్సంతుగా మరణించింది. మేర్లినది ఆత్మహత్య, మధుబాలది జీవితేచ్ఛ నశించిన సహజ మరణం.

❑ బసంత్ (1942) వంటి 6 సినిమాలలో బేబీ ముంతాజ్‌గా నటించి, గీత్‌కమల్ (1947)లో రాజ్‌కపూర్ సరసన తొలిసారి హీరోయిన్ అయి ఏడాదికి నాలుగు చొప్పున 70 పై చిలుకు సినిమాలలో నటించిన మధుబాల ఆఖరి చిత్రం 'మొఘల్-ఏ-ఆజం'. 'బాయ్‌ఫ్రెండ్', 'హాఫ్‌టికెట్', 'పాస్‌పోర్ట్', 'జ్వాలా' చిత్రాలలో కొన్ని బాగాలలో ఆమె డూప్లికేట్లు నటించారు.

❑ 'మహల్' (1949) మధుబాలకు మంచి బ్రేక్ నిచ్చింది. అసలా పాత్ర సురైయ్యాకు ఇద్దామని బాంబే టాకీసు డైరెక్టర్లు అనుకున్నారు. దర్శకుడు కెమాల్ అమ్రోహి పట్టుబడంతో మధుబాలకు దక్కింది.

❑ మధుబాలకు ఆ పేరు పెట్టినది దేవికారాణి. 'మధుబాల' అన్న పేరు మీద 1950లో సినిమా కూడా వచ్చింది.

❑ 'పఠాన్', 'నయ్యాద్', 'షాన్-ఎ-అవధ్', 'మెహబూబా', 'లాలీ చందన్' -ఇవన్నీ అతా నుల్లాఖాన్ మధుబాల డబ్బుతో మొదలుపెట్టి నగంలో మానేసిన సినిమాలు- 'నయ్యాద్' మీద మూడు లక్షలు ఖర్చయ్యాక మానేశారు. 'శాన్-ఎ-అవధ్' మానేసిన కారణం ఏమిటంటే డైరెక్టరు లేటుగా రావడం!


'నయాదౌర్'కై తీసిన స్టిల్. చివరకు వైజయంతీమాలను ఈమె స్థానంలో తీసుకున్నారు. ఈ వివాదం వల్ల దిలీప్‌కుమార్ దూరమయ్యాడు

❑ అతానుల్లాఖాన్ ఒక సినిమా మాత్రం పూర్తిచేయగలిగాడు. అది 'నాతా' (1955). సినిమా ఫ్లాపయ్యి, మధుబాల బంగళా తాకట్టు పెట్టవలసి వచ్చింది.

❑ 1952లో ఫిల్మ్‌ఫేర్ కొందరు ప్రొడ్యూసర్స్‌ను సినీ తారల్లో ఎవరు అందమైన వారో నిర్ణయించమంది. మొదటిస్థానం నళినీ, జయవంతి, రెండు, మూడు స్థానాలు నర్గీస్, బినారాయ్‌లవి. మధుబాలకు దక్కింది నాల్గవ స్థానం మాత్రమే!

❑ బాంబేలో జరిగిన ఫిలిం ఫెస్టివల్‌కి వచ్చిన అమెరికన్ డైరెక్టరు ఫ్రాంక్ కాప్రాను చూడడానికి తారామణులందరూ వెళ్లినా మధుబాల వెళ్లలేదు. కానీ 'మూవీటైమ్స్' కవరు పేజీ మీద ఆమె ఫోటో చూసి ముగ్ధుడైన కాప్రా "ఈ అమ్మాయిని డిన్నర్‌కి పిలు' హాలీవుడ్‌కి పరిచయం చేస్తానని" అని బి.కె.కరంజియాతో అన్నాడు. కానీ మధుబాల తండ్రి నోరు చప్పరించి "తనకి ఫోర్క్స్‌తో తినడం రాదు. డిన్నరూ అక్కర్లేదు, హాలీవుడ్డూ అక్కర్లేదు" అనేశాడు.

❑ మధుబాల సున్నితమైన తన చర్మాన్ని కాపాడడానికి చాలా జాగ్రత్తలు తీసుకునేది. ఫ్లోరా ఫౌంటెన్ వద్ద ఉన్న పార్సీ బావి నీటినే తాగేది. దాంతోనే స్నానం చేసేది.

ఏమిటేమిటని అడిగారు. ఆమెకు నోటమాట రాందే! భయంతో మూర్ఛపోబోతున్న ఆమెను చూసి 'ఇక చాల్లే' అనుకుని కిశోర్ మాస్క్‌లోంచి మొహం బయట పెట్టి ఇకిలించాడు. యూనిటంతా నవ్వారు కానీ విషయం తెలిసి అశోక్‌కుమార్ మాత్రం మండిపడ్డాడు. అప్పటికే కిశోర్ ప్రాక్టికల్ జోక్స్‌కు విసిగి ఉన్నాడేమో తమ్ముణ్ని పిలిచి తిట్టిపోశాడు.

**మధుబాలా అదే టైపు!**

కిశోర్ హడలగొట్టడం వల్ల అలా జరిగింది కానీ మధుబాల కూడా కిశోర్‌లా ఓ రకమైన చైల్డిష్ టైపే! ఎవరైనా పొరబాటు చేస్తే నవ్వేసేది. అందునా తెరతెరలుగా నవ్వేది. సాటి ఆర్టిసులకు మహా మంటగా ఉండేది. 'జాలీనోట్' సినిమా షూటింగు జరుగుతూండగా మధుబాల అదే పనిగా పగలబడి నవ్వుతూండడంతో దేవ్ ఆనంద్ మూడ్ అవుటయ్యేది. సరిగా నటించలేకపోయాడు. చూసి, చూసి ఓ రోజు "మేడమ్, మీరు కాస్త ఇకిలించడం ఆపితే నేను నటించడం మొదలెడతా'' అన్నాడు. అయినా పాపం మధుబాల నవ్వాపుకోలేక పోయింది.

ఇలాటి మధుబాల కిశోర్‌కు తెరపై బ్రహ్మాండమైన జోడీ. 'చల్తీ కా నామ్ గాడీ' తీసుకోండి. కిశోర్ హుషారుకు ఏ మాత్రం తీసిపోకుండా మధుబాల నటించిందనడానికి 'హాల్ కైసా హై జనాబ్ కా' పాట ఒక్కటి చాలు. 'ఝుమ్రూ'లో కాస్త ప్రేమ, సెంటిమెంటు జోడించినా దానిలో కూడా ఆమె, కిశోర్ కలిసి అనూప్‌కుమార్‌ను ఏడిపించే పాట ఉంది. అలాగే 'హాఫ్ టికెట్'లో కూడా. కిశోర్ చిన్న కుర్రాడిలా నటిస్తూంటే, అమాయకుడనుకుని అతన్ని చేరదీసిన అమ్మాయి మధుబాల ఇంకా సరదాగా నటించింది.

వాళ్లిద్దరూ కలిసి నటించిన మొదటి చిత్రం - "ఢాకే కా మల్‌మల్" (1956). "చల్తీ కా నామ్ గాడీ" (1958) లో వాళ్ల జంట హిట్ అయింది. తర్వాత "మెహలోంకే ఖ్వాబ్'' (1960), "ఝుమ్రూ'' (1960), "హాఫ్ టికెట్" (1962). ''ఝుమ్రూ'', ''హాఫ్ టికెట్'' రెండూ విజయవంతమైన చిత్రాలే! వినోదభరితమైన సినిమాలే!

**మధుబాల వైవిధ్యం**

కిశోర్‌కుమార్‌తో సరదా సినిమాలు వేసింది కదాని మధుబాల నటన దానికే పరిమితం అనుకుంటే పొరబాటు. కిశోర్ కంటె ముందే చిత్రసీమలో ప్రవేశించి వివిధరకాలైన పాత్రలు ధరించింది. స్టార్‌గా ఆమె స్థాయి కిశోర్ కంటె చాలా ఎక్కువ. అగ్రశ్రేణి కథానాయకుల సరసన, పెద్ద బ్యానర్‌లకు పనిచేసిందామె! "మొఘల్-ఏ-ఆజమ్" లో అనార్కలిగా వేషం వేసి

## కిశోర్ గీతావళి

ఆశా : హాల్ కైసాహై జనాబ్‌కా
కిశోర్ : క్యా ఖయాల్ హై ఆప్‌కా
ఆశా : తుమ్ తో మచల్ గయే, ఓ.. ఓ.. ఓ..
కిశోర్ : యూఁ హీ ఫిసల్ గయే, ఆ... ఆ... ఆ... ॥హాల్॥
బెహకీ-బెహకీ చలే హై పవన్ జో ఉడేహై తేరా ఆంచల్
ఆశా : ఛోడో-ఛోడో దేఖో-దేఖో
గోరే-గోరే కాలే-కాలే బాదల్ ॥బెహకి॥
కిశోర్ : కభీ కుఛ్ కహతీ హై ॥2॥
జరా నజర్ కో సంభాల్ నా ॥హాల్॥
కిశోర్ : పగ్‌లీ... పగ్‌లీ... కభీ తూనే సోచా
రస్‌తే మే గయే మిల్ క్యోం
ఆశా : పగ్‌లే... పగ్‌లే... తెరీ బాఁతో బాఁతోమె
ధడక్‌తా హై దిల్ క్యోం ॥పగ్‌లీ॥
కిశోర్ : కభీ కుఛ్ కహతీ హై ॥2॥
జరా నజర్ కో సంభాల్ నా ॥హాల్॥
ఆశా : కహోజీ! కహోజీ! రోజ్ తేరేసంగ్
యూ హీ దిల్ బహలాయే క్యా
కిశోర్ : సునో జీ! సునోజీ! సమఝ్ సకోతో
ఖుద్ సమఝో బతాయేఁ క్యా ॥కహోజీ॥
ఆశా : కభీ కుఛ్ కహతీ హై ॥2॥
జరా నజర్ కో సంభాల్ నా ॥హాల్॥



మజ్రూ సుల్తాన్‌పురి రాసిన ఈ హాస్య గీతానికి సంగీతం సమకూర్చినది ఎస్.డి.బర్మన్. చిత్రం 'చల్తీ కా నామ్ గాడీ'. కిశోర్, ఆశా హుషారుగా పాడితే తెరపై కిశోర్, మధుబాల మరింత హుషారుగా ఆడారు.



సినీచరిత్రలో చిరస్థాయియైన కీర్తి సంపాదించుకుంది. 1942 లో "బసంత్"లో బాలతారగా ప్రవేశించిన ఆమె 1947 లో కిదార్‌శర్మ తీసిన "నీల్ కమల్"లో రాజ్‌కపూర్ సరసన హీరోయిన్‌గా పరిచయమయ్యింది. రాజ్‌కపూర్‌తో 'దిల్ కా రాణి''(1947), "అమర్‌ప్రేమ్" (1948), "దో ఉస్తాద్" (1959) సురేంద్ర తో "చిత్తోడ్ విజయ్" (1947), మేరే భగవాన్ (1947) "దులారీ" (1949), "ఇంతిహాన్" (1949), అశోక్‌కుమార్ సరసన "మహల్'' (1949), "నిశానా" (1950), "ఏక్ సాల్" (1957), "హౌరా బ్రిజ్" (1958) దేవ్ ఆనంద్ సరసన "మధుబాల" (1950) "నిరాలా'' (1950), "ఆరామ్" (1951), "నాదాన్" (1951), "అర్‌మాన్" (1953), "కాలాపానీ" (1958) "జాలీ నోట్" (1960) దిలీప్ కుమార్ సరసన 'తరానా" (1951), 'సంగ్‌దిల్'' (1952), "అమర్'' (1954) ''మొఘల్-ఏ-ఆజమ్'' (1960) షమ్మీకపూర్‌తో 'రైల్ కా డిబ్బా" (1953), "నకాబ్" (1955), "బాయ్ ఫ్రెండ్" (1961) గురుదత్‌తో "మిస్టర్ అండ్ మిసెస్ 55" (1955) ప్రదీప్ కుమార్‌తో "రాజ్‌హట్" (1956), 'షిరీన్ ఫరహాద్" (1956), "యహూదీ కీ లడ్కీ" (1957), "పోలీస్" (1958), "పాస్‌పోర్ట్"(1961) భరత్ భూషణ్‌తో "గేట్ వే ఆఫ్ ఇండియా" (1957), "ఫాగున్" (1958), "కల్ హమారా హై" (1959), "బర్సాత్ కీ రాత్" (1960) - ఇలా అనేక సినిమాలలో వేసింది.

కిశోర్‌కు 1955 దాకా హిట్ సినిమాయే రాలేదు. ఆ పాటికే మధుబాల ఓ నలభై సినిమాలలో హీరోయిన్‌గా వేసి ఉంది. దిలీప్ కుమార్‌తో ఆమె ప్రణయం పతాకశీర్షికలకు ఎక్కి ఉంది. దిలీప్ వంటి హీరోని వదిలి మధుబాల కిశోర్ వంటి హాస్యనటుడిని పెళ్లి చేసుకోవాలనుకోవడం చాలామందికి రుచించలేదు. నదీరా (కథానాయికగా ప్రారంభించి



ప్రేక్షకులనే కాదు, హీరోలనూ వెంటాడే చూపులు

వ్యాంప్ పాత్రలలో పేరు తెచ్చుకున్న నటీమణి) ఓరోజు మధుబాల వేలి మీద 'కె' అని రాసున్న ఉంగరం చూసింది. ఆరాలు తీసి నిర్ఘాంతపోయింది. "వాటీజ్ దిస్ మధూ! ఫ్రమ్ సబ్లైమ్ టు ది రిడిక్యులస్! వాట్ ఆర్యూ డూయింగ్!" అని తిట్టిపోసింది. కానీ మధుబాల తన నిర్ణయం మార్చుకోలేదు. "నా జీవితంలో హాయి అనుభవించేది అతని సమక్షంలో మాత్రమే'. అంది. అన్నట్టుగానే కిశోర్‌ను పెళ్లి చేసుకుంది. మిసెస్ కిశోర్‌గానే అంతిమశ్వాస విడిచింది.

**రొమాన్సు ప్రారంభం సెట్లోనే!**

'చల్తీ కా నామ్ గాడీ' సినిమా తీసేరోజుల్లో కిశోర్, మధుబాలల మధ్య పరస్పర ఆకర్షణ ప్రారంభమయింది. అప్పటికే మధుబాల టాప్ స్టార్, ఎవరికీ అందుబాటులో లేని అందాలరాశి. తన పనేమో, తనేమో తప్ప ఆమె బయట ఎక్కడా కనబడేది కాదు. అటువంటి తార తనతో మాట్లాడడం, తన జోకులకు పడిపడి నవ్వడం కిశోర్‌కు గర్వకారణంగా ఉండేది. అందునా భార్య తనను విడిచివెళ్లిపోయిన డిప్రెషన్‌లో ఉన్నాడు కాబట్టి మధుబాల వంటి స్టార్ తనకు ఇచ్చిన ప్రాధాన్యతకు అతను ఉప్పొంగిపోయాడు. మధుబాలకు కూడా కిశోర్ చేసే తమాషాలు, సరదా స్వభావం ఎంతో నచ్చాయి. ఆమెకు ఏడేళ్ల వయసునుండి స్టూడియోలు, ఇల్లు తప్ప వేరే ఏమీ తెలియదు. తండ్రి కరుకు స్వభావం వల్ల ఆమె మగవాళ్లంటేనే బెరుకు. అప్పటిదాకా తను ప్రేమించినవాళ్లంతా సీరియస్ టైపే! పైగా నయాదౌర్ కేసు విషయంలో తన బాగోగులు ఆలోచించని దిలీప్ కుమార్ కంటే తనను సరదాగా ఉంచడానికి ప్రయత్నిస్తున్న కిశోర్ ఆమెకు నచ్చాడు.

'చల్తీ కా నామ్ గాడీ' సెట్స్ మీద ప్రారంభమయిన వారి ప్రణయం నెమ్మదిగానే ముందుకు సాగింది. దిలీప్‌కుమార్‌తో వ్యవహారం చెడిపోయాక మధుబాల ఎవరినో ఒకరిని పెళ్లి చేసుకోవలసిన అవసరం ఏర్పడింది. 'మొఘల్-ఏ-ఆజమ్' సినిమాలో దిలీప్‌కు జోడీగా నటించడానికి మధుబాల ఒప్పుకోవడంతో మళ్లీ వాళ్లిద్దరి మధ్య సయోధ్య కుదురుతోందని, ఎలాగైనా దిలీప్‌ను దారిలోకి తెచ్చుకోవడానికి మధుబాల ప్రయత్నిస్తోందని పుకార్లు వచ్చాయి. వాటిని అరికట్టడానికైనా మధుబాల వేరేవాళ్లని పెళ్లి చేసుకుందామనుకుంది. కిశోర్‌ను మొదటిభార్య విడిచి వెళ్లిపోయింది కాబట్టి అడ్డంకి కూడా లేదు. 'మెహలోం కే ఖ్వాబ్, హాఫ్ టికెట్' చిత్రాల నిర్మాణం సాగేటప్పుడు పెళ్లి చేసుకుందామనుకున్న నిర్ణయం మరింత బలపడింది.

**వివాహం**

1960 అక్టోబరు 16 న జరిగిన కిశోర్, మధుబాలలది మతాంతర, భాషాంతర వివాహం. ఆమె అసలుపేరు ముంతాజ్‌జెహా దెహ్లవీ. పఠాన్ జాతికి చెందినది. మాతృభాష పుష్తు. ఉర్దూ బాగా వచ్చు. బిహార్‌కు చెందిన బెంగాలీ బ్రాహ్మణ కుటుంబం నుండి వచ్చినవాడు కిశోర్. మధుబాల తండ్రి విపరీతమైన కట్టుదిట్టాలతో ఆమెను పెంచాడు. కిశోర్ తొలివివాహం కులాంతరం. అప్పుడు చేసుకున్నట్టుగానే ఇప్పుడు కూడా రిజిస్టరు మేరేజి చేసుకున్నాడు. ఎవరూ మతం మార్చుకోలేదు. మధుబాల తండ్రికి ఈ పెళ్లి



స్నేహితులుగా ఓకే, భార్యాభర్తలుగా ఫెయిల్

అస్సలు ఇష్టం లేదు. అయినా దిలీప్ వ్యవహారం తర్వాత కూతురి ఇష్టాన్ని వ్యతిరేకించే సాహసం చేయలేకపోయాడు. కిశోర్ తల్లిదండ్రులకు అతను ముస్లిమ్‌ను పెళ్లాడడం నచ్చలేదు. బాధపడుతున్న తల్లిదండ్రులను కిశోర్ ఊరుకోబెట్టాడు కానీ వాళ్లు చివరిదాకా మధుబాల పట్ల ఉదాసీనంగానే ఉన్నారు.

పెళ్లి జరిగిన మర్నాడు తను సినిమాల నుండి విరమించుకుంటున్నట్టు మధుబాల ప్రకటించింది. దాంతో ఆమెకు అడ్వాన్సు ఇచ్చిన కొంతమంది ప్రొడ్యూసర్లు కేసులు పెట్టారు. వాళ్లతో ఆమె రాజీ కుదుర్చుకుంది. తొమ్మిదో యేట నుండి మొహానికి రంగు వేసి, వేసి అలసిపోయిన ఆమె ఇప్పటికైనా విముక్తి దొరికింది అనుకుంది. హాయిగా ఇంటిపట్టున ఉందామనుకుంది. ఆరోగ్యం జాగ్రత్తగా చూసుకుందామనుకుంది.

అప్పటికే తన గుండెలో రంధ్రం ఉందన్న సంగతి మధుబాలకు తెలుసు. ఆ విషయం కిశోర్‌కు తెలిపింది కూడా. ఏముంది, ఫారిన్ వెళ్లి వైద్యం చేయించుకుంటే అదే నయం అయిపోతుంది అనుకున్నారిద్దరూ! దానిగురించి పెళ్లి మానుకోనక్కరలేదనుకున్నారు. (నిజానికి అప్పటికి దానికి వైద్యం లండన్‌లో కూడా లేదు.)

**అందం, అభినయం కలబోసిన మధుశా(బా)ల**



ఇటువంటి తొందరపాటే వారి వివాహ వైఫల్యానికి దారితీసింది. మధుబాలకు కిశోర్‌తో ఒకరినొకరు బాగా అర్థం చేసుకునేటంత పెద్ద పరిచయం లేదు. ఎక్కువకాలం ప్రణయం సాగలేదు కూడా. పెళ్లి అయిన తర్వాతనే వారిద్దరి మధ్యా ఎంత వైరుధ్యం ఉందో బాగా తెలిసివచ్చింది.

**విచ్ఛేదానికి కారణం - హృదయంలో రంధ్రం**

మధుబాల తన కెరియర్‌ను చాలా సీరియస్‌గా తీసుకున్న వ్యక్తి. చిన్నతనంలోనే స్టార్‌డమ్ వచ్చేయడంతో అందరూ ఆమెను గౌరవించేవారు. పొగిడేవారు. ఆమె అందం గురించి, అభినయం గురించి ఎటుచూసినా ప్రశంసలే. సినిమాలు తప్ప వేరేలోకం చూడని మధుబాలకు అవగాహన తక్కువ. సినిమాలు మానేశాక ఆమె మూడీగా తయారయింది. పైగా పెళ్లి అయిన తర్వాత కిశోర్ తన అనారోగ్యం గురించి పట్టించుకోవడం మానేసాడని ఆమెకు అనుమానం పట్టుకుంది. లండన్ వెళదా మంటే కిశోర్ 'చూద్దాంలే' అంటాడు కానీ కదలడు. ఒకవేళ అప్పటికే అతనికి అది నయం కాని వ్యాధి అని తెలిసిందేమో!

కిశోర్ ఉదాసీనత చూసి ఒక పరిచయస్తుడు మధు బాలతో "నేను వెంట బెట్టుకుని లండన్ తీసు కెళతా రా" అన్నాడు. దాంతో సిగ్గుపడి కిశోర్ స్వంత ఖర్చుల మీద ఆమెను లండన్ తీసుకెళ్లాడు. కానీ అప్పటికే మధుబాలకు సందేహం వచ్చేసింది - 'ఇతనికి నేనక్కరలేదన్నమాట' అని. మధుబాల చెల్లెలు ఒకామె 'తన స్వంత సినిమాల్లో ఫ్రీగా వేషం వేస్తుంది కదాని కిశోర్ మా అక్కను చేసుకున్నాడు కానీ తన మీద ప్రేమకొద్దీ కాదు." అనేసింది. లండన్ వెళ్లి చూపించుకునే సరికి తెలిసింది - ఇదేమీ తగ్గే వ్యాధి కాదని. "ఆపరేషన్ చేయడానికి వీలు కాదు. నువ్వు ఏడాదిలోనే పోవచ్చు, లేదా పదేళ్లు బతకవచ్చు. పిల్లలు కనవద్దు. ఎటువంటి ఆందోళనా, మానసిక చింతా పెట్టుకోవద్దు." అని చెప్పారు డాక్టర్లు.

కొత్త భార్య ఇంత డెలికేట్ అని తెలియగానే

కిశోర్‌కు ఉత్సాహమంతా చచ్చింది. అతని జీవితంలో నవ్వు ఇగిరిపోయింది. ఏ సరదాలు చూసి వరించిందో ఆ సరదా మొగుడిలో కనబడకపోయేసరికి మధుబాల నిరాశకు గురయింది. నర్గీస్ అనారోగ్యం పాలయినప్పుడు సునీల్‌దత్ ఆమెకు అండగా, ఆసరాగా నిలబడి ఎంతో మానసిక స్థైర్యాన్ని ఇచ్చాడు. కానీ దానికి ముందు వాళ్లిద్దరూ ఎన్నో ఏళ్ల వైవాహిక జీవితం గడిపారు. కిశోర్ విషయంలో అది జరగలేదు. పెళ్లయి కాస్తయినా అనుబంధం ఏర్పడకుండానే ఈ ఉపద్రవం ముంచుకురావడంతో కిశోర్ బెంబేలెత్తిపోయాడు. అశోక్‌కుమార్‌లా బాధ్యతలు తలకెత్తుకునే మనిషి కాదతడు.

**నిరాశకు గురయిన అందాలరాశి**

ఇది మధుబాలను కృంగదీసింది. తనకు భర్త ఆదరణా లేదు, అత్తమామల ఓదార్పూ లేదు. ఇంకెందుకు ఇక్కడ ఉండడం అనుకుని పుట్టింటికి వెళ్లిపోయింది. ఆమెను చూడడానికి కిశోర్ తరచుగా అక్కడికే వెళ్లేవాడు. అనారోగ్య పీడితురాలై, సినిమాల్లో వచ్చిన గుర్తింపు పోగొట్టుకుని ఇంట్లోనే పడివుండవలసిన 27 యేళ్ల మాజీతార మనస్తత్వం ఎలా ఉంటుందో ఊహించవచ్చు. ఆమె సినిమాలలో రిటరయిన తర్వాత రిలీజయిన "మొఘల్-ఏ-ఆజమ్' ఆమెను సినీచరిత్రలో మరుపురాని అనార్కలిగా నిలిపింది. కానీ ఆ స్టార్‌డమ్ అనుభవించలేని పరిస్థితి ఆమెది. అటువంటి మానసిక స్థితిలో ఆమె బ్యాలన్స్‌డ్‌గా ప్రవర్తించకపోవడం సహజం. కిశోర్ మెంటల్ బ్యాలెన్స్ కూడా అంతంత మాత్రమే కాబట్టి ఇద్దరూ కలిసి జీవితం దుర్భరం చేసుకున్నారు. తనను చూడడానికి వచ్చే కిశోర్‌ను ఏడిపించడమే పనిగా పెట్టుకునేది మధుబాల. "నేను పోయాక మా చెల్లెల్ని చేసుకో'' అని పట్టుబట్టేది. "ఛ, ఛ ఆ మాటలెందుకిప్పుడు?'' అంటే కాదు కూడదనేది. "సరేలే. చూద్దాం'' అని అనిపించి, "చూశావా, నేను ఎప్పుడు పోతానా, మా చెల్లెల్ని చేసుకుందామా అని చూస్తున్నావ్'' అని అల్లరి పెట్టేది. ఈ గోల భరించలేక కిశోర్ వెళ్లడం తగ్గించేవాడు. "అవున్లే నా మీద ప్రేమ ఉంటేగా, నీ మొదటిభార్య మీద నీకింకా మోజు పోలేదు.' అని గొడవ పెట్టేది.

మళ్లీ సినిమాల్లో వేస్తేనైనా బాగుపడుతుందేమో ననుకుని "నిన్ను హీరోయిన్‌గా పెట్టి సినిమా తీస్తా'' అనేవాడు కిశోర్. అంతలోనే ఆమె 'మొఘల్-ఏ-ఆజమ్' సినిమా వేసుకుని చూస్తూ ఉంటే అసూయతో భగ్గుమనేవాడు. "చల్తీ కా నామ్ గాడీ'' చూడవచ్చుగా, ఈ సినిమా ఎన్నిసార్లు చూస్తావ్. అంటూ అరిచేవాడు. ఆమె పోయిన తర్వాత ఫిలింఫేర్‌కు ఇచ్చిన ఇంటర్వ్యూలో కిశోర్ అన్నాడు కూడా "మధుబాల నా ఫ్రెండు దిలీప్‌కుమార్ గర్ల్‌ఫ్రెండుగానే గుర్తుండిపోయింది'' అని.

అక్టోబరు 1962లో కిశోర్ తండ్రిని పోగొట్టుకున్నాడు. ఆయనను అమితంగా ప్రేమించిన కిశోర్ మరింత ఒంటరిగా ఫీలయ్యాడు. అప్పటికే ఆమె ఆరోగ్యం మరింత క్షీణించి నోటివెంట రక్తం పోతుండేది. భార్యాభర్తలిద్దరూ విడిపోవడం తథ్యం అనేది అందరికీ తెలిసిపోయింది. ఆ సమయంలో నౌషద్ ఇంటికి నియామతుల్లా ఖాన్ అనే ఫకీర్ వచ్చారని తెలిసి మధుబాల వెళ్లింది. "నాకు చావు త్వరగా వచ్చేట్లు ఆశీర్వదించండి స్వామీ'' అని ఏడిచింది. నౌషద్ చలించిపోయాడు. "పెళ్లి మాట ఎత్తితేనే కన్నీరు కారుస్తున్నావు. కిశోర్‌కుమార్‌తో విడాకులు తీసుకుని జీవితం సరికొత్తగా ఆరంభించు'' అని సలహా ఇచ్చాడాయన. జవాబుగా మధుబాల షేరీ భోపాలీ రాసిన ఓ కవిత వినిపించింది -



చెల్లెలు చంచల్, కిశోర్, ప్రదీప్‌కుమార్లతో షూటింగ్ విరామ సమయంలో...

"జబ్ కష్తీ సాబిత్-ఓ-సాలిమ్ థీ
సాహిల్ కీ తమన్నా కిస్‌కో థీ?
అబ్ ఐసీ షికస్తా కష్తీ మే
సాహిల్ కీ తమన్నా కౌన్ కరే?

(నావ సురక్షితంగా ఉన్నప్పుడు ఒడ్డుకు చేరే ఆలోచనే లేదు. ఇప్పుడు నావ ఇంత నాశనమయ్యాక ఒడ్డు గురించే ఆశే లేదు.)

అందువల్ల వారిద్దరూ విడిగానే జీవించినా విడాకులు తీసుకోలేదు. ఆమె హృద్రోగంతో బాధపడి, పడి చివరకు 1969 ఫిబ్రవరి 23 న తన 36 వ యేట ఆఖరి శ్వాస విడిచింది. ఆమె శవపేటికను భుజానికి ఎత్తుకున్నవారిలో కిశోర్ ఉన్నాడు. మతాంతర వివాహం చేసుకున్నా మతం మార్చుకోమని ఒకరినొకరు ఒత్తిడి చేసుకోలేదు. అందువల్ల మధుబాల అంత్యక్రియలు ముస్లిమ్ సంప్రదాయం ప్రకారమే జరిగాయి. 18 యేళ్ల తర్వాత కిశోర్ మరణించినప్పుడు హైందవ సంప్రదాయం ప్రకారమే అంత్యక్రియలు జరిగాయి కానీ అవి జరగవలసిన స్థలం గురించి కిశోర్ ఒక వింత కోరిక కోరాడు.

**(ఇంకావుంది)**



## ప్రధానమంత్రి ఎస్.డి.బర్మన్ అభిమాని!



రాజకీయాల్లోకి వచ్చినా శ్రీ అటల్ బిహారీ వాజపేయి వ్యక్తిగతంగా కవి అని, సంగీతం, సాహిత్యం అంటే ఆయన చెవికోసుకుంటారని అందరికీ తెలుసు. ఆయనకు ఇష్టమైన సంగీతదర్శకుడు ఎవరో తెలుసా? - ఎస్.డి.బర్మన్ ! కంపోజర్ గానే కాదు, సచిన్ దేవ్ బర్మన్ ఆయనకు గాయకుడిగా కూడా ఇష్టుడే! తన కిష్టమైన పాటలు చెప్పమంటే ఆయన చెప్పిన మూడు పాటల్లో రెండు సచిన్ దేవ్ బర్మన్‌వే! - 'ఓ మేరే మాఝీ', 'సున్ మేరే బంధూరే' వాజపేయిగారికి చిన్న బర్మన్ అన్నా ఇష్టమేననిపిస్తోంది. తనకు నచ్చిన హిందీసినిమాల పేర్లు చెప్పమంటే ఆయన చెప్పిన 6 సినిమాలలో మూడిటికి - 'తీసీకసమ్', 'మౌసమ్', ఆంధీ' లకు సంగీతం ఇచ్చినది రాహుల్ దేవ్ బర్మనే! తక్కిన వాటిల్లో రెండింటికి (దేవదాస్, బందినీ) సంగీతం సమకూర్చినది సచిన్ దేవ్ బర్మన్ కాగా మిగిలిన 'మమ్‌తా'కు కంపోజర్ రోషన్!

తన 78 వ పుట్టినరోజు సందర్భంగా గత పక్షం డిసెంబరు 25న తన యిష్టాయిష్టాలను వెల్లడించిన వాజపేయి గారు చెప్పిన ఇతర విషయాలలో కొన్ని-

ఇష్టమైన గాయనీగాయకులు - లతా మంగేష్కర్, ముకేష్

ఇష్టమైన పాటలు - 'ఓ మేరే మాఝీ', 'సున్ మేరే బంధూరే', 'కభీ కభీ మేరే దిల్ మే'

ఇష్టమైన నటీనటులు - సుచిత్రాసేన్, రాఖీ, నూతన్, సంజీవ్‌కుమార్, దిలీప్ కుమార్

ఇష్టమైన శాస్త్రీయ సంగీతకళాకారులు - భీమ్‌సేన్ జోషి, అమ్జాద్ అలీఖాన్, హరిప్రసాద్ చౌరాసియా



# బాపు విశ్వరూపం 3

గతంలో గ్రీటింగు కార్డులు జనవరి 1 కి మాత్రమే పంపేవారు. క్రిస్మస్, న్యూ ఇయర్ కలిపి ఉండేవి కాబట్టి శాంతాక్లజ్, చర్చి గంటలు, రిబ్బన్లు, చెర్రీపళ్లు మంచుతో కప్పబడిన క్రిస్మస్ చెట్లు - ఇవి ఉన్న గ్రీటింగ్స్ కార్డులే దొరికేవి. వీటిలో ఏవీ మన వాతావరణానికి సంబంధించినవి కావు. 1975 ప్రాంతాల్లో గ్రీటింగు రంగంలోకి బాపు ప్రవేశించడంతో ఇదంతా మారిపోయింది. మన సంస్కృతిని ప్రతిబింబించే, మనను మనం ఐడెంటిఫై చేసుకోగలిగే గ్రీటింగులు మార్కెట్లోకి వచ్చాయి. సంక్రాంతి, ఉగాది, దీపావళి వంటి మన పండుగలకు గ్రీటింగ్స్ పంపుకోగలిగే వెసులుబాటు కలిగింది.

అప్పటిదాకా హరిదాసు బొమ్మలు, గొబ్బిళ్ల బొమ్మలు ఎవరూ వేయలేదని కాదు. పత్రికలలో అనేకం వచ్చేవి. కానీ గ్రీటింగ్ కార్డులకు కావలసిన ఫ్రేమింగ్, కటింగ్, వాటిలో ఉండేది కాదు. అలా చేయగలిగిన ఘనత బాపుదే! ఆ అదృష్టం మన తెలుగుసంస్కృతిదే! ఎందుకంటే దీపావళికి ఉత్తరభారతంలో లభించే అసంఖ్యాకమైన గ్రీటింగ్స్ చూడండి. వాటిల్లో దీపం బొమ్మో, దేవీదేవతామూర్తుల బొమ్మో తప్ప దీపావళి జరుపుకునే జనసామాన్యం కనబడరు. వాళ్లు 'సేలబుల్' కాదేమో వారి దృష్టిలో!







తెలుగునాట సంక్రాంతి ఎలా జరుపుకోబడుతుందో చక్కటి బొమ్మలు వేసి 'సేలబుల్'లో చేసిన బాపు గ్రీటింగ్స్‌లో కొన్ని చూడండి. సంక్రాంతి లక్ష్మి, ముగ్గులు పెట్టే బాపు మార్కు ముద్దుగుమ్మలు, గొబ్బెళ్లు ఆడే పల్లెపడుచులు, సంక్రాంతి వాతావరణం మొత్తం కనబడే దృశ్యం - హరిదాసు, డూడూ బసవన్నలతో సహా -, పంట ఇంటికి తెచ్చుకున్న రైతు కుటుంబం (వెనుక తివాచీ డిజైన్లో అమరిపోయిన ఎద్దులను 'మిస్' చేయకండి), పండక్కి వచ్చే భర్తకోసం ఎదురుచూసే నవవధువు, - అన్నీ బాపు కుంచెలో ఎలా రూపు దిద్దుకున్నాయో చూడండి.







అలనాటి ఆణిముత్యాల
గురించి నేటి తరానికి అనువైన శైలిలో తెలిపే

**క్లాసిక్స్ రీటోల్డ్**

# నవ్వుటద్దాలు

- ఆచార్య తిరుమల




మనకి అల్పుల సంఖ్యాబలం ఎక్కువ. అన్ని రంగాల్లోనూ ఎక్కడపడితే అక్కడ అల్పులు కనిపిస్తారు. వాళ్ల ప్రవర్తన చాలా దుర్భరంగా వుంటుంది. కూటికి లేకుండా కోటలు దాటే మాటలు మాట్లాడుతూ వుండడం, ఏది పడితే అది, ఎలా పడితే అలా, ఎవరితో పడితే వారితో వాగుతూ పెద్ద మాటకారుల్లా తమకు తామే అనుకుని తిరుగుతూ వుండటం, చదువేమీ పెద్దగా లేకుండానే పెద్దల్ని, పెద్ద పెద్ద విషయాల్ని చాలా తెలివైన వాళ్లలా విమర్శిస్తూ వుండటం, అర్హతను మించిన అధికారాల్ని చేజిక్కించుకుని కన్నూమిన్నూ కానకుండా అందర్నీ కించపరుస్తూ వుండటం, కపటోపాయాలతో దొడ్డిదారుల్లో దొడ్డ బేరాలతో అందలాలెక్కి మేధావుల్ని అణిచేసి, శుంఠల్ని ఆకాశాలకెత్తేయటం, ఏమీ లేకపోయినా ఏదో వున్నట్టుగా నటిస్తూ వుండటం-ఈ అల్పులు చేసే పనుల్లో కొన్ని. ఈ అల్పత్వానికి చిన్నా-పెద్ద, పేద-గొప్ప, ఆడ-మగ, పాలక-పాలిత, పండిత-పామర వంటి భేదాలేమీలేవు. కాబట్టి, ఏదో సమయంలో, ఏదో స్థాయిలో ఎవరిలోనైనా యిది బయటపడుతూ వుంటుందని గమనించాలి.

# అల్పుల మిడిసిపాటు

ఈ అల్లుళ్ళి గురించి చెప్పవలసి వచ్చినప్పుడే-"అన్నీ వున్న ఆకు అణిగి మణిగి వుంటుంది ఏమీ లేని ఆకే ఎగిరెగిరి పడుతుందని", "పేనుకి పెత్తనమిస్తే తలంతా తెగ గొరిగిందని", "వట్టిగొడ్డుకి అరుపులెక్కువని", "కుక్కని సింహాసనం మీద కూర్చోబెడితే కుచ్చులన్నీ కొరికిందని"-మొదలైన సామెతలు పుట్టాయి.

నక్కలు బొక్కలు వెదకును
నక్కఅతో నూరపంది యగడిత వెదకున్
కుక్కలు చెప్పులు వెదకును
దక్కిడి నా లంజె కొడుకు తప్పే వెదకున్!!

అని తెనాలి రామకృష్ణ కవి తప్పులు మాత్రమే వెదుక్కునే అల్లుళ్ళి నక్కలు, పందులు, కుక్కలు చేసి చెడ తిట్లు తిట్టాడు. అల్లుని కుక్కతో పోల్చటం పరిపాటి. "అల్లుని జేర్చిన నధిక ప్రసంగియౌ, ముద్దు చేసిన కుక్క మూతినాకు" అని వేణుగోపాల శతక కర్త వెంకట రాయకవి అంటే, "కుక్క పిల్ల, అగ్గిపుల్ల, సబ్బు బిళ్ల-హీనంగా చూడకు దేన్నీ" అని విశాల హృదయాన్ని ప్రదర్శించిన శ్రీశ్రీ "మనదీ ఒక బ్రతుకేనా? కుక్కలవలె నక్కలవలె?" అని కుక్క బతుకుల్ని హీనంగానే చూశాడు. వేమన మాత్రం

అల్పబుద్ధి వాని కధికార మిచ్చిన
దొడ్డ వారి నెల్ల తొలగగొట్టు
చెప్పు దినెడు కుక్క చెఱకు తీపెరుగునా?

అనటంతో బాటు-

"అల్పుడెపుడు బల్కు నాడంబరముగాను
సజ్జనుండు పల్కు చల్లగాను
కంచు మ్రోగునట్లు కనకంబు మ్రోగునా?"

అని అల్పులకి గంట కొడుతూ- "**అల్పుడెన్ని పల్కులయక పలికినా నధికుడూరకుండు నదిరిపడక**" అని హితవు కూడా పలికాడు. వేమనకి చాలా పూర్వమే శ్రీనాథ మహాకవి తన భీమఖండ కావ్యంలో

నికటమున నుండి శ్రుతిపుట నిష్ఠురముగ
నదరి కాకులు బిట్టు పెద్దరిచి నప్పు
దుడిగి రాయంచ యూరక యుంట లెస్స
సైప రాకున్న నెందేని జనుటయొప్పు!!

అని చీటికి మాటికి కువిమర్శలతో గోలగోల చేసే అల్పుల్ని దృష్టిలో పెట్టుకుని, చెవులు బద్దలయ్యే కాకిగోల భరించలేకపోతే హంస యెక్కడికైనా వెళ్ళిపోవడం మంచిదన్నాడు. ఈ అల్పుల హడావిడంతా గుర్రాల పరుగులా, కుక్కల మొరుగుడులా వుంటుంది. నిజానికి, యీ అల్పులేమి చేయగలరు? ఒక ధీరుని మనస్తాపాన్ని సత్పురుషులు తీర్చినట్టుగా తీర్చగలరా? మండుటెండల వేడి, మేఘాల కుంభవృష్టికి గాక పుక్కిలించి వుమ్మేసిన నీటికి చల్లబడుతుందా? ఈ అర్థాన్నొక కవి యిలా అంటున్నాడు

ధరనత్యుత్తముడైన ధీరుని మనస్తాపంబు దీర్పంగ స
త్పురుషానీకము యోపుగాని యొక యల్పుండోపునే! తీవ్రదు
స్తర నైదాఘ విదాహ తాప మడపన్ ధారాధరాంచద్రసో
త్కర ధారావళి గాక యర్హమగునే గండూష తోయంబున్?

ఇలా యెందుకూ పనికిరాని అల్పులు కూడా తాము అధికుల మనుకుంటారు. అసలు గమ్మత్తేమిటంటే-ఆకాశాన్ని గూర్చి ఆలోచించేవాడెవడూ తాను గొప్పవాణ్ణనుకోడు; అవకాశాన్ని గూర్చి ఆలోచించేవాడెవడూ తాను అల్పుణ్ణనుకోడు. అనుకోకపోతే మానె, తానే గొప్పనుకుంటాడు. అంతేమరి. ఎద్దుమీద వాలిన ఈగ తానే పొలం దున్నుతున్నాననుకుంటుందిట! బొద్దింకలు వంటింటిని తమ కోసం నిర్మించిన స్వర్గమనుకుంటాయట! ఏం చేస్తాం? ఆ తెలివి అంతే! ఎంతున్నా, ఏమున్నా అల్పుడెప్పుడూ అధికుడు కాడని చెన్న కవి:-

అపరిమిత వాహనాదిక
మపూర్వముగ నున్న నల్పుడధికుండౌనా?
విపులాంబర వాద్యంబుల
కుపతియగున గంగిరెద్దు గువ్వల చెన్నా?

అన్నాడు. పట్టుబట్టలు, మంగళ వాద్యాలున్న మాత్రాన గంగిరెద్దు భూమినేలే రాజు కాదు గదా! విధివశాన ఒకానొక అల్పుడు అధికారియైతే ఎలా వుంటాడో మరో కవి నోట వినండి:-

విధి సంకల్పముచే నొకానొకడు తా విశ్వంబు పాలించుచో
బధిరంబెక్కువ చూపు తక్కువ సదా భాషల్ దురుక్తుల్ మనో
వ్యథతో మత్తత తోడ దుర్వ్యసన దుర్వ్యాపారతం జెందు న
య్యధికారాంతమునందు జూడవలదా యా యయ్య సౌభాగ్యముల్!!

అల్పుడి కధికారం వస్తే దేన్నీ సరిగ్గా వినకపోవటం, చూడకపోవటం, లేనిపోనివి వాగటం, గర్వంతో మతి స్థిమితం లేక బూతులు మాట్లాడటం, చెడు అలవాట్లకు బానిసై, చెడు పనులు చేయటం- అనే అవ లక్షణాలతో వుండాడుట! అలాంటివాని విలువెంతో ఆ అధికారం పోయిన తర్వాత చూడాలంటాడు కవి. చూసేదేముంది? గుడ్డిగవ్వకు పనికిరాడు.

ఇలాంటి అల్పుల కింద మహా మేధావులు పనిచేస్తున్నా వారికేమీ యెగ్గు కాదని భాస్కర శతకంలో-

పండితులైన వారు దిగువం దగనుండగ నల్పుడొక్కడు
ద్దండత పీఠమెక్కిన బుధ ప్రకరంబులకేమి యెగ్గగున్?
కొండొక కోతి చెట్టు కొన కొమ్మన నుండగ క్రింద గండ భే
రుండ మదేభ సింహ నికురుంబములుండవె చేరి భాస్కరా!!

అంటాడు మారన వెంకయ్యా కవి. అల్పుని కింద పండితులు కొమ్మ మీది కోతి కింద చేరిన గండ భేరుండాలు, మదపుటేనుగులు, సింహాల్లాంటి వాళ్లు, వాళ్లకేమీ హాని లేదంటాడు.

అల్పులు తమ జాతిలో మహోన్నత స్థితిలో నున్న వారితో తమను పోల్చుకుని గర్వంతో మిడిసిపడిపోతూ వుంటారు. నూకలేరుకుతిని కొవ్వెక్కిన కోడి, భయంకరమైన పాముపడగ మాంసాన్ని తిని సంతోషించే గరుత్మంతుని ముందెంతని ఓ కవి ఓ అల్పుణ్ణి అన్యాపదేశంగా యిలా గర్జించాడు:-



రంతల్ మానుము కుక్కుటాధమ! దరిద్రక్షుద్ర శూద్రాంగణ
ప్రాంతోలూఖల మూలతండుల కణగ్రాసంబుచే క్రొవ్వి దు
ర్దాంతాభీల విశేష భీషణ ఫణాంతర్మాంస సంతోషిత
స్వాతుండైన ఖగేంద్రు కట్టెదుర నీ జంజాటముల్ సాగునే?

ఇలాగే ఏదో చిన్ని పని చేసి, ఎంతో ఘనకార్యం సాధించిన తన జాతి వాడితో తాను సమానమనుకుని సంతోషించే అల్పుడు అరపంటను ఈ పర్వత, సముద్ర, దుర్గాలతో కూడిన భూమి నెత్తిన ఆది వరాహంతో సమానమనుకునే ముట్టెతో నేలను త్రవ్వే పందిలాంటి వాడంటాడు మరో కవి. ఆ పద్యం చూడండి:-

తక్కక నేల ముట్టెగొని త్రవ్వగ నేర్తునటంచుదాకు తా
నొక్కటె జాతియంచు ముదమొందకు బుద్ధిని వెర్రి పంది! నీ
వెక్కడ? ఆది ఘోణి యనవెక్కడ? యద్రి సముద్ర దుర్గ భూ
ర్భా కృతలంబు నొక్క యరపంటనె మింటికి నెత్త నేర్తువే?

అని పంది లాంటి అల్పుణ్ని ప్రశ్నించాడు. దానికి జవాబుండదు కదా!

కొంతమంది అల్పులు అదృష్టం కొద్దీ అందరి దృష్టిని ఆకర్షించే చోట్లకు చేరి కొంత మన్నింపబడినా వారు గొప్ప వారు కాలేరు. వారి విలువ యేమీ పెరగదు. నంది తిమ్మన చెప్పిన యీ పద్యం ఆ విషయాన్నే వెల్లడిస్తూ వుంది.

స్థాన విశేష మాత్రమున తామర సాకున నీటిబొట్టు! నిన్
బూనిక మౌక్తికంబనుచు బోల్చిన మాత్రాన యింత గర్వమా?
మానవతీ శిరోమణుల మాలికలందున గూర్పవత్తువో?
కానుకలియ్యవత్తువా? వికాసము నిత్తువో? విల్వదెత్తువో?

తామరాకు మీద నీటి బొట్టుని ముత్యంతో పోల్చినా అది హారానికి గానీ, కానుకీయటానికి గానీ, కాంతికి గానీ, విలువనివ్వటానికి గానీ పనికిరాదని భావం. ఇలాగే మరోకవి అందలమెక్కిన అల్పుణ్ని శివుడు తలపై ధరించిన ఉమ్మెత్త పూవుతో పోల్చి, అది చంద్రుడితో సాటి రాదంటూ యీ పద్యం చెప్పాడు:-

వారక యీశ్వరుండు తలపై ధరియించిన యంతమాత్ర న
వ్వారిజవైరి తోడ సరివత్తువె యుమ్మెతపూవ! నీ పసన్
వారిధులుబ్బునో దెసలు వన్నెలు దేరునొ చంద్రకాంతముల్
నీరవునో చకోరముల నెవ్వగ దీరునొ తాపమారునో!!

ఉమ్మెత్త పువ్వు దేనికీ పనికిరాదుగానీ శివపూజకి పనికొస్తుంది. ఓ ఉమ్మెత్తా! నిన్ను శివుడు తలపై ధరించినంత మాత్రాన నువ్వు చంద్రుడితో సాటి రాగలవా? నీ వల్ల సముద్రాలు పొంగులెత్తుతాయా? దిక్కులు వెన్నెల కాంతులౌతాయా? చంద్రకాంత శిలలు కరుగుతాయా? చకోరాల బాధ తీరుతుందా? తాపమారుతుందా?-చంద్రునిలా ఆ పనులన్నీ నువ్వు చెయ్యలేవు, నీ వల్ల కాదు, మిడిసిపడకని కవి హెచ్చరిక.

తనను ఏనుగుతో పోల్చుకుని, ఏనుగుకంటె తానే యెక్కువనుకునే దోమ లాంటి అల్పుడు నోరు కొవ్వెక్కి మహానుభావుల్ని యిష్టమొచ్చినట్టు మాట్లాడతాడని ఒక కవిగారీ పద్యం చెప్తున్నాడు:-

పరగగ నాల్గు పాదములు బాగుగ తుండము ఘీంకృతంబు మా
కిరువురకున్ సమంబె మరియెక్కువ యొక్కటి పక్షయుగ్మన్ ఖే
చరుడను నాకు సామ్యమొక సామజమా? యని దోమ పల్కున
ట్లరయ మహానుభావులను నల్పుడు నోరు కొలందులాడెడిన్!!

నాలుక్కాళ్లూ, తొండం, ఘీంకారం మా యిద్దరికీ సమమే పైగా నేను నా రెండు రెక్కలతో ఆకాశంలో తిరగ్గలను. నాతో ఏనుగు సాటి వస్తుందా? అనుకుంటుందట దోమ. ఇంతకంటె మరో చమత్కారం చూడండి.

కొంగ-హంసల సంభాషణమిది.

ఎవ్వడ వీవు కాళ్లు మొగ మెర్రన? హంసను; ఎందునుందువో
దువ్వల మానసంబునను; దాన విశేషములేమి తెల్పుమా?
మవ్వపు కాంచనాబ్జములు మౌక్తికముల్ గలవందు; నత్తలో?
అవ్వి యెరుంగమన్న నహహా! యని నవ్వె బకంబులన్నియున్!!

ఎక్కడో అపురూపంగా మానసరస్సులో విహరించే పరమ హంసలకి తమకు తెలిసిన నత్తల్ని గూర్చి తెలియదని కొంగలన్నీ పగలబడి నవ్వుతూ హేళన చేశాయట! ఇదీ అజ్ఞానానికి, అల్పత్వానికీ పరాకాష్ఠ!

అయం నిజః పరోవేతి గణనా లఘు చేతసాం
ఉదార చరితానాంతు వసుధైవ కుటుంబకమ్!!

అన్నారు ఆదిశంకరులు. అల్పులకే నీది-నాది అనే భేదభావం. ఉదార స్వభావులకి లోకమే కుటుంబం. ఈ అల్పుల్ని ముందుగానే గుర్తించి, మన్నించటం మంచిది; కాళ్లు కడుక్కున్న తర్వాతే ముఖం కడుక్కోవటం పరిపాటి కదా! నేను నా 'విద్యుల్లత' కావ్యంలో-

సముద్రం చిన్ని గడ్డి పరకనైనా చేరనీయదు
అగ్ని తనను వెలిగించిన చేతినైనా కాల్చక విడువదు
సముద్రంలా అల్పుల్ని చేరనీయకు!
అగ్నిలా నిస్వార్థంగా వెలుగు!!

అన్నాను. ఎలావుండాలో ఆలోచించండి!

# "పద్మశ్రీ లల్లూ ప్రసాద్ యాదవ్"



రాష్ట్రీయ జనతాదల్ చీఫ్ లాలూ ప్రసాద్ యాదవ్ గురించి తెలియని వారు ఉండరు. స్వచ్ఛమైన బిహారికి ప్రతిరూపమైన ఈ యాదవ్‌గారిని కమెడియన్‌గా పత్రికలు చిత్రించేసాయి. ఇక హిందీ చిత్రాల సంగతి చెప్పనే అక్కర్లేదు. ఓ టీ.వీ ఛానల్ వారయితే రామ్ ఖిల్వాన్ సి.ఎం. అండ్ ఫ్యామిలీ పేరుతో ఏకంగా ఓ సీరియల్‌నే రూపొందించేసారు. అయితే లాలూగారి పుణ్యమా అని ఆ సీరియల్ ఆగిపోయిందనుకోండి.

ఇక విషయానికొస్తే తాజాగా మహేష్ మంజ్రేకర్ (వాస్తవ్, హతియార్ ఫేం) "పద్మశ్రీ లల్లూ ప్రసాద్ యాదవ్" పేరుతో ఓ చిత్రం నిర్మించతలపెట్టారు.లల్లూ గారికి పద్మశ్రీ బిరుదు ఎప్పుడొచ్చిందా అని ఆశ్చర్యపోయే వారికి మంజ్రేకర్ గారు చెప్పేదేమిటంటే" పేరు ఆయనదే అయినా ఈ చిత్రం ప్రధానంగాపద్మశ్రీ, లల్లూ, ప్రసాద్, యాదవ్ అనే నాలుగు క్యారెక్టర్స్ చుట్టూ తిరుగుతుంది. లల్లూ గా సునీల్‌శెట్టి చేస్తుంటే, పద్మశ్రీగా మాజీ మిస్ ఇండియా దియామిర్జా చేస్తున్నారు. ప్రసాద్ క్యారెక్టర్‌ను ఎంపిక చేయవలసివుంది" అంటున్నారు. పూర్తి వినోదాత్మకంగా రూపొందుతున్న ఈ చిత్రానికి బిహార్ మాజీ ముఖ్యమంత్రిగారి అండదండలు పుష్కలంగా ఉన్నాయి. ఎందుకంటే ఈ చిత్ర దర్శక నిర్మాత మంజ్రేకర్ హెయిర్‌స్టైల్, లాలూ ది ఒకటేనంట. లాలూనే చెప్పారు. అందుకే ఈ చిత్ర ప్రారంభోత్సవాన్ని తన స్వంత గ్రామం "పూల్‌వారే"లో భారీగా చేయటానికి ఏర్పాట్లను లాలూ గారే దగ్గరుండి మరీ చూస్తున్నారంట. కొసమెరుపు ఏమిటంటే ఈ చిత్రంలో యాదవ్‌గా దర్శక నిర్మాత మంజ్రేకర్ చేస్తుండటం.

# మీ ఆగ్నేయాస్త్రానికి







# ఇదే నా వారుణాస్త్రం

**సీతారామ శాస్త్రి గారూ!**

'మది మీటుతున్న మధురానుభూతి మననడిగి చేరుతుందా' (పాట: ఒక్కసారి చెప్పలేవా, సినిమా: నువ్వు నాకు నచ్చావ్) అని రాశారు ఆ మధ్య. ఇటీవల 'ఎప్పుడూ తోటరాముణ్ణి - కోరుకుంటుంది యువరాణి -ఎందుకో నువ్వు ప్రేమనే అడిగి తెలుసుకోవచ్చుగా' (పాట: కోటలోని రాణి పేట పోరగాణ్ణి, సినిమా: ఈశ్వర్) అంటూ రాశారు.

ప్రేమ విషయంలో ఎదుటివారి నోరు మూయించడానికి ఈ రెండూ తిరుగులేని స్టేట్‌మెంట్స్...! తర్కానికి దొరకని ఇలాంటి తిరుగులేని స్టేట్‌మెంట్ల వలన మంచి కన్నా చెడు ఎక్కువ జరిగే ప్రమాదం లేదంటారా? 'ఆంటీ ఐ లవ్ యూ' అంటూ చిన్న చిన్న కుర్రాళ్లు కూడా రెచ్చిపోతున్న ఈ రోజుల్లో - 'నీకూ నాకూ లవ్ ఏంట్రా...తప్పుకాదూ?' అని ఆ ఆంటీ తిట్టిందనుకోండి దానికి వీడు - 'మదిమీటుతున్న మధురానుభూతి మననడిగి చేరుతుందా?' అని అంటే ఆవిడ ఏం చెప్పాలి...?

అలాగే బాగా డబ్బున్న ఇళ్లలోని అమ్మాయిలు కేవలం చదువు మీద, కెరీర్ మీద ఏకాగ్రత చూపించి జీవితంలో పైకొద్దామనుకునే మిడిల్ క్లాస్ అబ్బాయిల్ని డిస్టర్బ్ చేస్తూ 'ఎప్పుడూ తోటరాముణ్ణి కోరుకుంటుంది యువరాణి ఎందుకో నువ్వు ప్రేమనే అడిగి తెలుసుకోవచ్చుగా' అని తనని తాను సమర్ధించుకుందనుకోండి...దానికి ఈ కుర్రాళ్లేం చెప్పాలి?

'యు కెన్ విన్ యాన్ ఆర్గ్యుమెంట్ బట్ యు కాంట్ విన్ ఎ పర్సన్' అని అన్నారు పెద్దలు. మన తెలివితేటలు, మన సంస్కారం ఎదుటివారిని కన్విన్స్ చేయడానికి ఉపయోగపడాలి కాని ఎదుటివారి నోరుమూయించడానికి ఉపయోగపడితే ఎలా? ఈ విషయంలో కన్విన్సింగ్‌గా చెప్పగల మీ సమాధానం ఏమిటి?

మీ సమాధానం కోసం ఎదురుచూస్తూ...

**'హాసం' సంపాదకులకి**

నమస్కారం

తర్కానికి అందని విధంగా మ్యాజిక్ చేశానంటూ మీరు ప్రశ్న వేశారు. మీరు ఉదహరించిన రెండు పాటలూ ఒకదానికొకటి సంబంధం లేనివి.

ఈ ప్రశ్నలకు సమాధానం చెప్పేముందు మీకో విషయం గుర్తు చేయదల్చుకున్నాను.

తర్కం అన్నది అన్నివైపులా పదునున్న కత్తి. మనం ఎందుకు వాడుతున్నాం అనే ప్రశ్న మీద తర్కం యొక్క లక్ష్యం ఛేదించబడుతుంది.

తర్కం గురించి ఈ సందర్భంగా నేనిదివరకు రాసిన ఓ రెండు మాటలను ఉదహరిస్తున్నాను.

**తర్కం ఒక ఆట**
**ఒక కెలిడియో స్కోప్**
**మేధోమథనమే దాని లక్ష్యమైతే!**
**తర్కం ఒక బాట**
**ఒక దూరదర్శిని**
**సత్యాన్వేషణ దాని లక్ష్యమైతే!!**

మొదటి పాట సందర్భాన్ని, ఔన్నత్యాన్ని గమనిస్తే 'మది మీటుతున్న మధురానుభూతి మననడిగి చేరుతుందా?' అన్న వాక్యం ఆ పాత్రలలోని విషాదాన్ని, ఔచిత్యాన్ని ధ్వనింపచేస్తుంది.

రెండో పాటలోని వాక్యం ఏ తర్కానికీ అందనటువంటి ఈ కుర్రకారు ప్రేమల్ని తార్కికంగా తప్పించుకునే ప్రయత్నం.

మొదటి పాటలో తర్కం సత్యాన్వేషణకు ఉపయోగించబడింది.

రెండో పాటలో తర్కం కెలిడియో స్కోప్ ఆటకు వినియోగించబడింది. మీరు రెండింటిని కలిపే ప్రయత్నం చేశారు.

మరో ఉదాహరణ:-

ఓ నాస్తికుడు ఓ భక్తుడితో "మీ కృష్ణుడు పరమ దుర్మార్గుడు, నీచుడు. ఈ మాట నేనన్నది కాదు. మీ మహాభారతంలో ఉంది. కావాలంటే చూపిస్తాను" అని అన్నాడట.

దానికతడు రాజసూయయాగ ఘట్టాన్ని తీసుకుని శిశుపాలుడన్న మాటల్ని ఉదాహరణగా చెప్పాడు.

అది భారతంలోనే వుంది కాబట్టి రాసింది వ్యాసుడే కాబట్టి కృష్ణుడు దుర్మార్గుడనడం ఎంత ధర్మమో...

మొదటి పాటలోని వాక్యాన్ని ఒక కుర్రాడు పక్కింటి ఆంటీతో 'ఇది సీతారామశాస్త్రి అన్నమాటే" అని అనడం కూడా అంతే ధర్మంగా వుంటుంది.

మీ తార్కిక ఆగ్నేయాస్త్రానికి నా తార్కిక వారుణాస్త్రం ఇదే.

భవదీయుడు

**సీతారామశాస్త్రి**

**ముగింపులో ముక్తాయింపు:**

ఇలాంటి ప్రశ్నలకు సమాధానం చెప్పడం నాకెంతో ఇష్టం. కనక మీ నుంచి మాత్రమే కాకుండా, 'హాసం' పాఠకుల వైపునుండి కూడా ఇలాంటి ప్రశ్నలు వస్తే 'హాసం' ద్వారా సమాధానం చెప్పడం నాకు మరీ మరీ ఇష్టం.

అందరికీ భవదీయుడు

**సీతారామశాస్త్రి**






"హలో ఆంటీ... నా పెళ్ళి నిశ్చయం అయింది"
"కంగ్రాట్స్"
"నాక్కాబోయే శ్రీవారు కూడా మీ వారిలాగే వాలీబాల్ ఛాంపియన్"
"అలాగా... అయితే నీకు చాలా చెప్పాలి... వాళ్ళని ఎప్పుడు ఎలా హుషారు చెయ్యాలో, ఎలా కంట్రోల్ చెయ్యాలో... అదో పెద్ద టెక్నిక్ తెలుసా...!?"
"అందుకే కదాంటీ మీకు ఫోన్ చేసింది... ఆ టెక్నిక్‌లు ఏంటో కాస్త నాకు చెప్పరూ!?"
"అది చెప్పేది కాదమ్మా... నీ పెళ్ళికి ప్రెజంటేషన్‌గా ఇస్తాలే"
"సరే ఆంటీ థాంక్యూ"
కొన్ని రోజుల తర్వాత పెళ్ళి జరిగింది.
పెళ్ళికి ఆ ఆంటీ ఇచ్చిన ప్రజెంటేషన్ - విజిల్



ఒక అమ్మాయి నదిలో పడి మునిగిపోతూ "రక్షించండి... రక్షించండి" అంటూ అరిచింది.
"నీ అరుపులు వినబడకపోయినా పైకెత్తిన నీ చేతులు కనిపించాయి కాబట్టి సరిపోయింది. లేకపోతే చచ్చిపోయే దానివి. మొత్తానికి లాస్ట్ మినిట్‌లో భలే అయిడియా వచ్చిందమ్మా నీకు!?" అన్నాడొకాయన ఆమెను ఒడ్డుకు తీసుకువచ్చిన తర్వాత.
"అయిడియానా పాడా చేతులకి పెట్టుకున్న గోరింటాకు పాడైపోతుందని ఎత్తానంతే" అందా అమ్మాయి తన చేతులు చూసుకుని మురిసిపోతూ..



"అయ్యా... గత ముప్పైయేళ్లగా మీ దగ్గర పని చేస్తున్నాను... కనీసం ఒక్కసారైనా నా జీతం పెంచాలని మీరెందుకు అనుకోరు?"
"గత ముప్పై ఏళ్ళుగా మీరు ఉద్యోగంలో ఉండడానికి కారణం అదేనని మీరెందుకు అనుకోరు?"



"ఏవండీ మన అమ్మాయి ఎవరితోనో తిరుగుతోందని, కాలేజీ కాగానే దానికి తెలియకుండా ఫాలో అవమని, చెప్పాను గుర్తులేదా?"
"గుర్తులేకేం... నువ్వు చెప్పినట్లే ఫాలో అయ్యా"
"మరి అమ్మాయి ఏదీ"
"అదే చెప్పబోతున్నా... కాలేజీ కాగానే ఓ అబ్బాయి దాని దగ్గరకొచ్చాడు... వాళ్ళిద్దరూ కలిసి బైక్ మీద వెళ్లారు"
"మీరు ఊరుకున్నారా... ఆటోలోనైనా ఫాలో కావచ్చుకదా?"
"భలే దానివే... ఆ మాత్రం తెలివితేటలు నాకు లేవనుకున్నావా... అలాగే ఫాలో అయ్యా... వాళ్ళిద్దరూ కలిసి ఓ థియేటర్‌లోకి వెళ్లారు"
"మీరు కూడా వెళ్ళాల్సింది... ఎందుకొచ్చేశారు మరి?"
"వెధవది ఆ థియేటర్లో నేను చూసిన సినిమాయే ఆడుతోందే... అందుకనీ..."



ఇద్దరు రాజకీయ నాయకులు ఒకచోట కలుసుకున్నారు
"మీ గురించి చాలా విన్నాను" అన్నాడు మొదటి రాజకీయ నాయకుడు ఎంతో భక్తిభావంతో.
"వినుండచ్చు... కానీ మీరు నిరూపించలేరు" అని అన్నాడు రెండో రాజకీయ నాయకుడు రొటీన్‌గా ఉండే అనుమాన భయంతో..



"మీరింకొక అమ్మాయితో తిరుగుతున్నారని తెలిసింది.. నిజం చెప్పండి లేకపోతే ఉరిపోసుకుని ఛస్తాను"
"ఇదెక్కడి గొడవే బాబూ... నేను రెగ్యులర్‌గా మెయిన్‌టెయిన్ చేసే పంకజాన్నే భరించలేక ఛస్తుంటే... ఇంకొక అమ్మాయా... నీకెవరో అబద్ధం చెప్పారు కాంతం... నువ్వు నమ్మకు"




"ఏవయ్యా ఈ కంపెనీలో నీ సర్వీసెంత?"
"సుమారు ముప్తై ఏళ్లండీ..."
"అరె... చూస్తే పాతికేళ్ల కుర్రాడిలా ఉన్నావు... ముప్తై ఏళ్ల సర్వీసు ఎలా పుటప్ చేశావ్?"
"ఓవర్ టైమ్ చేసి..."





"నువ్వు ఎన్నైనా చెప్పు బాస్... వర్క్ విషయంలో మన సుబ్బారావుకున్న స్పీడు ఎవరికీ లేదు. మనం అనుకున్నదానికి ఎప్పుడూ ఓ కిలో మీటరు అవతలే ఉంటాడు...'
"కరెక్టే... అతను ఆర్టీసీ డ్రైవర్ కదా..."



ఒకావిడకి పెళ్లి అంటే మహా సరదా... భర్తని ఆఫీసుకి వెళ్లనిచ్చి ఊళ్లో ఎవరి పెళ్లయినా సరే తన మూడేళ్ల కొడుకొని వెంటేసుకుని వెళ్లిపోయేది. అలా ఓ వంద పెళ్లిళ్లు చూసేసరికి ఆ కుర్రాడికి డౌటొచ్చేసింది. ఇక ఉండబట్టలేక అడిగేశాడు.

"అమ్మా! నేను పెద్దయ్యేసరికి ఒక పెళ్లి కూతురైనా మిగుల్తుందంటావా...?" అని.

ఓ ఆఫీసులో ప్రమోషన్ కోసం డిపార్ట్‌మెంటల్ ఎగ్జామ్స్ జరుగుతున్నాయి.
ఆఫీసరు : మీరిప్పుడు ఎక్కి వచ్చిన మెట్లెన్ని?
ఉద్యోగి : నేను వస్తుంటే మెట్లు కూలిపోయాయి సార్. అందుకని లెక్కపెట్టడం కుదర్లేదు.
ఆఫీసరు : మరైతే పైకి ఎలా వచ్చేరు..
ఉద్యోగి : రికమండేషన్‌తో సార్!



"మీ మామయ్య అదే పనిగా అద్దం చూసుకుంటూ ఉంటాడేంటి?"

"ఆయనకి మతి మరుపులు ఎక్కువలే... 'ఈ మొహాన్ని ఎక్కడో చూసినట్టుందే' అని అద్దం చూసినప్పుడల్లా ఆలోచిస్తూ ఉండిపోతాడు."





సీత అనే అమ్మాయిని రేప్ చేశాడన్న నేరం మీద ఓ అబ్బాయిని బోనులో నిలబెట్టారు.

కోర్టులో విచారణ జరుగుతోంది...

"సీత అనే అమ్మాయిని నువ్వు రేప్ చేశావా... లేదా?"

"లేదండీ"

"ఆ విషయం ఇంతమంది ముందు గీతని ముట్టుకుని చెప్పగలవా?"

అడిగాడు జడ్జి-క్లర్కు తీసుకొస్తున్న భగవద్గీతను చూపిస్తూ...

"సరేలెండి ఎవరూ చూడకుండా సీతను ముట్టుకున్నందుకే ఇంత గొడవ పెడుతున్నారు. ఇంతమంది ముందు గీతను ముట్టుకుంటే ఇంకేవన్నా ఉందా... నేనంత ఎర్రోణ్ణేం కాదండీ... ఇంకోమాట చెప్పండి"



# వివాదాలకు దూరం కాలేని
# కింగ్ ఆఫ్ పాప్

తన 9 నెలల పసిపాపను హోటల్ కారిడార్‌లో నుండి ఒంటిచేత్తో వేళ్లాడదీయడం ద్వారా మైకేల్ జాక్సన్ మళ్లీ వివాదంలో చిక్కుకున్నాడు.

ఈ సంఘటన నవంబరులో బెర్లిన్‌లో అతను బస చేసిన హోటల్‌లో జరిగింది. అతన్ని చూడడానికి అభిమానులు, పాత్రికేయులు మూగారు. 4వ అంతస్తులో ఉన్న తన రూమ్‌లో నుండి కారిడార్‌లోకి వచ్చి మైకేల్ జాక్సన్ చేతులూపాడు. అంతటితో ఆగలేదు. 9 నెలల వయస్సున్న తన కొడుకు మైకేల్-2 నడుం చుట్టూ ఒక చెయ్యి వేసి (కుర్రాడు గింజుకుంటున్నా) అంత ఎత్తు నుండి అభిమానులకు చూపిస్తూ ఊపాడు. వాళ్ళు ఆనందిస్తూనే హాహాకారాలు చేశారు. ఏమాత్రం చేయిజారినా కుర్రవాడు కిందపడి పచ్చడి కావలసినదే! ఏ కన్న తండ్రీ అలాంటి దుస్సాహసం చేయడు-మతిభ్రష్టుడయితే తప్ప! అందుకే జనాలకు మైకేల్ చిత్తస్వాస్థ్యంపై అనుమానం వచ్చింది.

మైకేల్ ఉన్మాద చేష్టపై పేపర్లలో వ్యతిరేక ప్రచారం జరిగింది. 'డైలీ మిర్రర్' పత్రిక 'మేడ్ బ్యాడ్ డాడ్' అని హెడింగ్ పెట్టి వార్త వేసింది.

అసలతను జర్మనీ వెళ్లినది ఈ చెడ్డపేరు మూటగట్టుకోవడానికి కాదు. బాలల సంక్షేమానికి భారీ విరాళాలు ఇచ్చినందుకు గాను 'లైఫ్ టైమ్ బాంబీ ఎంటర్‌టైన్‌మెంట్ అవార్డు' తీసుకోవడానికి వెళ్లాడు. మైకేల్ తిక్క చేష్టలపై ఆ వర్గాలు వ్యాఖ్యానించడానికి నిరాకరించాయి. "అతని కళను, ఓ దాతృత్వాన్ని సన్మానించడానికే మేము పిలిచాం, తక్కిన విషయాలతో మాకు సంబంధం లేదు" అన్నారు వాళ్ళు. ప్రజల నిరసనల తర్వాత మైకేల్ తనలా చేయడం పొరబాటని అంటూ క్షమాపణ కోరాడు. అన్నిటికంటె ఆశ్చర్యమేమంటే, ఆ పసివాడి తల్లి ఫలానా అని ఇప్పటివరకు మైకేల్ ప్రకటించలేదు!



వివాదాలలో చిక్కుకోవడం మైకేల్‌కి ఇది మొదటిదీ కాదు, ఆఖరిదీ కాదు. అతను చేసిన ప్రతి పని వార్తలలోకి ఎక్కడానికి కారణం-అతనో సెలబ్రిటీ కావడమే!

- గత మూడు దశాబ్దాలుగా ఏ ఇతర ఆర్టిస్టు కన్నా అత్యధికంగా రికార్డులు అమ్ముడుపోయినవి మైకేల్‌వే!
- 36 టాప్, 10 హిట్స్, వాటిల్లో నెంబర్ వన్‌లు 13!
- 12 గ్రామీ అవార్డులు
- అతని 'థ్రిల్లర్' ప్రపంచవ్యాప్తంగా 5 కోట్ల కాపీలు అమ్ముడుపోయి గిన్నిస్‌బుక్‌లోకి ఎక్కింది.

1958లో అమెరికాలోని ఇండియనా రాష్ట్రంలో జన్మించాడు మైకేల్. వాళ్లది చాలా పెద్ద కుటుంబం, అక్కాచెల్లెళ్లు, అన్నదమ్ములు కలిసి మొత్తం 8 మంది. మైకేల్, తన సోదరులు మార్లాన్, టిటో, జెర్మైన్, జాకీలతో కలిసి జాక్సన్-5 అనే పేర ఒక గ్రూపుగా ఏర్పడి 11వ యేటి నుండి పాటలు పాడసాగాడు. నెం.1 సింగిల్స్ 4 వరుసగా రావటంతో మైకేల్ అతని సోదరులు 1970వ దశకంలో పాపులర్ చార్ట్‌లలో ప్రముఖ స్థానాన్ని ఆక్రమించారు. స్వయంప్రతిభ వల్ల అతని ఇమేజి మరీ పెరిగిపోవడంతో గ్రూపులో నుండి విడిగా వచ్చేసి 'సోలో కెరియర్' ప్రారంభించాడు.



- అతని మొదటి సోలో 'బెన్'కు థీమ్ 'బెన్' అనే సినిమాలో ఎలుక.
- మోటెన్ రజతోత్సవ సభలో మైకేల్ 'బిల్లీజీన్' డాన్సు చేశాడు. 'మూన్‌వాక్ డాన్స్' ప్రారంభం దానితోనే!
- 'థ్రిల్లర్' సూపర్ సక్సెస్ తర్వాత చెప్పుకోదగినది 1985లో వెలువడిన 'వి ఆర్ ది వరల్డ్'. దీనిలో 40 మంది స్టార్ ఆర్టిస్టులు అతిథి పాత్రల్లో కనబడ్డారు.
- 'కెప్టెన్ EO' జార్జి లూకాస్, ఫ్రాన్సిస్ కపోలా ఆధ్వర్యంలో తయారయి ఫ్రాన్సులో యూరో-డిస్నీలో ప్రత్యేక ఆకర్షణ అయింది.
- "బ్యాడ్" 17 నిముషాల సినిమా. 'థ్రిల్లర్' తర్వాత అంతపేరూ తెచ్చి పెట్టింది. మైకేల్‌కి 'కింగ్ ఆఫ్ పాప్' బిరుదు తెచ్చి పెట్టింది.
- 1991లో విడుదలయిన 'బ్లాక్ ఆర్ వైట్' హ్రస్వ చిత్రం మార్ఫింగ్ అనే విజువల్ ఎఫెక్టును అత్యంత ప్రతిభావంతంగా ఉపయోగించి ప్రపంచ మానవులంతా ఒక్కటే అన్న సందేశాన్ని రూపచిత్రణ ద్వారా చాటింది.
- 2001లో విడుదలయిన 'ఇన్విన్సిబుల్'లో క్రిస్‌టక్కర్ వంటి హాస్యనటులు అతిథులుగా నటించారు.

**ఇన్ని ఘనతలొకవైపు-వివాదాలు మరొకవైపు**
**ఈ రెండింటి కలగలపే మైకేల్ జాక్సన్!**


చదువులావు
సత్యమూర్తి
తలకి ఆ కట్టేమిట్రా?
ఇది జ్ఞాపక శక్తి....
...పెరగడానికి మందు రాసి
రోజూ
...కట్టుకుంటూను
నీకు జ్ఞాపకశక్తి పెరిగిందా?
పెరిగినట్లే ఉంది. ఎప్పుడూ
జ్ఞాపకం వస్తూంటుంది ఏదో
మరిచి
పోయానని

# రాజా ఆడియో రివ్యూ




విడుదల : సుప్రీమ్
వెల : రూ 38/-

ప్రముఖ నిర్మాత అశ్వనీదత్ సమర్పణలో మరో ప్రముఖ నిర్మాత అల్లు అరవింద్ సిరి మీడియా ఆర్ట్ పతాకంపై నిర్మించిన 'పెళ్ళాం ఊరెళితే'చిత్రం ఆడియో విడుదలయింది. శ్రీకాంత్, వేణు హీరోలుగా నటించిన ఈ చిత్రానికి దర్శకుడు యస్వీకృష్ణారెడ్డి...అది ఫస్ట్ క్రేజీ పాయింట్ కాగా మణిశర్మ సంగీత దర్శకుడవటం ఆడియోకి జతపడిన మరో క్రేజీ పాయింట్.

ఉదిత్ నారాయణ్, కల్పన పాడిన 'ఓ మల్లె పువ్వురా జాబిల్లి నవ్వురా' పాట వినడానికి ఏ ఇబ్బందినీ కలిగించకుండా హాయిగా సాగిపోయే పాట. సుద్దాల అశోక్‌తేజ రాసిన ఈ పాటలోని 'పచ్చెన్న ముద్దరా సాగనం' అనే వాక్యంలో 'పచ్చెన్న'ని పచ్చి ఎన్న (వెన్న)గా అర్థం చేసుకోవాలి. పాటమధ్యలో మధ్యమావతి రాగ ఛాయలు కనిపించడానికి కారణం కృష్ణారెడ్డికి ఆ రాగం పట్ల మక్కువ ఎక్కువ కనుక మణిశర్మ ఆ రాగాన్ని స్పృశించాడనుకోవచ్చు.

గోపికా పూర్ణిమ ఆలపించిన ఆలాపనలను కలుపుకుంటూ బాలూ పాడిన 'మిల మెరిసే మగువా నువు మేనక చెల్లెలివా' పాట మెలొడియస్‌గా ఉంది. కోడక్, క్లోజప్, సన్‌సిల్క్, నెస్కేఫ్, ఏషియన్, టైటాన్, బాటా, స్కూటీ వంటి కన్స్యూమర్ ప్రోడక్ట్స్‌తో పాటని స్కీమ్ చేయటం సరదాగా ఉంది. ఈరకం స్కీమింగ్ తెలుగు పాటకి కొత్త కాకపోయినా కొత్తందాలు మాత్రం దిద్దుకుంది. పాడింది బాలు కనుక మాట మరింత స్పష్టంగా వినబడి పాటలోని స్కీమ్‌ని ఎంజాయ్ చేయనిచ్చింది.

చక్రి (సంగీతదర్శకుడు), మల్లికార్జున్, గోపికా పూర్ణిమ, ప్రీతి కలిసి పాడిన 'ఝూం బరాబర్ ఝూంషరాబీ' పాట భువనచంద్ర మార్కు ఛమక్కులతో యూత్ స్పెషల్‌గా రూపొందింది. ఈ 'ఝూంబరాబర్ ఝూంషరాబీ', అనే లైను, ఆటైపు ట్యూన్ మనవారికి 20 ఏళ్ళ క్రితమే 'ఫైవ్ రైఫిల్స్' అనే హిందీ చిత్రం ద్వారా పరిచయం అయింది.

కార్తిక్, ఉష పాడిన 'ఉళక్కిపాపా ఉళక్కిపాపా కసెక్కి ఉన్నదిరా' పాట మంచి ఊపున్న పాట. ఎరక్కపోయి ఇరుక్కుపోతే/ముద్దాటలో ముప్పాటలా/ ఒణుకుడు శిల్పం/దోబూచిలో లాలూచిగా/ కిస్‌ముందరా కిష్కింధరా-మిస్ మంధరా యస్ అందిరా లాంటి ప్రమోగాలు వేటూరి పాటకారితనాన్ని ప్రత్యేకంగా పట్టి చూపిస్తాయి.

హరిహరన్, కల్పన పాడిన 'దొండపండులాంటి పెదవే నీది... అబద్ధం.. అంతా అబద్ధం' పాట హిట్‌సాంగ్ ఆఫ్ ది ఆడియో! ఏవేవి అబద్ధాలు, ఏవేవి నిజాలు అనే స్కీమ్‌తో సాగే ప్రణయ గీతమిది. 'ఆది' సినిమాల్లోని 'నీ నవ్వుల తెల్లదనాన్ని' పాటలో ఉన్న స్కీమ్ లాంటిదే ఈ స్కీమ్‌కూడా! చంద్రబోస్ కిలాటి స్కీమ్‌లు కొట్టినపిండి. సాధారణంగా నిజాలకన్నా అబద్ధాలు బావుంటాయి. కానీ ఈ పాటలో నిజాలే (చమత్కారపరంగా) బావున్నాయి. కాకపోతే 'నన్ను మెప్పించాలన్న తాపత్రయం గొప్పవాస్తవం' అనే వాక్యాన్ని బలవంతంగా ట్యూన్‌లో కూర్చోబెట్టినట్టు ఉంది.

**రచన: సిరివెన్నెల** **1** **గానం : శంకర్ మహదేవన్**

కోరస్ : గోవింద్ బోలోహరి గోపాలు బోలో ॥2॥
రాధారమణ్ హరి గోపాలు బోలో ॥2॥ ॥గోవింద॥
అ: హరేరామ హరేరామ రామరామ హరేహరే
హరేకృష్ణ హరేకృష్ణ కృష్ణ కృష్ణ హరే హరే
రాముణ్ణైనా కృష్ణుణ్ణైనా కీర్తిస్తూ కూర్చుంటామా
వాళ్లేం సాధించారో కొంచెం గుర్తిద్దాం మిత్రమా
సంద్రం కూడా స్తంభించేలా మన సత్తా చూపిద్దామా
సంగ్రామంలో గీతాపాఠం తెలుపమా కో: ॥గోవింద॥ ॥హరే॥
చ: చార్‌మినార్ చాటుకథకీ తెలియదీ నిత్యకలహం
భాగ్‌మతీ ప్రేమ స్మృతికీ బహుమతీభాగ్యనగరం
ఏం మాయతంత్రం మతమై నాటి చెలిమిని చెరిపెర
ఓం శాంతిమంత్రం మనమై జాతి విలువని నిలుపర
పద.. పద... పద మరి
హరేరామ హరేకృష్ణ జపిస్తూ కూర్చుంటామా
కృష్ణ రామ చెప్పిందేంటో గుర్తిద్దాం మిత్రమా కో: ॥గోవింద॥
చ: పసిడి పతకాల హారం కాదురా విజయతీరం
ఆటనే మాటకర్థం నిను నువే గెలుచు యుద్ధం
శ్రీరామనవమి జరిపే ముందు లంకను గెలవర
నీ విజయదశమి రావాలంటె చెడును జయించర
పద... పద... పద మరి ॥హరేరామ॥ కో: ॥గోవింద॥

**రచన: సిరివెన్నెల** **2** **గానం : శ్రీయా ఘోషల్**

ప: నువ్వేం మాయ చేశావోగాని ఓ మనసా చెప్పమ్మా నిజాన్ని
క్షణం ఆగనంటోంది ఓణీ మరీ చిలిపిదీ వయసు బాణీ
హయ్యా హయ్యారె హయ్యారె హయ్యా చిందులేస్తున్న ఈ అల్లరి
ఓ...సయ్యా సయ్యారె సయ్యారె సయ్యా
ఎటుపోతుందో ఏమో మరి ॥నువ్వేం॥
చ: ఔరా పంచకళ్యాణి పైనా వస్తాడంట యువరాజు ఔనా
నువ్వేమైన చూసావా మైనా తెస్తున్నాడా ముత్యాల మేన
హయ్య హయ్యరె హయ్యరె హయ్య మొగలి పూవంటి మొగుడెవ్వరె
ఓ..సయ్య సయ్యరె సయ్యరె సయ్యా మేళ తాళాల మనువెప్పుడె॥ఔరా॥

**రచన: సిరివెన్నెల** **6** **గానం : హరిహరన్, శ్రీయాఘోషల్, ప్రియా సిస్టర్స్**

కో : ముత్తైదులంతా ముదమారా ఈ బాలకీ మంగళస్నానాలు చేయించరే
శ్రీరామరక్ష అని క్షీరాబ్ధి కన్యకీ ముమ్మారు దిష్టితీసి దీవించరే
ఆ : మనసుపడే మగవాస్తాడని మేనంతా మెరిసింది
మెరిసిపడే మదిలో సందడి మేళాలై మోగింది
అ: నీకూనాకూ ముందే రాసుంది జోడీ...
హరిలో రంగాహరి వహవా అంటూ చూస్తోందీ పందిరీ
బరిలో హోరాహోరీ బహుబాగుంది బాజా బాజంత్రీ
అత్తారింటికి నిన్ను ఎత్తుకుపోతానుగా వచ్చానే హంసా వైభోగంగా
ఆ : కన్యాధనమిస్తా కళ్యాణం సాక్షిగా దొరలా దోచుకుపో యమదర్జాగా॥
అ : గెలిచానే నీ హృదయం కలకాలం యీ విజయం నీతో పంచుకోనా
ప్రియురాలా నా ప్రాణం నీ పాపిట సింధూరంగా నిలపనా
ఆ : కలలన్నీ ఈ నిమిషం నిజమయ్యే సంతోషం నాలో దాచగలనా
దరిచేరే నీ కోసం చిరునవ్వుల నీరాజనం ఇవ్వనా...
ముస్తాబు చేయరటే ఈ ముద్దుల గుమ్మకీ
సిగ్గుపడే చెంగుకీ సిరిచుక్క దిద్దరే
పట్టుచీర కట్టరటే ఈ పుత్తడి బొమ్మకీ
తడబడు కాళ్లకీ పారాణి దిద్దరే
వగలన్నీ నిగనిగలాడవా నన్నల్లే కౌగిళ్లో
నగలన్నీ వెలవెలబోవా చేరందే నీ ఒళ్లో
ఆ: నాకే సొంతం కానీ నీ సొమ్ములన్నీ ॥హరిలో రంగా॥
అ : ఒట్టేసి చెపుతున్నా కడదాకా నడిపించే తోడై నేనున్నా
ఏడడుగుల పయనానా ఏడేడు లోకాలైనా దాటనా
ఆ : వధువై ఎదురొస్తున్నా వరమాలై ఎదపైనా వాలే ముహూర్తానా
వరసయ్యే వలపంతా చదివిస్తా వరకట్నంగా సరేనా...
కో: ముక్కోటి దేవతలూ మక్కువగా కలిపారే
ఎన్నెన్ని జన్మలదో ఈ కొంగుముడీ
ముత్యాల జల్లులుగా అక్షింతలు వెయ్యాలే ముచ్చట తీరేలా అంతా రండీ
ఆ : ఏనాడూ, ఎవరూ చూడని ఏకాంతం వెతకాలీ
ఏ కన్నూ ఎపుడూ చూడని లోకంలో బతకాలీ
పగలూ రేయిఈ లేని జగమేలుకోనీ ॥హరిలో రంగా॥



**రచన: సుద్దాల అశోక్‌తేజ** **1** **గానం: ఉదిత్‌నారాయణ్, కల్పన**

అ: ఓ మల్లె పువ్వురా-జాబిల్లి నవ్వురా
పచ్చెన్న ముద్దరా సొగసు
అది ఇచ్చింది తీయని మనసు
సంపెంగ మొగ్గరా-సంక్రాంతి ముగ్గురా
అందంగ వుందిరా చిలక-తన అందంలో ముంచెర జనక
దూరంగ చూస్తే రంగేళి.. దగ్గరికెళితే రంగోలి
పక్కన వుంటే ఎండైనా పున్నమి వెన్నెల ఐపోతుంది- ॥ఓ మల్లె॥
అ: భూమిచూస్తె మరి ఆడదేగా
అది-తిరుగుతుంది సూరీడు చుట్టుగా
మూతిమీద-నాకు మీసముంది
నే-తిరిగాను నీ చుట్టు మోజుగా
ఆ : ఆడవాళ్ల-చిరుమొటిమ కూడ మీ-మగాళ్ల గుండెలో చిచ్చులే
ఎంతవాళ్లు మీరైన గానీ అరె-మా చూపు పడితే దాసులే...
అ : తొలిసారి చూసి-మరునాడు నవ్వి
పిచ్చోణ్ణి చేస్తవే- ఆ...డా...ళ్ళు..
ఈ పిచ్చికుదిరి పెళ్లయేటట్టు
దీవించు దోస్తు నను నూ...రే...ళ్ళు.. ॥ఓ మల్లె॥
అ : ఘాటుముద్దు-చిరుగాలితోని- నే-పంపినాను-నీ చెంపకిపుడు-
బుట్టలోన-నిను కూచోబెట్టి- మరి-ఎత్తుకెళ్తే రోజా ఎపుడు-
ఆ : చూపులోని అరె గాటు పెట్టి- నీ కళ్లల్లో వుందయ్యో బాకు-
చేయితోని నిను తాకకుండ- కలిగిస్తావు ఒళ్లంత తీపు..
అ : తను రెచ్చిపోయి మరి గిచ్చెననుకో
ఇక గుండె ఢోలకు ఢుం...ఢుం...ఢుం..
చనువెక్కువయ్యి ఒక కౌగలింత
నాకిస్తె బతుకు ఇక ఘుం-ఘుం-ఘుం ॥సంపెంగ॥

**రచన: చిర్రావూరి విజయకుమార్** **2** **గానం: బాలు, గోపికా పూర్ణిమ**

అ: మిల మిల మెరిసే మగువా నీవు మేనక చెల్లెలివా
నిగ నిగలాడే భామ నునులేత పసిడి బొమ్మా
గడసరి పలుకుల గువ్వా నువు మదనుడి మరదలివా
గువ గువలాడెను ఊటీ నినుచూసి అయ్యోరామ
కళ్లీ చూసెనంటి కోడక్ పల్లి చూసెనంటి క్లోజప్

సిరిగలసీత గురిగల రాధ ఎవరంటే ఏం చెబుతావు
అ : గుడుగుడు గుంజం గుండెలరాగం ముదిరిన పాకంలో
తికమకరాము మకతిక సోము ఎదురైతే ఏం చేస్తావు
ఆ : కిస్‌ముందరా కిష్కింధరా ఈసుందరాకాండలో
అ : మిస్‌మంధరా యస్ అందిరా ఆ బందరూ బండిలో
ఆ : నీ సొత్తునీ సొంతానికే దాచా... లే ॥ఒక్క॥

**రచన: చంద్రబోస్** **5** **గానం:హరిహరన్, కల్పన**

అ : దొండపండు లాంటి పెదవే నీది ఆ: అబద్ధం... అంతా అబద్ధం
అ : దూదిపింజలాంటి పదమే నీది ఆ: అబద్ధం... అంతా అబద్ధం
అ : పాల మీగడంటి నుదురే నీది ఆ: అబద్ధం
అ : పూల తీగలాంటి నడుమే నీది ఆ : అబద్ధం
అ : నీపైన నా ప్రేమ అబద్ధమనకు అనకు అనకు ॥దొండపండు॥
అ : రత్నాలు చిందేటి నవ్వేమొ నీది ఆ : అబద్ధం
అ : నిన్ను నవ్వులో ముంచెత్తు బాధ్యత నాది ఆ : ఇది నిజం
అ : ముత్యాలు రాలేటి మాటేమొ నీది ఆ : అబద్ధం
అ : నీ మాటకు ఊకొట్టు ఉద్యోగం నాది ఆ : ఇది నిజం
అ : నేల మీద వున్న దేవత నీవు ఆ : అబద్ధం
అ : నిన్ను నమ్ముకున్న దాసుణ్ణి నేను ఆ : ఇది నిజం
ఆ : నువు పొగిడే ప్రతిమాట తీపి అబద్ధం
నన్ను మెప్పించాలని తాపత్రయం గొప్ప వాస్తవం॥దొండపండు॥
అ : పాల సరసు లాంటి పైటేమో నీది ఆ : అబద్ధం
అ : నీపైట మాటునున్న మనసేమో నాది ఆ : ఇది నిజం
అ : గోరింట పువ్వంటి చెయ్యేమొ నీది ఆ : అహా... మళ్లీఅబద్ధం
అ : నీ చేతిలోన వున్న బ్రతుకేమో నాది ఆ : ఇదినిజం
అ : నీలాలు కొలువున్న కళ్లేమొ నీవి ఆ : అబద్ధం
అ : నువ్వు కన్నెర్ర జేస్తేనే కన్నీరు నేను ఆ : ఇది నిజం
ఆ : నీపైన అనుమానం క్షణకాలం
మన యిద్దరి మధ్యన అనుబంధం కలకాలం
అ : దొండపండు లాంటి పెదవే నీది ఆ : న...న...న...
అ : దూదిపింజలాంటి పదమే నీది పాల మీగడలాంటి నుదురేనీది
పూల తీగలాంటి నడుమే నీది
నీపైన నా ప్రేమ అబద్ధమనకు అనకు అనకు

ఎవరు తనని పిలిచారనీ అడిగిచూడు నీ మనసునీ... హే
కాలాన్నే కదలనీయనీ కనికట్టేం జరగలేదనీ
ఈ తీయని మాయ తనదనీ తెలుసా అనీ
మనసూ నీదే... మహిమా నీదే...
పిలుపూ నీదే... బదులూ నీదే ॥నువ్వేం॥
ఆ : మూగ మనసిదీ ఎంత గడుసుదీ
నంగనాచి సంగతులెన్నో వాగుతున్నదీ
ఓహో... ఇంతకాలమూ కంటి పాపలా
కొలువున్న కల నువ్వే అంటున్నది
అ : హోయ్‌రె హోయ్‌రె హోయ్ అందనీ రేయిచాటు రాగం వినీ
ఎందుకులికి పడుతుందనీ అడిగిచూడు నీ మనసునీ
హే.. నిదురించే నీలికళ్లలో కల ఎప్పుడు మేలుకున్నదో
ఆ కల ఏం వెతుకుతున్నదో తెలుసా అనీ
కనులూ నీవే... కలలు నీవే... పిలుపూ నీదే... బదులూ నీదే ॥నువ్వేం॥
ఆ : పిచ్చి మనసిదీ ఎంత పిరికిదీ నచ్చుతానో లేదో నీకు అడగమన్నది
ఓహో...ఆశ ఆగకా... అడుగు సాగకా కలలాగ ఎగిరెగిరి పడుతున్నదీ
అ : హోయ్‌రె హోయ్‌రె హోయ్-అందనీ రేయి చాటు రాగం వినీ
గాలిపరుగు ఎటు వైపనీ అడిగిచూడు నీ మనసునీ
హే... ఏ దారిన సాగుతున్నదో-ఏ మజిలీ చేరుకున్నదో
ఏ తీరం కోరుతున్నదో తెలుసా అనీ
పదమూ నీదే.. పరుగూ నీదే... పిలుపూ నీదే... బదులూ నీదే.. ॥నువ్వేం॥

**రచన: సిరివెన్నెల (5) గానం : మల్లికార్జున్**

ప: సాహసం శ్వాసగా సాగిపో సోదరా
సాగరం ఈదటం తేలికేం కాదురా
చ: ఏ కోవెలో చేరాలని కలగన్న పూబాలకీ
సుడిగాలిలో సావాసమై దొరికింది ఈ పల్లకీ
ఈ ఒక్కడు నీ సైన్యమై తోడుంటె చాలు ॥సాహసం॥
చ: కాలానికే తెలియాలిగా ముందున్న మలుపేమిటో
పోరాటమే తేల్చాలిగా రానున్న గెలుపేమిటో
ఈ ఒక్కడు నీ సైన్యమై తోడుంటె చాలు ॥సాహసం॥



చ: కలా నువ్వు ఏ చాటునున్నా అలా ఎంత కవ్వించుతున్నా
ఇలా నిన్ను వెంటాడి రానా ఎలాగైన నిను కలుసుకోనా
హయ్యా హయ్యరె హయ్యరె హయ్యా ఆశపడుతున్న ఈ నా మది
ఓ...సయ్యా సయ్యరె సయ్యరె సయ్యా అది తీరేది ఎపుడన్నది ॥నువ్వే॥

**రచన: సిరివెన్నెల (3) గానం: ఉదిత్ నారాయణ్, సుజాత**

అ : చెప్పవే.. చిరుగాలి.. చల్లగా ఎద గిల్లీ ॥2॥
ఎక్కడే వసంతాలకేళీ.. చూపవే నీతో తీసికెళ్లి॥2॥ ॥చెప్పవే॥
అ : ఆశా దీపికలై మెరిసే తారకలు
చూసే తీపి కలై విరిసే కోరికలు
మనతో జతై సాగుతుంటే..
అడుగే అలై పొంగుతుంది
ఆ : చుట్టూ ఇంకా రేయున్నా అంతా కాంతే చూస్తున్నా
అ : ఎక్కడ ఎక్కడ ఎక్కడ వేకువ అంటూ
రెక్కలు విప్పుకు ఎగిరే కళ్లు
దిక్కులు తెంచుకు దూసుకుపోతూ ఉంటే ఆపగలవ చీకట్లు
ఆ : కురిసే సుగంధాల హోలీ చూపదా వసంతాల కేళీ
కో: కురిసే సుగంధాల హోలీ చూపదా వసంతాల కేళీ ॥చెప్పవే॥
ఆ : యమునా తీరాల కథ వినిపించేలా
రాధా మాధవుల జత కనిపించేలా
పాడనీ వెన్నెల్లో ఈ వేళా చెవిలో సన్నాయి రాగంలా
అ : కలలే నిజమై అందేలా ఊగే ఊహల ఉయ్యాల
ఆ : లాహిరి లాహిరి లాహిరి తారంగాల
రాతిరి యేటిని ఈదే వేళ
జాజిరి జాజిరి జాజిరి జానపదంలా పొద్దే పలకరించాలి
ఆ: ఊపిరే ఉల్లాసంగా తుళ్లి చూపదా వసంతాల కేళీ
కో: ఊపిరే ఉల్లాసంగా తుళ్లి చూపదా వసంతాల కేళీ ॥చెప్పవే॥

**రచన: సిరివెన్నెల (4) గానం: కార్తిక్, చిత్ర**

ఆ : నువ్వేం మాయ చేశావొ గానీ ఓ మనసా చెప్పమ్మా నిజాన్నీ
నువ్వేం మాయ చేశావొ గానీ ఇలా ఈ క్షణం ఆగిపోనీ
అ : హోయ్‌రె హోయ్‌రె హోయ్ అందనీ రేయిచాటు రాగం వినీ



ఇ : కాంపాక్టు డిస్కల్లే తిరిగేస్తూ వుంటాది
తెలిసుంటే చెప్పండి ఎడ్రస్... ॥ఝూం॥
అ1 : లిప్సంటే కావండి లిప్సు... లిప్సూ...
అ2 : లేటెస్టు కంప్యూటర్ చిప్సూ... చిప్సూ...
అ1 : హిప్సంటే కావండి హిప్సూ... హిప్సూ...
అ2 : లార్జెస్టు టైటానిక్ షిప్సూ... షిప్సూ...
ఇ : ఆచూకీ చెప్పేస్తే... అడ్రస్సు పట్టేసి
తినిపిస్తాం దీ బెస్టు పప్సూ ॥ఝూం॥
అ: ఐతే లెఫ్టుకెళ్లు బాబూ... బాబూ... అక్కడుంటాదో డాబా... డాబా...
ఆడ అడిగినావంటే... హాజీ.... దొరుకుతాది నీ చేప.... హుర్రే...
ఇ : మా డ్రస్సు మార్చేసి ఎడ్రస్సు పడతాము.
ఆపైన చేస్తాము కిస్‌మిస్... ॥ఝూం॥
ఆ1 : ఇటు చూడు ఒకసారి అక్కా... అక్కా...
ఆ2 : ఈచోటే ఉన్నాదో చుక్క... చుక్క...
ఆ1 : చూపిస్తే చాలంట చెల్లీ... చెల్లీ....
2 : రాసిస్తానే కొత్త ఢిల్లీ... ఢిల్లీ...
అ: చూపిస్తా రావమ్మ మీసాల నాగమ్మ
మర్యాదలే అందుకోమ్మా... గుమ్మా... ॥ఝూం॥

**రచన: వేటూరి 4 గానం: కార్తీక్, ఉష**

అ : ఉళక్కి పాపా ఉళక్కి పాపా కసెక్కి వున్నదిరా
ఆ : అట్టా ఉలిక్కి పడితే చిలక్కి చెబితే తస్సదియ్యా
అ : ఎరక్కుపోయి ఇరుక్కుపోతే చిటుక్కుమంటదిరా
ఆ : పట్టే మగాడి దమ్మే దిగాలు పడితే లగెత్తిరా...రా
అ : సరుకెంత దాచినా దొరకంది దోచెనా
ఆ : ముద్దాటలో ముప్పూటలా ముంచాలే.... ॥ఉళక్కి॥
అ : చిటపటతాళం చినుకుల మేళం చలిచలికాలంలో
తొణికిన రూపం వణుకుడు శిల్పం నావంటే ఏమంటావు
ఆ : మెరిసిన మేఘం తడిసిన దాహం కలిసిన మోహంలో
కడిగిన అందం అడిగిన బంధం నీకిస్తే ఏం చేస్తావు
అ : నులివెచ్చగా నిను గిచ్చగా పనికొచ్చే నీ ప్రాయం
ఆ : యమపిచ్చగా మనసిచ్చగా వయసొచ్చే వయ్యారం
అ : దోబూచిలో లాలూచిగా దోచా... ॥ఉళక్కి॥
ఆ : ఎవరికి ఎవరం ఒకరికి ఒకరం మరిగిన మైకంలో



ఖిలై గంతులేస్తూ రావా నీ కోసం
కురులే చూసేనంటే సన్‌సిల్క్ నవ్వే చూసేనంటే నెస్కేఫ్
తుళ్లి చెంతవాలి పోవా నీకోసం... నీకోసం
అ: మెరుపులన్ని మెలివేసి ఆ: ఆ... ఆ...
అ: తారలన్ని కలబోసి ఆ: ఆ... ఆ...
అ: పున్నమంత మరిగించి పుణ్యమంత కరిగించి
నవనవలాడేలా నవ బ్రహ్మలు చేరి తన్మయమై నిన్ను చేసారే కోరి
పలుకే వినినా తేనే చినబోవు సొగసే కనినా తూర్పుకు మతిపోవు
కలరే చూసేనంటే ఏషియన్ లస్టే చూసానంటే టైటాన్
నీకై లక్షలుంచిపోవా వాకిట్లో ॥మిలమిల॥
అ: కాలి అందె కదిపిందా ఆ: ఆ... ఆ...
కాకి కోకిలై పోదా ఆ: ఆ... ఆ...
పైటగాలి వీచిందా ఆ: ఆ... ఆ...
పాలవాన పడిపోదా ఆ: ఆ... ఆ...
రుసరుస చూసిందా ఋతువులు మారేను
గుస గుసలాడిందా ఋషులే మారేను
కదిలే నడువే చూస్తే హరివిల్లు బిడియం పడతూ నీకే ప్రణమిల్లు
నడకే చూసెనంటే బాటా పరుగే చూసేనంటే స్కూటీ
సంతోషించి ఇచ్చుకోవా ఎంతైనా ॥మిల మిల॥

**రచన: భువనచంద్ర (3) గానం : చక్రి, మల్లికార్జున్, గోపికా పూర్ణిమ, ప్రీతి**

ప: ఝూంబరాబర్ ఝూంషరాజీ ఝూంబరాబర్ ఝూం
ఝూంబరాబర్ ఝూంషరాజీ ఝూంబరాబర్ ఝూం
అ1: సొగసైన మిస్సండి బాబూ... బాబూ...
అ2: ఎడ్రస్సు చెప్పండి బాబూ... బాబూ...
అ1: ఎర్రంగా వుంటాది పిల్ల... పిల్ల...
అ2: ఏ పేటో తెలియదు మల్ల... మల్ల...
ఇ : ఊరంతా తిరిగాము-వెతికి వేసారాము
హెల్ప్షైనా చేకుంటే ఎల్లా... ॥ఝూం॥
అ2: వాలు వాలు కళ్ల పోరీ... పోరీ...
అ1: వ్యాయామం చేస్తాదినారీ... నారీ..
అ2: బ్యూటీలో ఆ పిల్ల వీనస్... వీనస్...
అ1: స్టైలిస్తే అదె మనకి బోనస్... బోనస్

సుమంత్ ఆర్ట్ ప్రొడక్షన్స్

# ఒక్కడు

యం.యస్.రాజు గుణశేఖర్

మణిశర్మ



గుణశేఖర్



మణిశర్మ



సిరివెన్నెల సీతారామశాస్త్రి



ఎమ్మెస్ రాజు

పాఠక పుస్తక ప్రియులకోసం సినీ సంగీత విశ్లేషకుడు
'రాజా'
పర్యవేక్షణలో 'హాసం' అందిస్తున్న ప్రత్యేక కానుక ఇది.

## తారాగణం

మహేష్ బాబు, భూమిక, ప్రకాష్‌రాజ్, రాజీవ్.పి.దేవ్, చంద్రమోహన్, సంగీత, అచ్యుత్, సురేష్‌రెడ్డి, పరుచూరి వెంకటేశ్వరరావు, గుండు హనుమంతరావు, ఎమ్.ఎస్. నారాయణ, గీత, ధర్మవరపు సుబ్రహ్మణ్యం.

## సాంకేతిక నిపుణులు

| | |
|---|---|
| మాటలు | : పరుచూరి బ్రదర్స్ |
| పాటలు | : సీతారామశాస్త్రి |
| సంగీతం | : మణిశర్మ |
| ఆర్ట్ | : అశోక్ కుమార్ |
| కెమెరా | : శేఖర్ వి జోసెఫ్ |
| ఎడిటింగ్ | : శ్రీకర్ ప్రసాద్ |
| స్టిల్స్ | : దాస్ |
| మేకప్ | : రాజా |
| ఫైట్స్ | : విజయన్ |
| కాస్ట్యూమ్స్ | : కుమార్ |
| డాన్స్ | : రాజుసుందరం, లారెన్స్ |
| ఎగ్జిక్యూటివ్ ప్రొడ్యూసర్ | : బి. భాస్కరరాజు |
| ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్ | : ఎ. కిరణ్ కుమార్ |
| కో-డైరెక్టర్ | : చంద్రశేఖరరెడ్డి, హేమాంబర్ జాస్తి |
| కో-డైరెక్టర్ | : చంద్రశేఖర్‌రెడ్డి |
| అసిస్టెంట్ డైరెక్టర్ | : మీరా |
| అసిస్టెంట్ డైరెక్టర్ | : సందీప్, రమేష్‌రెడ్డి |
| నిర్మాత | : ఎమ్.ఎస్.రాజు |
| కథ-స్క్రీన్‌ప్లే-దర్శకత్వం | : గుణశేఖర్ |



సి. అశ్వనీదత్ సమర్పించు
సిరి మీడియా ఆర్ట్స్

# పెళ్ళాం ఊరెళితే..

అల్లుఅరవింద్ . ఎస్.వి. కృష్ణారెడ్డి . మణిశర్మ



వేటూరి



భువనచంద్ర



చంద్రబోస్



సుద్దాల అశోక్ తేజ



విజయ్‌కుమార్



మణిశర్మ



ఎస్.వి.కృష్ణారెడ్డి



అల్లు అరవింద్



అశ్వనీదత్

పాఠక పుస్తక ప్రియులకోసం సినీ సంగీత విశ్లేషకుడు
'రాజా'
పర్యవేక్షణలో 'హాసం' అందిస్తున్న ప్రత్యేక కానుక ఇది.

## తారాగణం

శ్రీకాంత్, వేణు, దీప్తి సంగీత, రక్షిత, బ్రహ్మానందం, ఎమ్మెస్ నారాయణ, తనికెళ్ల భరణి, ఎల్.బి.శ్రీరాం, గిరిబాబు, రేణు, సుమన్ శెట్టి, సునీల్, జ్యోతి, గుండుహనుమంతరావు.

## సాంకేతిక నిపుణులు

| | |
|---|---|
| కథ | : సత్యానంద్ |
| మాటలు | : చింతపల్లి రమణ |
| పాటలు | : వేటూరి, భువనచంద్ర, చంద్రబోస్, అశోక్‌తేజ, విజయకుమార్ |
| సంగీతం | : మణిశర్మ |
| ఎడిటింగ్ | : మార్తాండ్ వెంకటేష్ |
| డైరెక్టర్ ఆఫ్ ఫొటోగ్రఫీ | : సి. రాంగోపాల్ |
| ఆర్ట్ | : చిన్నా |
| నృత్యాలు | : ప్రసన్న, బృంద, ప్రదీప్ |
| ఎగ్జిక్యూటివ్ ప్రొడ్యూసర్ | : ఎడిద రాజా |
| నిర్మాత | : అల్లు అరవింద్ |
| సమర్పణ | : సి. అశ్వనీదత్ |
| స్క్రీన్‌ప్లే, దర్శకత్వం | : ఎస్.వి. కృష్ణారెడ్డి |

# అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాం

## "ఎక్ లడ్‌కీ కో దేఖా"

| | | |
|---|---|---|
| చిత్రం | : | 1942 ఎ లవ్‌స్టోరీ (1994) |
| రచన | : | జావెద్ అఖ్తర్ |
| సంగీతం | : | ఆర్.డి.బర్మన్ |
| గానం | : | కుమార్‌సాను |
| అభినయం | : | అనిల్‌కపూర్, మనీషాకోయిరాలా |

ఓ...ఎక్‌లడ్‌కీ కో దేఖా తో ఐసాలగా
జైసే ఖిల్‌తా గులాబ్, జైసే షాయర్ కా ఖాబ్
జైసే ఉజ్‌లీ కిరన్, జైసే బన్ మేఁ హిరన్
జైసే చాంద్‌నీ రాత్, జైసే నర్మీకీ బాత్
జైసే మందిర్ మేఁ హోఎక్ జల్‌తా దియా
ఓ...ఎక్‌లడ్‌కీ కో దేఖా తో ఐసాలగా

ఓ...ఎక్‌లడ్‌కీ కో దేఖా తో ఐసా లగా
జైసే సుబహ్ కా రూప్, జైసే సర్దీకీ ధూప్
జైసే బీనా కీ తాన్, జైసే రంగోఁకీ జాన్
జైసే బల్‌ఖాయె బేల్, జైసే లహరోఁ కా ఖేల్
జైసే ఖుష్‌బూ లియే ఆయే ఠండీ హవా
ఓ...ఎక్‌లడ్‌కీ కో దేఖాతో ఐసాలగా

ఓ...ఎక్‌లడ్‌కీ కో దేఖా తో ఐసా లగా
జైసే నాచ్‌తా మోర్, జైసే రేషమ్ కీ డోర్
జైసే పరియోఁ కారాగ్, జైసే సందల్‌కీ ఆగ్
జైసే సోలహ్ సింగార్, జైసే రస్ కీ ఫుహార్
జైసే ఆహిస్తా ఆహిస్తా బఢ్‌తా నషా
ఓ...ఎక్ లడ్‌కీ కో దేఖా తో ఐసా లగా



ఆర్.డి. బర్మన్ సంగీతం అన్ని వర్గాల శ్రోతల్ని నాడూ రంజింపజేసింది, నేడూ రంజింపజేస్తోంది. ఈనాటి ఫాస్ట్ జనరేషన్‌ని కూడా ఆయన పాటల రీమిక్స్ వెర్షన్లు విపరీతంగా ఆకట్టుకుంటున్నాయంటే ఆయన సంగీతం తరాల అంతరాలను అధిగమించినట్టే కదా! ఇటీవల 14 ఆర్.డి.పాటలను తీసుకుని వాటి చుట్టూ కథ అల్లి రూపొందించిన 'దిల్ విల్ ప్యార్ వ్యార్' చిత్రం విడుదలయింది. ఇందులో 'తేరేబినా జిందగీ సే (ఆంధీ), 'ఓ హంసినీ'(జహరీలా ఇన్సాన్'), 'గుమ్ హై కిసీకే ప్యార్ మేఁ(రామ్‌పూర్ కా లక్ష్మణ్), 'ఓ హసీనా జుల్ఫోఁవాలీ'(తీస్రీ మంజిల్), 'యే జో మొహబ్బత్ హై' (కటీ పతంగ్), 'తుమ్ బిన్ జావూఁ కహాఁ(ప్యార్ కా మౌసమ్) మొదలైన పాటలున్నాయి. బబ్లూ చక్రవర్తి పర్యవేక్షణలో నేటి గాయనీ గాయకుల చేత ఈ పాటలు పాడించి విడుదల చేసిన ఆడియో అమ్మకాలలో అగ్రస్థానంలో ఉంది. ఆర్.డి. గొప్పతనానికి ఇంతకన్నా నిదర్శనం ఏం కావాలి?

ఆర్.డి.కి పంచమ్ అనే ముద్దు పేరుంది. చిన్నప్పుడు అతను పంచమ స్వరంలో ఏడ్చేవాడని ఆ పేరు పెట్టారు. చిత్ర పరిశ్రమలో కూడా అతన్ని పంచమ్ దా అని పిలుస్తారు. మెహమూద్ తీసిన 'ఛోటే నవాబ్'(1961)లో ఆర్.డి.కి. పూర్తిస్థాయి సంగీతదర్శకుడిగా తొలి అవకాశం వచ్చింది. ఆర్.డి. రెండవ చిత్రమైన 'భూత్ బంగ్లా' కూడా మెహమూద్ నిర్మించినదే. ఇందులో ఒకదానికొకటి పూర్తిగా భిన్నమైన 'జాగో సోనేవాలోఁ', 'ఆవో ట్విస్ట్ కరేఁ' పాటలు రూపొందించి ఆర్.డి. తన ప్రతిభను చాటుకున్నాడు. మెహమూద్, ఆర్.డి.ల అనుబంధం 'పడోసన్' చిత్రంతో ఉన్నత

శిఖరాలనందుకుంది. నాసిర్ హుసేన్, గుల్జార్‌ల చిత్రాలకు ఆర్.డి. రెగ్యులర్‌గా సంగీతం అందించేవారు. పాశ్చాత్యరీతిలో అయినా, శాస్త్రీయ పద్ధతిలో అయినా చక్కని గీతాలను స్వర పరచటంలో దిట్ట అనిపించు కున్నారు. ఆయన చిత్రాలలో ఒక



పాట సూపర్‌హిట్ కావటం వల్ల ఆ పాట మరుగున పడిన ఇతర పాటలు, సినిమా హిట్ కాకపోవడం వల్ల వెలుగులోకి రానివి ఎన్నో ఆణిముత్యాలవంటి పాటలున్నాయి.

ఎనభయ్యవ దశకంలో మారిన అభిరుచులు, పరిస్థితులతో రాజీపడలేక ఆర్.డి. చాలా తక్కువ చిత్రాలకు పనిచేశారు. దానితో క్రమంగా అవకాశాలు తగ్గాయి. '1942 -ఎ లవ్‌స్టోరీ' చిత్రంలో ఆయన గత ప్రాభవాన్ని తిరిగి



సాధించారు. కానీ ఆ చిత్రానికి తానందించిన సంగీతం సాధించిన విజయాన్ని ఆస్వాదించకుండానే ఆయన మరణించారు. 1995లో సంగీత విభాగంలో ఇచ్చిన ఫిలింఫేర్ అవార్డులన్నీ ఈ చిత్రానికే దక్కాయి. ఉత్తమ సంగీతదర్శకుడిగా ఆర్.డి.బర్మన్, 'ప్యార్‌హువా చుప్‌కేసే' పాటకు ఉత్తమగాయనిగా కవితాకృష్ణమూర్తి, 'ఏక్‌లడ్‌కీ కో దేఖా' పాటకు ఉత్తమ గీతరచయితగా జావెద్ అఖ్తర్, ఉత్తమ గాయకుడిగా కుమార్‌సాను ఈ అవార్డులు అందుకున్నారు. కుమార్‌సాను ఈ అవార్డుతో వరుసగా అయిదవ ఫిలింఫేర్ అవార్డు అందుకుని రికార్డు స్థాపించారు.



'ఏక్ లడ్‌కీ కో దేఖా' పాట రూపకల్పన వెనుక ఒక కథ ఉంది. ఈ పాట సిట్యుయేషన్ ప్రకారం స్వాతంత్ర్యోద్యమ సమయంలో ఉద్యమకారులు బ్రిటిష్ సైనికులపై రాళ్లు రువ్విన ఒక సంఘటనలో పగిలిన బస్సు కిటికీ అద్దంలోంచి భయం భయంగా చూస్తున్న కథానాయికను చూసి చూడగానే కథానాయకుడు మనసు పారేసు కుంటాడు.



ఆ ఉద్రిక్త వాతావరణంలో అమాయకత్వం, సౌందర్యం నిండిన ఆమె ముఖం అతనిలో సున్నితమైన భావాలను రేకెత్తిస్తుంది. ఆ భావాలు అతన్ని రాత్రీ పగలూ వెంటాడుతుంటాయి. ఈ సిట్యుయేషన్‌కి ఎలాంటి పాట రాయాలో ఎంత ఆలోచించినా జావెద్ అఖ్తర్‌కి తట్టలేదు. రికార్డింగ్ దగ్గర పడుతోంది. అనుకున్న ప్రకారం జరగకపోతే నిర్మాత -దర్శకుడు విధు వినోద్ చోప్రా ఊరుకోడు. చివరికి చోప్రాని కలవటానికి ఆర్.డి., జావెద్ కార్లో వెళుతుండగా ఆర్.డి. కంగారు పెట్టడంతో జావెద్ 'ఒక అమ్మాయిని చూస్తే ఇలా అనిపించింది, అలా అనిపించింది' అని ఉప



మానాలతో రెండు లైన్లు చెప్పాడు. అది నచ్చిన ఆర్.డి. ఆ లైన్లకు ట్యూన్ కట్టి ఉపమానాల స్కీమ్‌తోనే మొత్తం పాట రాయమని ప్రోత్సహించాడు. అలా వారు చోప్రాని కలిసేసరికి పాట తయారయిపోయింది. వినగానే చోప్రా కూడా ఓకే చేసేశారు. ఈ పాట పల్లవి, చరణాలనే పరిధులకు లోబడకుండా ఒక ప్రవాహంలా సాగిపోతుంది.

'లడ్‌కీ' అంటే అమ్మాయి. 'ఖిల్‌తా గులాబ్' అంటే విరిసే గులాబి. 'షాయర్' అంటే కవి. 'ఖాబ్' అంటే కల. 'ఉజ్‌లీ' అంటే ఉజ్వలమైనది. 'బన్' అంటే వనం. 'హిరన్' అంటే జింక, హరిణం. 'చాంద్‌నీ రాత్' అంటే వెన్నెల రేయి. 'నర్మీకీ బాత్' అంటే మెత్తని మాట., చల్లనిమాట అనే అర్థంలో వాడతారు. 'మందిర్' అంటే 'మందిరం', గుడి. 'దియా' అంటే దీపం, దివ్వె.

**'ఒక చినదాన్ని చూస్తేను తోచిందిలా**
**విరిసే గులాబిలా, కవికన్న కలలా**
**ఉజ్వల కిరణంలా, వనాన హరిణంలా**
**వెన్నెల రేయిలా, చల్లని మాటలా**
**గుడిలో వెలిగే ఓ దివ్వెలా'**

ఆమె విరిసే గులాబిలా సుకుమారంగా ఉందట., కవులు వర్ణించే స్వప్నసుందరిలా ఉందట. ఆమెది మెరిసిపోయే అందమట. మొదటిసారి చూసినపుడు బెదిరిన జింకలా అనిపించిందతనికి. గుడిలో వెలిగే దీపంలా పవిత్రంగా ఉందిట.

'సుబహ్ కా రూప్' అంటే ఉదయం యొక్క రూపం. తెల్లవారేటప్పటి వెలుగు అనే అర్థం చెప్పుకోవచ్చు. 'సర్దీ' అంటే చలి. 'ధూప్' అంటే ఎండ. 'బీనా' అంటే వీణ. 'తాన్' అంటే నాదం. 'రంగోఁ కీ జాన్' అంటే రంగు అనే గుణానికి ఆధారమైనది అని చెప్పుకోవచ్చు. 'బల్‌ఖానా' అంటే ఊగటం. 'బేల్ అంటే లత. 'లహర్' అంటే అల. 'ఖేల్' అంటే ఆట. 'ఖుష్‌బూ' అంటే పరిమళం. 'ఠండీ హవా' అంటే 'చల్లనిగాలి'.

'ఒక చినదాన్ని చూస్తేను తోచిందిలా
తెల్లవారి వెలుగులా, చలిఎండలా
వీణా నాదంలా, రంగుల్లోని హంగులా
ఊగేలతలా, అలల సయ్యాటలా
పరిమళం తెచ్చే చల్లని తెమ్మెరలా'

'ప్రేమనగర్' చిత్రంలో ఆత్రేయ రాసిన 'తేట తేట తెలుగులా, తెల్లవారి వెలుగులా' పాటలో కూడా ఇలాంటి ఉపమానాలతోనే నాయికను వర్ణించారు. ఈ చరణంలో మనసుకు ఆహ్లాదం కలిగించే వాటితో ఆమెను పోల్చారు.

'నాచ్‌తా మోర్' అంటే నాట్యం చేసే నెమలి. 'రేషమ్' అంటే పట్టు. 'డోర్' అంటే తీగ. 'పరియాఁ' అంటే దేవతలు. 'సందల్' అంటే చందనం. 'ఆగ్' అంటే అగ్ని. 'సోలహ్' అంటే పదహారు. 'సింగార్' అంటే అలంకరణ, సింగారం. 'పదహారు రకాల అలంకరణలు' అనే ప్రయోగం హిందీలో వినిపిస్తూ ఉంటుంది. 'ఫుహార్' అంటే ధార, జల్లు. 'ఆహిస్తా' అంటే నెమ్మదిగా. 'నషా' అంటే మైకం.

'ఒక చినదాన్ని చూస్తేను తోచిందిలా
ఆడే నెమలిలా, పట్టు తీగలా
దేవరాగంలా, చందనాగ్నిలా
సింగారంలా, రసధారలా
మెలమెల్లగా కమ్మే మైకంలా'

ఆమె అందం, సౌకుమార్యం, లాలిత్యం, పవిత్రత అతన్ని ప్రేమ మైకంలో పడేశాయి. చిత్రీకరణలో అతను ఉత్సాహంగా తన భావాలను తెలుపుతుంటే ఆమె అమాయకత్వాన్ని, చిలిపితనాన్ని ఇంట్లో ఆమె చేసే పనుల ద్వారా చక్కగా చూపించారు చోప్రా. ఈ చిత్రంలో ఇంకా 'ప్యార్ హువా చుప్‌కే సే', 'రిమ్ ఝిమ్ రిమ్ ఝిమ్', 'కుఛ్ నా కహో', 'రూఠ్ నజానా' వంటి సూపర్‌హిట్ పాటలున్నాయి.

**-పి.వి.సత్యనారాయణ రాజు**




# రాజా ఆడియో రివ్యూ

విడుదల : సుప్రీమ్
వెల : రూ. 38/-

మహేష్‌బాబు, భూమిక హీరో హీరోయిన్‌లుగా విలక్షణ దర్శకుడు గుణశేఖర్ దర్శకత్వంలో అభిరుచి గల నిర్మాతగా పేరుగాంచిన ఎమ్మెస్ రాజు నిర్మించిన సుమంత్ ఆర్ట్ ప్రొడక్షన్స్ 'ఒక్కడు' సినిమా ఆడియో విడుదలయింది. ఈ చిత్రానికి మణిశర్మ సంగీత దర్శకుడు. సిరివెన్నెల సీతారామశాస్త్రి సింగిల్‌కార్డు రైటరు.

శంకర్‌మహదేవన్, కోరస్ పాడిన 'రాముణ్ణైనా, కృష్ణుణ్ణైనా కీరిస్తూ కూర్చుంటామా/వాళ్ళేం సాధించారో కొంచెం గుర్తిద్దాం మిత్రమా' అనే పాటని వింటున్నకొద్దీ పాటకు మణిశర్మ కూర్చిన అందాలు బైటపడుతూ వుంటాయి. మెలోడీకి బీట్‌ని జత చెయ్యటం అంటే ఇలావుండాలి అనే లెవల్లో ఆర్కెస్ట్రయిజేషన్‌ను జతచేశాడు మణిశర్మ. 'గోవింద్ బోలో హరి గోపాలు బోలో' అంటూ మొదట్నించీ చివరి వరకూ కలుస్తూ వచ్చే కోరస్ కంఠాలలో (కూడా) కొంత ఉత్తరాది వాసన తొంగి చూస్తున్నా అది కూడా విడదీయలేనంత ఆకర్షణీయంగా హాంట్ చేస్తూనే వుంటుంది. (అసలు 'గోవింద్ బోలో హరి గోపాలు బోలో హరి' అనే వాక్యాలే మనకు ఉత్తరాది నుండి దిగుమతి అయినవేగా)! వ్యక్తిత్వ వికాసానికి సంబంధించిన సందేశాన్ని అంతర్లీనంగా పాటలలో పొందుపరిచే సీతారామశాస్త్రి ఈ పాటలో కూడా ఆ సంప్రదాయాన్ని అందంగా కొనసాగించారు.

'నువ్వేం మాయ చేశావొ గానీ... ఓ మనసా చెప్పమ్మా నిజాన్ని' పాట ఓ స్వీట్ మెలోడీ. షారుఖ్‌ఖాన్ 'దేవదాస్' ద్వారా ఎంతో మందికి తెలిసిన గాయని శ్రేయాగోషల్ ఈ పాటను ఎంతో హాయిగా పాడింది. కాకపోతే 'నిజాన్ని' అనే మాటలో 'జ'బదులు 'స'ఎక్కువగా ధ్వనించకుండా జాగ్రత్తపడి వుండాల్సింది. ఈ శ్రేయాగోషల్ వాయిస్‌లో మత్తు వుంది. అది కొన్నాళ్ళపాటు తెలుగు పాటని అలరించే అవకాశం వుంది.

ఉదిత్‌నారాయణ్, సుజాత పాడిన 'చెప్పవే చిరుగాలీ చల్లగా ఎదగిల్లి' పాటని హిట్‌సాంగ్ ఆఫ్‌ది ఆడియోగా చెప్పుకోవాలి. పాత పాటల మాధుర్యాన్ని ఆసాంతం నింపుకున్నపాట యిది. 'లగాన్' చిత్రం కోసం ఏ.ఆర్.రెహమాన్ స్వరపరచగా ఉదిత్‌నారాయణ్, ఆశాభోంస్లే పాడిన 'రాధ కైసేన జలే' పాట లాంటి పాటను స్వరపరచి తీరాలన్న తపన ఈ పాటలో ఆద్యంతం కనబడుతుంది. ఒకవేళ అదే గనక నిజమైతే ఈ పాట రూపకల్పనలో పాల్గొన్న వారందర్నీ అభినందించితీరాలి. టీమ్ స్పిరిట్ అంటే అదీ! ఇన్‌స్పిరేషన్ తీసుకోవడం అంటే అదీ..! 'ఇలాంటిది మనకీ ఉంది' అని గర్వంగా చెప్పుకునేట్టు ఉండాలి. అంతేగాని - 'ఏంచేస్తాం... అడాప్ట్ చెయ్యక తప్పలేదు' అని తప్పించుకునే స్టేట్‌మెంట్ లిచ్చుకోవలసిన పరిస్థితిలో ఉండకూడదు. నేటి తెలుగు సినీ సంగీతం పరువుని ఈ విధంగా నిలబెట్టిన మణిశర్మ, గుణశేఖర్ లభించబోయే ప్రశంసల పర్వంలో అగ్రతాంబూలానికి అన్ని విధాలా అర్హులు. (వర్క్ రాబట్టుకోవటం విషయంలో గుణశేఖర్ ఎంత ఇన్‌స్పైయిర్ చేస్తారో ఆయనతో పరిచయం వున్నవాళ్ళకి మాత్రమే తెలుసు). మొదటి చరణంలోని 'ఆశా దీపికలై మెరిసే తారకలు - చూసే తీపి కలై విరిసే కోరికలు'అనే వాక్యాలతో 'దీపికలై - తీపికలై' అంటూ శాస్త్రిగారు విరిచిన విరుపులు బావున్నాయి.

'ఏ' సైడు శ్రేయాగోషల్ పాడిన నువ్వేం మాయ చేశావోగాని' పాట ట్యూన్‌కి రెండో వెర్షన్ చెయ్యడం అనే ప్రయోగం ఎంతబాగుందో ఆ రెండో పాట కూడా అంతే బావుంది. కార్తీక్, చిత్ర పాడిన ఈ వెర్షన్‌లో 'మనసునీదే- మహిమా నీదే-పిలుపు నీదే -బదులునీదే' అనే వాక్యాలు వచ్చిన దగ్గర ఉపయోగించిన రిథమ్ భలే హుషారుగావుంది.ఈ రిథమ్‌ని బాగా ఎస్టాబ్లిష్ చేసే పాటనొకటి భవిష్యత్తులో మణిశర్మ చేస్తే అది 'మణిశర్మ మార్క్ రిథమ్' గా శ్రోతల హృదయాలలో నిలిచిపోతుంది. ఇక 'మనసు నీదే - మహిమ నీదే' లైన్లదగ్గర జతపడ్డ ట్యూన్‌ని అలా ఆలాపించుకుంటూపోతే అది 'దాయి దాయి దామ్మా'(ఇంద్ర) పాటకి జాయినయిపోతుంది. కావాలంటే పాడుకొని చూడండొకసారి.

అతి తక్కువ పదాలతో ఒక ఫుల్‌లెంగ్త్ సాంగ్‌కి కావల్సిన ఎఫెక్ట్‌ని సీతారామశాస్త్రి ఇచ్చిన పాటగా 'సాహసం శ్వాసగా సాగిపో సోదరా' పాటని చెప్పుకోవాలి. ఈ పాటని యువగాయకుడు మల్లికార్జున్ పాడారు. కనులు తెరిచినా కనులు మూసినా కలలు ఆగవేల (ఆనందం), నీ నవ్వుల తెల్లదనాన్ని నాగమల్లి అప్పుడిగింది (ఆది), పాటలద్వారా శ్రోతల గుండెల్లో మంచి స్థానాన్ని సంపాదించుకున్న మల్లికార్జున్‌కి ఇంచు మించు బాలు స్థాయికి చేరుకోగల ఒరిజినాలిటి ఉందేమోనని అనిపిస్తూవుంటుంది. అటువంటి ప్రతిభ గల మల్లిఖార్జున్ తెలుగు వాడై కూడా 'శ్వాసగా' అని పలకడానికి బదులు 'స్వాసగా' అని అంటుంటే, అతన్ని అభిమానించేవారి మనసు చివుక్కుమంటుంది.

'అత్తారింటికి నిన్నెత్తుకు పోతానుగా వచ్చానే హంసా వైభోగంగా'అనే పాటని హరిహరన్, శ్రేయాగోషల్, ప్రియాసిస్టర్స్ పాడేరు. కొన్ని కొన్ని ట్యూన్‌లలో సంగీతదర్శకుడు స్వరపరుస్తున్నప్పుడు ఊహించుకునే జిలుగులు, పట్లు ఉంటాయి. గాయనీ గాయకులలో కొంతమంది మాత్రమే ఆ 'స్వరహృదయాన్ని' గ్రహించి పాడగలుగుతారు. మరికొంతమంది ఆ స్వరహృదయంలోని జిలుగులకు మరిన్ని మెరుగులు దిద్దే వారుంటారు. హరిహరన్ ఆ రెండు రకాలకూ చెందిన గాయకుడు. ఈ పాటను రెండు మూడుసార్లు వింటే హరిహరన్ చేతనే మణిశర్మ ఎందుకు పాడించాడో అవగాహన అవుతుంది. మరో రెండు మూడుసార్లు వింటే 'ఇంద్ర' సినిమాలో 'ఘల్లు ఘల్లుమని సిరిమువ్వల్లె చినుకే చేరగా' పాట రాగంలో మరోపాట స్వరపరచాలన్న ఇంట్రస్ట్‌తో ఈ పాటని మణిశర్మ ట్యూన్ చేశాడేమోనని అనిపిస్తుంది. మెలోడీని మిస్ కాకుండా ఉన్న అన్ని పాటల్ని మణిశర్మ ట్యూన్ చేసిన సినిమాగా 'ఒక్కడు' సినిమా ఆడియోకి పేరొస్తుంది.

## కొంటెకొశ్చెన్లు-తుంటరి జవాబులు



వి. మంజురాణి - హైదరాబాద్

❖ రామరావణ యుద్ధంలో లక్ష్మణుడు మూర్ఛపోతే హనుమంతుడికి సుషేణుడు సంజీవిని పర్వతాన్నే ఎందుకు తెమ్మన్నాడు?

✦ లక్ష్మణుడు సూర్యవంశానికి చెందిన వాడు కదా. అందుకే 'సన్‌జీవనీ' పర్వతాన్ని సజెస్ట్ చేసి వుంటాడు.

నవీన్, ముషీరాబాద్

❖ పాదుసరికి, పీనాసికి తేడాఏంటి?

✦ ట్రాఫిక్ సిగ్నల్స్‌లో రెడ్ లైట్ పడగానే వెహికిల్ ఆపేసి గ్రీన్ పడడానికి ఒక్క సెకెండ్ ముందు కాలిక్యులేటెడ్‌గా స్టార్ట్ చేయగలవాడు పాదుపరి. గ్రీన్ లైట్ వెలిగాక అప్పుడు స్టార్ట్ చేస్తూ, వెనక లైన్ కట్టిన వాళ్ల చేత తిట్టించుకునేవాడు పీ-నాసిరకం

## డబుల్‌రోల్



ఆ 'రగడ' చూస్తుంటే కనీసం ఏదో ఒకటి 'విరగడం' కాయం అనిపిస్తోంది.

- బి.విశ్వసౌజన్య, హైదరాబాద్

'రమ' నాకు దూ'రమ'య్యేలా వుంది

చాగంటి వరహాలరావు, చందానగర్

'మావా' ఈ రోజు అమావా'స్య కదూ!

- చైతుప్రకాష్, రుద్రారం.



## చిలిపి లిపి




Worry Fruit = చింతపండు

Cat Buds = పిల్లిమొగ్గలు

-బి.శ్రీనివాసాచారి, హైదరాబాద్

0ము= సున్నము

- దాసరి చంద్రయ్య, దామా నెల్లూరు.

## ఈ రూటే వేరు



ఉపవాసం = చిన్నిల్లు

- డి.బల్తజార్, రామచంద్రాపురం.

నిష్పత్తి = ఉపయోగం లేని పత్తి

- బి.శ్రీరామ్, రుద్రారం.

జడపదార్ధం = చుండ్రు

- రఫీకృష్ణ, రాజాం.

# చిలిపి కవిత

## "సరిగమపదని"లతో 'సరిగ పదమని'



సాని దానినీ మరిగామా
మన పని సరి
మరీ మరీ మరిగామా
మన మనీ సరి
మన పస సరి
మన గరిమ సరిగదా!
పద పద

- తెలికిచర్ల రామకృష్ణ,
విజయనగరం

# పేరు -రిపేరు




బాబా-పంచతంత్రం-నీతో చెప్పాలని వుంది-డాడీ!

నాగ ! శివరామరాజు-ఖడ్గం-నీకోసం

- దేవులపల్లి రామమూర్తి, విజయవాడ

తొట్టిగ్యాంగ్-సందడేసందడి

-పి.గిరి

# పేరడీ పేరేడ్



పల్లవి : అయ్యయ్యో ముక్కుకు పడిశం పట్టెనే
అయ్యయ్యో చీదుట కష్టం ఆయెనే ॥అయ్యయ్యో॥
ముక్కుకు ఏదో మూడింది-సర్వం చీదర అయింది
లాకులు తెగిన జలాశయంలా-మహాప్రవాహం అయ్యింది
॥అయ్యయ్యో॥

1.చ : ఆ... హాఛీ హాఛీ అని మహా జోరుగ నీకు
తుమ్ములేల భాయీ-వరస తుమ్ములేల భాయీ
మరి నువు ఆపి చూడు భాయీ
అది నా చేత కాదు భాయీ
తెలివి తక్కువగా మంచు రాతిరిలో సంచరిస్తి వోయీ
బాబూ అనుభవించవోయీ ॥అయ్యయ్యో॥

2.చ: పసుపు నీటితో ఆవిరి పట్టిన ఫలితం లేదేమి
అయ్యో చీదుట పోదేమి
చక్కగ ఊపిరి రాదేమి
యాక్టిఫెడ్లతో అవిల్ వేసినా పడిశం పోదేమి
ముక్కుకు ఊరట రాదేమి ॥అయ్యయ్యో॥

3.చ: హెచ్చుట తగ్గుట దైవాధీనం మిరియాలు మింగవచ్చు
మళ్ళీ వేడి పుట్టవచ్చు
ముక్కుకు సర్జరీ పడొచ్చు
చిట్టచివరగా ఊపిరాడక శ్వాస ఆగవచ్చు
పోతే... పైకి వెళ్ళవచ్చు...
చివరకు పబ్లిసిటీ వచ్చూ... ॥అయ్యయ్యో॥

-బద్ది నాగేశ్వరరావు,
అనకాపల్లి.

సీరియల్ 23

**- మల్లాది వెంకట కృష్ణమూర్తి**



## జరిగిన కథ




అనన్య బామ్మ గారికి, గ్రామం అనే ఆయనకు ఆవిడ ఇల్లు గురించి కుదిరిన ఒప్పందం ప్రకారం బామ్మ బతికున్నంతకాలం ప్రతీనెలా గ్రామం డబ్బుఇవ్వాలి. బామ్మపోయాక ఇల్లు అతని స్వంతం అవుతుంది. కాలక్రమేణా గ్రామం, అతని కొడుకులు పోతారు కానీ బామ్మ ఆరోగ్యంగా ఉంటుంది. బామ్మ చస్తే ఇల్లు తన స్వంతమవుతుందని గ్రామం మనుమలలో ఒకడైన లింగమయ్య రియల్ ఎస్టేట్ వ్యాపారం చేసే సుబ్బారావు హరకేశం అనే కిరాయి హంతకుడిద్వారా బామ్మను చంపడానికి ప్లాను వేస్తారు. హరకేశం ఓ పామును తీసుకొని రాత్రివేళ వెళుతుంటే దారిలో అతన్ని దొంగలు కట్టుబట్టలతో సహా దోచుకుంటారు. పోలీసులు పట్టుకుపోవడంతో అతని ప్రయత్నం విఫలమవుతుంది. అనన్య కొలీగ్ నిరుపమ్‌కి ఇన్నాళ్లూ ఫోటోలు పంపుతూన్నది బామ్మే అని తెలుస్తుంది.

(ఇక చదవండి)

లంచ్ అవర్‌లో బామ్మ చెప్పింది మరోసారి ఆలోచించింది. నిరుపమ్ కట్నం లేకుండా చేసుకుంటాడా తనని?

అనన్య అతని టేబుల్ దగ్గరికి వెళ్ళి అడిగింది.

"ఇందాక మీరు చెప్పింది ఆలోచిస్తూంటే, నాకొకటి అన్పించింది. మీరింకా బేచ్యులర్ కదా. పెళ్ళికి కొద్దో గొప్పో కట్నం వస్తుంది. అదీ కలిపి ఇన్‌వెస్ట్ చేస్తే ఇన్‌కం ఇంకాస్త ఎక్కువ అవచ్చుకదా?"

"అవునవును"

"కట్నంగా ఎంత తీసుకుందామను కుంటున్నారు?" ప్రశ్నించింది.

"ఎప్పుడూ ఆ విషయం ఆలోచించలేదు. నాకెంత ఇవ్వచ్చు?"

"అది సంబంధాన్ని బట్టి వుంటుంది"..

"సుమారుగా మీలాంటి సంబంధం అనుకుని ప్పండి", కేల్‌క్యులేటర్‌ని సొరుగులోంచి తీసి డీగా పట్టుకుని మళ్ళీ లెక్కకట్టడానికి స్నిమయ్యాడు నిరుపమ్.

'నాలాంటి సంబంధం అయితే జీరో కట్నం. ఇశ్ందుకు నాకు పెద్దగా ఆస్తిపాస్తులు లేవండి"

అదేమిటి? జోక్ చేస్తున్నారా? మీకు పెద్ద బంగ్లా వుదని నాకు తెలీదా? మీ బామ్మ తదనంతరం మీఽక్కరే దానికి వారసులు అని అంతా చెప్పుకుంటున్నారు కదా"

"అవుననుకోండి. కానీ కేష్‌గా కట్నం ఇవ్వడనికి నా దగ్గర ఆస్తిపాస్తులు లేవని నా ఉద్దేశ'

పోస్ట్‌మేన్ వచ్చి ఓ కవరు అతనికిచ్చి వెళ్ళాడు. దాన్ని చూడగానే నిరుపమ్ కళ్ళు జిగేల్‌మనడం గమనించింది అనన్య. దాన్ని అందుకుని చెప్పాడు నిరుపమ్

"ఈ క్క తర్వాత చూద్దాం లెండి"

అనన్యతన కుర్చీలో కూర్చుని అతను చేసేది గమనించాగింది. కవర్ విప్పి లోపల నించి చిన్న ఫోటో ముక్క బయటికి తీసాడు. టేబుల్ సొరుగు లాగి అందులోంచి ఓ ఫైల్ తీసి, అందులోంచి ఓ కాగితం తీ గమ్ రాసి ఈ ముక్కని ఆ కాగితంలో ‌తికించాడు.

ఆ ఫోటోవంక తదేకంగా కొద్ది క్షణాలు చూసాడు. వెటనే అతని మొహం ఆనందంతో విప్పారింది. కల తిప్పి అతను తన వంక చూడడం గమనించి అనన్య చిన్నగా నవ్వింది.

నిరుపమ్ ఉటాలున లేచి తాగిన వాడిలా తూలుతూ అడుగులేస్తూ, అనన్య దగ్గరికి వచ్చి, ఆమె టేబుల్ అంచుని పట్టుకుని నిలదొక్కుకుంటూ చెప్పాడు.

"ఐ జస్ట్ కాన్ట్ బీలీవ్ మై లక్..."

చటుక్కున కుడికాలి మీద కూర్చుని అనన్య చేతిని మృదువుగా పట్టుకుని చెప్పాడు ఉద్వేగాన్ని అణచుకుంటూ...

"ఐ లవ్ యూ టూ అనన్య. ఐ లవ్ యూ మోర్ దేన్ యు లవ్ మి" బేంక్‌లోని అంతా వీళ్ళిద్దరి వంక ఆశ్చర్యంగా చూస్తూంటే చెప్పాడు నిరుపమ్.

"మీకు డబ్బున్న వాళ్ళంటే ఇష్టం అని మొన్న మాట్లాడుకుంటుంటే విన్నాను. బిల్‌గేట్స్ అంత రిచ్ కాదు నేను. మీకు అమెరికా వీసా దొరికినా... పైగా అతనికి పెళ్ళయింది కూడా. నా జీతం కాక ఇంకా అంత వచ్చే స్థోమత వుంది నాకు... విల్ యూ మ్యారీ మీ?"

**మనిషికి జంతువుకి గల తేడా ఏమిటి?**
**- ఆవపెట్టిన అరటి కూర చేసుకుని తినడం.**
**ఈ జోక్కి నవ్వురాకపోతే, సద్దాం ఆంటీ ఇంటి కథని ఈ పక్షమైనా చదివి హాయిగా నవ్వుకోండి.**

అనన్యకి ఆ క్షణంలో సిగ్గు సంతోషం ముంచుకు వచ్చింది.

"అంతా చూస్తున్నారు. ముందు లేవండి" చెప్పింది అంతా తమ వంకే చూస్తుండడంతో.

"చూడనీండి. ఇది నా జీవితంలోని అతి ముఖ్యమైన సన్నివేశం. ఎన్నిసార్లో మీతో చెప్పాలనుకుని ఎన్నో రిహార్సల్స్ వేసుకున్నా ఇది కానిది ఇప్పుడు ఇదయింది. ఈ క్షణాలు దాటితే మళ్ళీ నాకీ ధైర్యం రాకపోవచ్చు."

"మా బామ్మతో అన్నీ మాట్లాడుదురుగాని. ముందు లేవండి"

నిరుపమ్ లేచాక చెప్పింది సిగ్గుగా-"ఐ థింక్ ఐ లవ్ యూ టూ"

ఆ రోజు బేంక్ స్టాఫ్ తాగిన కాఫీ, టీల డబ్బు నిరుపమ్ నించి వసూలు చేసారు.

* * *

క్రితం రాత్రి నిద్రలేదు కనక, ఉదయం ఇంటికి వచ్చాక మంచం మీద వాలిన హరికేశం మధ్యాహ్నం మూడు దాకా లేవలేదు. లేచాక భార్యని కాఫీ అడిగాడు.

"నువ్వే పెట్టుకుని తాగు" రుసరుస లాడిందావిడ.

"అదేమిటి?"

"వద్దన్నా రాత్రి మళ్ళీ పేకాటకి వెళ్ళొచ్చావు కదూ?" అరిచింది.

"లేదు"

"అబద్ధాలాడక"

"నీతోడు"

"నేను ఛస్తే నిన్ను చూసుకునే దిక్కుండదు జాగ్రత్త... నాకు తెలీదను కున్నావా? పేంటు షర్టు తాకట్టు పెట్టి పేకాట ఆడావు"

"ఛ. లేదు"

"మరి ఒంటిమీది బట్టలేవి? ఆ చిరుగులుంగీ, పాత చొక్కా ఎక్కడ నించి వచ్చాయి?" గద్దిస్తూ అడిగింది.

"అదా నీ అనుమానం? చెప్తా విను...." రాత్రి తనకి జరిగింది మొత్తం వివరించి చెప్పాడు.

"కథలు చెప్పమాక" మూతి విరిచింది.

"కథ కాదు.. నీ మీద తోడు. కావాలంటే లింగమయ్యని అడుగు"

"బట్టలు ఎత్తుకెళ్ళే దొంగలు కూడా ఊళ్లో తిరుగుతున్నారన్నమాట. నమ్మమంటావ్?"

"సరే. నువ్వు నమ్మితే నాకేం? నమ్మకపోతే నాకేం? తింటానికి పాముకేదైనా వేసావా?"

"కాకి, గుడ్డు తప్ప ఇంట్లో ఇంకేం లేదు"

"నాకో రెండు గుడ్లతో ఆమ్లెట్ వేసి అన్నం వడ్డించు. అన్నం తిన్నాక మళ్ళీ పడుకుంటూ"



చెప్పాడు.

"ఈ రాత్రి మళ్ళీ వెళ్ళి పని పూర్తి చేయాలి. మీ తుమ్ముడ్ని వాడి సైకిలు తెచ్చిమ్మను. రాత్రి పదకొండు లోగా నేను లేవకపోతే లేపు" అన్నం తిని పడుకోబోయే ముందు చెప్పాడు.

రాత్రి తొమ్మిదిన్నరకి మెలకువ వచ్చిందతనికి. లేచి గడ్డం గీసుకుని స్నానం చేసి టైం చూసుకుని కాసేపు టి.వి. చూసాడు. 'దేవత' సినిమాలో చేతిలోని పాముని చూసి భయపడుతున్నాడు ఫిల్మ్ డైరెక్టర్‌గా నటిస్తున్న నగేష్. అది చూసి నవ్వుకున్నాడు.

మళ్ళీ భోజనం చేసి రాత్రి బయటికి వెళ్ళబోయేముందు భార్యతో చెప్పాడు.

"నిన్న మిస్ అయింది కాని, ఈ రాత్రికి పని పూర్తి చేసుకుని వస్తాను. రేపు మనకి చాలా డబ్బు వస్తుంది. అది నువ్వే తీసుకుని ఇంటి ఖర్చుకి వాడుకో. వెదికినా నాకు కనబడకుండా దాచుకో. లేకపోతే పేకాటలో తగలేస్తాను"

"నీకు పేకాట బదులు తాగుడు అలవాటున్నా బావుండేది"

"అదేం?"

"దాని ఖర్చుకి రోజుకింతని ఓ లిమిట్ వుంటుంది. కాని పేకాటకలా కాదుగా"

"నిజమే. రోజుకో కోటి రూపాయలయినా పేకాటకి గంటలో తగలేయగలం కాని మందుకి అంత ఖర్చు చేయలేం. ఆలోచిస్తాను" వప్పుకున్నాడు హరకేశం.

"పైగా మందు నిద్రపుచ్చుతుంది. పేకాట నిద్రపోకుండా చేస్తుంది"

"ఆలోచిస్తానన్నా కదే"

బయటకు వెళ్ళబోయే ముందు భర్త వేసుకున్న ఇస్త్రీ పేంటు, షర్ట్‌లో జేబులని ఓసారి చెక్ చేసింది. వాటిలో డబ్బు లేదని రూఢి చేసుకోడానికి.

"రెండు రాత్రులుగా సరిగా నిద్రలేదు. ఇవాళయినా పని పూర్తి చేస్తారా"

సైకిల్‌కి పాముున్న గోనె సంచినీ తగిలించుకుని రాత్రి పదకొండు ముప్పావుకి ఇంట్లోంచి బయలుదేరాడు హరకేశం. నింపాదిగా సైకిల్ తొక్కసాగాడు. అది స్కూల్ ముందు ఆగడంతో దాన్నో తన్ను తన్ని, తనని తాను తిట్టుకున్నాడు.

"బుద్ధి పోనిచ్చుకున్నావు కాదు. ఈ రోజు పేకాటలో కూర్చుంటే ఇంతే సంగతులు"

> **సినిమాల్లో విలన్ దొంగతనం చేస్తే?**
> **- విలాసాలకి దాన్ని ఖర్చు చేస్తాడు.**
> **సినిమాలో హీరో బేంక్ దొంగతనం చేస్తే?**
> **- దాన్ని తన పిల్లల కేన్సర్ నివారణ కోసం ఖర్చు చేస్తాడు.**
> **ఈ సీరియల్‌లోని లింగమయ్య విలనా, హీరోనా?**

మళ్ళీ దాన్ని తొక్కసాగాడు. ఒకటింపావుకి రాంనగర్ ఏరియాలోకి చేరుకున్నాడు. బామ్మ ఇంటి దరిదాపులకి వచ్చాక అకస్మాత్తుగా చీకట్లో తన వీపు మీద ఏదో వచ్చి పడిందని స్పర్శని బట్టి గ్రహించాడు హరకేశం. పామేమో అని క్షణకాలం అనిపించినా, అది ముందు హేండిల్ బార్‌కి వేలాడుతుండడంతో అది కాదని గ్రహించాడు.

లైటు స్థంభం దగ్గర సైకిల్ దిగి స్టాండ్ వేసి చేత్తో తడుముకున్నాడు. పచ్చిగా, మెత్తగా ఏదో తగిలింది.

ఆ చేతిని మొహం దగ్గరికి తెచ్చి చూసుకున్నాడు. యాక్ తూ!

అది మలం. మనిషి మలం. మళ్ళీ ఏదో వచ్చి పేంట్ మోకాలి పై భాగంలో తగలడం తెలిసింది. ఒంగి చూసుకుంటే, అదీ మలమే.

అది ఎవరు విసిరారా అని అటు ఇటు చూసాడు. ఒంటి మీద బట్టలు లేని ఓ నల్లటి తాటి మొద్దులాంటి మనిషి హరకేశం .......... కనబడ్డాడు. చింపిరిజుట్టు, పొడుగాటి గడ్డం, హరకేశాన్ని చూసి 'హి హి హి' అని నవ్వాడు.

వాడు పిచ్చివాడు అని ఇట్టే గ్రహించిన హరకేశానికి ఇక వాడ్ని ఏమనీ ప్రయోజనం లేదని అర్థమైంది. తన చొక్కా, పేంట్ల నించి వచ్చే దుర్గంధం భరించలేనంతగా వుంది. అందులో మనిషికి శుభ్రం ఎక్కువేమో, హరకేశానికి అసహ్యంగా అనిపించింది. ఏం చెయ్యాలో అన్నట్లుగా అటు ఇటు చూసాడు. ఎదురుగా ఉన్న ఇంటి మీద పడింది అతని దృష్టి. ఆ ఇంటి ముందున్న సన్నటి సందులో ఓ వైపు మేడమెట్లు, మెట్ల కింద రేకు తలుపు, సగం తెరిచి వుంది. అది బాత్‌రూమ్ అని తెలిసిపోతోంది.

ఆ ఇంటివాళ్ళు గాఢ నిద్రలో వున్న గుర్తుగా బెడ్ లేంపులు వెలుగుతున్నాయి తప్ప టి.వి చప్పుడు లేదు. చిన్నగా శ్వాస పీల్చి వదిలాడు పిచ్చివాడు. ఇంకా అలాగే చూస్తూ తనలో తాను ఏదో మాట్లాడుకుంటూ నిలబడే వున్నాడు.

సైకిల్ తాళం వేసి, ఆ ఇంటి గేటు వైపు నాలుగడుగులు వేసాడు. పిచ్చివాడు సైకిల్ వైపు కదలడంతో తను మర్చిపోయిన గోనెసంచీ సంగతి గుర్తుకు వచ్చి, మళ్ళీ చప్పున వెనక్కివెళ్ళి పామున్న ఆ సంచీని తీసుకున్నాడు.

హరకేశం భయపడ్డట్లుగా గేటుకి లోపలతాళం వుంది. కానీ ఆ ఇంటి కాంపౌండ్ గోడ అయిదున్నరడుగల ఎత్తే. సంచీతో సహా ఇట్టే ఆ కాంపౌండ్ వాల్‌ని దాటేసాడు హరకేశం

నిశ్శబ్దంగా మెట్ల దగ్గరికి వెళ్ళి దా కింద చోటులో కట్టిన బాత్‌రూమ్‌కున్న నారేకు తలుపుని తెరిచాడు. లోపలికి వెళ్ళి డిమ్ లైట్ వేశాడు. లోపల ప్లాస్టిక్ బక్కెట్. వెక్కిరిస్తూ దాన్నిండా నీళ్ళు కనిపించాయి. భుజానకున్న గోనె సంచీని మేకుకి తగిలించి ముందు చొక్కా, బనీను విప్పాడు. తన ఖర్మకి బాధపడుతూ ఆ రెంటినీ నీటితో శుభ్రపరిచాడు.తుపు మూసి లోపల బోల్ట్ పెట్టి, పేంటుని విప్పదీసాడు. చొక్కా, బనీన్లని తలుపు మీద వేసి పేంట్‌ని కూడా శుభ్రం చేసాడు.

దాన్నీ తలుపు మీద వేసి చప్పుడు కాకుండా పది మగ్గుల నీళ్ళు వంటి మీదపోసుకున్నాడు. ఒళ్ళంతా శుభ్రం అయిందనిపించాక తన బట్టలని అందుకోడానికి చేతిని చాచాడు.

తలుపు మీద పేంటూ, షర్టు, బనీన్లు లేవు!



అదిరిపడ్డాడు. ఎవరు తీసారు? తలుపు తెరిచి బయటకి తొంగి చూసాడు. ......... నడిచిపోతున్న ఇంకాకటి పిచ్చివాడి వంటి మీద ఇప్పుడు హరకేశం బట్టలున్నాయి.

వెంటనే మెరుపులా హరకేశం కాంపౌండ్ వాల్ మీంచి రోడ్డు మీదకి దూకి వాడి వెంట పడుతూ అరిచాడు.

"ఏయ్... ఆగు"

ఆ అరుపు వినగానే వాడు దౌడు తీసాడు. పూర్తిగా నగ్నంగా వున్న హరకేశం వాడి వెంట పడ్డాడు. సందులు తిరుగుతూ తప్పించుకోడానికి చూసిన ఆ పిచ్చివాడిని అనుసరిస్తున్న హరకేశం ఆకస్మాత్తుగా మొండి మొలతో పరిగెత్తుకుంటూ, మెయిన్‌రోడ్డు మీదకి వచ్చి ఓ జీపు ముందు ఆగాడు.

అది పోలీసు జీపు!

దాని ముందు అటూఇటూ దూరంగా నిలుడ్డారు ఇద్దరు కానిస్టేబుల్స్. వంగి, వాళ్ళ చేతుల్లోని లాఠీలని రోడ్డు మీద అటు ఇటు ఇంటూ ఆకాశంలో పట్టుకుని వున్నారు.

హరకేశాన్ని చూసారు వాళ్ళిద్దరూ. మాటా పలుకు లేకుండా సినిమాల్లోని ఫ్రీజ్‌షాట్‌లో ఏక్టర్‌లా నేలకి అతుక్కుపోయి నిలబడ్డ హరకేశాన్ని చూసి, జీప్‌లోంచి దిగి, నెమ్మదిగా అతని దగ్గరికి వచ్చాడు ఇన్‌స్పెక్టర్.

"మళ్ళీ నువ్వా?" అరిచాడు.

"అవును. మళ్ళీ నేనే" హరకేశం గొంతులోంచి మాటలు హతి లోంచి వచ్చినట్లు వచ్చాయి.

''సెర్చ్ హిమ్'' చెప్పాడు ఇన్‌స్పెక్టర్ కానిస్టేబుల్స్‌తో.

వాళ్ళు బిక్క మొహాలు వేసుకుని చూసారు. హరకేశాన్ని ఎలా ఎక్కడ సెర్చ్ చేయాలా అని.

"దేనికి సెర్చ్?" అడిగాడు హరకేశం, తనకి కలిగిన షాక్ నించి తేరుకుంటూ...

"దిల్‌షుక్‌నగర్‌లోని సాయినాధుడి ఆలయం బయట బాంబు పేలినప్పటి నించి అర్ధరాత్రి ఆయుధాలతో తిరిగే ఐఎస్ఐ ఏజెంట్ల కోసం అన్ని వాహనాలని, అందర్నీ సెర్చ్ చేస్తున్నాం" చెప్పాడు కానిస్టేబుల్.

"ఇవాళ కూడా నీ బట్టలు దొంగలెత్తుకెళ్ళారా?" వెటకారంగా చూస్తూ అడిగాడు ఇన్‌స్పెక్టర్.

"కాదు. నా దగ్గర ఎలాంటి ఆయుధాలు లేవని చెప్పడానికి అసలు బట్టల్లేకుండా వెళ్తున్నాను. ఉంటా"

హరకేశం కదలబోతే, ఆగమన్నట్లుగా నేల మీద లాఠీతో కొట్టాడు ఓ కానిస్టేబుల్.

"నా కర్థం కాదు. రోజూ నువ్వు రాత్రిళ్ళు ఇలా నగ్నంగా ఈ ప్రాంతాల్లో ఎందుకు తిరుగుతున్నట్లు? నీవు పేకాటలో వాటిని పోగొట్టుకొంది ఏ ఇంట్లో" ప్రశ్నించాడు ఇన్‌స్పెక్టర్.

"నా బట్టలు ఓ పిచ్చాడు ఎత్తుకెళ్ళాడు సార్..."

"నిన్న దొంగలు, ఇవాళ ఓ పిచ్చాడు. వాళ్ళ నీ వంటి మీది బట్టలు ఎత్తుకెళ్ళడం తప్ప వేరే పని లేదా?"

"అది కాదు సార్.."

"అరెస్ట్ హిమ్" ఇన్‌స్పెక్టర్ కానిస్టేబుల్స్‌తో చెప్పి వెళ్ళి జీపులో కూర్చున్నాడు.

వెనుగులాడుతున్న హరకేశాన్ని జీపెక్కించారు

> **ఇంతదాకా ఇండియాలోనే మహిళ ఎందుకు రాష్ట్రపతి కాలేదు?**
>
> **- అందుకు 35 ఏళ్ళపైబడి ఉండాలి కాబట్టి ఆ వయసుకు మూడు రెట్ల వయస్సున్న బామ్మ పాత్రని ఈ సీరియల్‌లో కలుసుకోవచ్చు.**

కానిస్టేబుల్స్. జీప్ పోలీస్‌స్టేషన్‌కి కదలగానే, ఓ గోడచాటు నించి బయటకు వచ్చిన ఆ పిచ్చివాడు హరకేశాన్ని చూస్తూ 'హి హి హి' అనే నవ్వుతూ చేతులూపాడు.

"అడుగోవాడే. వాడి వంటిమీదివి నా బట్టలే" అరిచాడు హరకేశం. కాని జీప్ ఆగకుండా వెళ్ళి పోలీస్‌స్టేషన్ ముందాగింది. హరకేశాన్ని లోపలికి తీసుకెళ్ళి లాకప్‌లో పడేసి బయట తాళం పెట్టారు పోలీసులు. తన దురదృష్టానికి హరకేశానికి చిరాకేసింది.

ఇన్‌స్పెక్టర్ కానిస్టేబుల్‌ని పిలిచి చెప్పాడు.

"మొన్న, నిన్న వీణ్ణి విడిపించుకెళ్ళిన వాడి ఫోన్‌నెంబర్ అడిగి కనుక్కో"

"అది నాకు తెలుసు సార్. వాడి పేరు లింగమయ్య"

"అయితే వాడికి ఫోన్‌కొట్టి, హరకేశం వంటిమీద బట్టల్లేకుండా మళ్ళీ మనకి దొరికాడని, విడిపించుకోదలచుకుంటే వెంటనే డబ్బుతో రమ్మని చెప్పు"

"అలాగే సార్"

కానిస్టేబుల్ ఉత్సాహంగా ఓ నంబర్ డయల్ చేసాడు. అవతలి వైపు ముందు లింగమయ్య భార్య ఫోన్ ఎత్తింది. పోలీస్ స్టేషన్‌నించని తెలుసుకుని లేపి భర్త కిచ్చింది రిసీవర్. లింగమయ్య అవతలివైపు నించి కానిస్టేబుల్ చెప్పింది విన్నాడు.

"తెల్లారితే వాడ్ని మెజిస్ట్రేట్ కోర్ట్‌కి హాజరు పరచమన్నారు ఇన్‌స్పెక్టర్ గారు"

"స్కౌండ్రల్, ఇడియట్, రాస్కెల్... నిన్ను కాదు. వాడ్ని తిట్టింది. మళ్ళీ పేకాటకు వెళ్ళాడు" పళ్ళు పటపట కొరికి చెప్పాడు... "నేనొచ్చేలోగా వాడ్ని బాగా దండించండి. బుద్దొస్తుంది"

"ఎక్కడికి?" అడిగింది లింగమయ్య భార్య మంచం దిగిన భర్తని.

"పోలీస్‌స్టేషన్‌కి. లేచి నా పాత లుంగీ బనీన్లు ఇవ్వు"

"లేవు అయిపోయాయి. నా పాత చీరొకటి ఉందాలి."

"సరే అదే ఇవ్వు"

స్కూటర్‌ని స్టార్ట్‌చేసిన భర్తకి వాటిని క్యారీబాగ్‌లో వుంచి అందించిందావిడ.

"బామ్మ పనయ్యాక పట్టుబడ్డాడా? లేక మునుపా? నాకు వెంటనే ఫోన్ చేసి చెప్పండి" అడిగింది. పోలీస్‌స్టేషన్‌కి చేరుకున్న లింగమయ్య సరాసరి ఇన్‌స్పెక్టర్ దగ్గరికి వెళ్ళాడు. "ఈ రకం క్రైం పెరిగిపోతోంది. ఇవాళ రెండు వేలు ఇస్తే కాని వదలను" చెప్పాడు ఇన్‌స్పెక్టర్.



బేరసారాలతో తర్వాత పదిహేను వందలు చెల్లించి లుంగీలా వంగపండు రంగు చీరని కట్టుకుని, కొంగుని భుజాల మీదుగా ఛాతి మీదకి కప్పుకున్న హరకేశంతో బయటికి నడిపించాడు లింగమయ్య రోడ్డు మీదకి రాగానే ఫెడీలుమని ఓ దెబ్బ కొట్టాడు లింగమయ్య. మళ్ళీ పడుతున్న దెబ్బనించి తప్పించుకుంటూ అరిచాడు హరకేశం.

"ఆగు. నేచెప్పేది విను"

"పేకాట ఆడ్డానికి నీకు ఈ రాత్రే దొరికిందా? ఆఁ?అడ్వాన్స్ కూడా తీసుకున్నావు బుద్ధి లేదూ? పని ఎప్పటికయ్యేను?"

"నీతోడు. పేకాటకి వెళ్ళనే లేదు నేను..." జరిగింది చెప్పాడు.

"నమ్మమంటావ్?"

"ఆలస్యం చేయక స్కూటర్ నే చెప్పినట్లు పోనీ. పామున్న గోనెసంచి ఆ బాత్‌రూమ్‌లో మేకుకి తగిలించాను. పిచ్చి శాల్తీ వేటలో నేనది మరవడం మంచిదైంది. లేకపోతే పోలీసుల కంటపడేదది. తెల్లారేలోగా దాన్ని తీసుకోకపోతే ఆ ఇంటివాళ్ళు దాన్ని చూసి తెరిస్తే ప్రమాదం. మంచి కసి మీదుందది"

లింగమయ్య రాంనగర్‌లోని ఓ సందులో హరకేశం చూపించిన ఇంటి పక్కన స్కూటర్ ఆపాడు. హరకేశం స్కూటర్‌దిగి మునుపటిలా దాని పిట్టగోడ ఎక్కి దాని బాత్‌రూమ్‌లోకి వెళ్ళి గోనె సంచీతో తిరిగి పిట్టగోడ మీంచి రోడ్డు మీదకి దూకుతుండగా ఇంట్లో లైట్లు వెలిగి, "ఆడ దొంగ..., ఆడ దొంగ...' అన్న అరుపులు వినబడ్డాయి. వాళ్ళు తలుపులు తెరుచుకుని బయటకు వచ్చి చూసే సరికి లింగమయ్య స్కూటర్ సందు మలుపు తిరుగుతోంది.

"నే చూసాను. ఎవరో అడది. వంగపండు రంగు చీర కట్టుకునుంది..."

బాత్‌రూంలోని తమ ప్లాస్టిక్ బక్కెట్, మగ్గు, పంపుల ఇత్తడి తలలు పోలేదని చెక్ చేసుకున్నాక ఏం పోలేదని వాళ్ళు సంతృప్తి చెందారు. వాళ్ళు లోపలికి వెళ్ళి తలుపు వేసుకున్నాక ...... ఇవతలికి వచ్చిన హరకేశం గోనె సంచితో తన సైకిలు ఎక్కి ఇంటి దారి పట్టాడు. **(ఇంకావుంది)**

---

# హిందీ సినీ సంగీతంలో మలుపులు-మజిలీలు

## 1948

హిందీ సినిమా లెజండ్ రాజ్‌కపూర్ స్వంత నిర్మాణ సంస్థ ఆర్.కె.ఫిలిమ్స్ మొదటిచిత్రం 'ఆగ్' ఈ సంవత్సరంలోనే విడుదల. సంగీత దర్శకుడు 'రామ్‌గంగూలీ'. అతని శిష్యులు శంకర్-జైకిషన్‌ల సహకారం ఎంతోవుంది. రాజ్‌కపూర్ తదుపరి చిత్రం నుండి శంకర్ - జైకిషన్లే అతని ఆస్థాన సంగీత దర్శకులయ్యారు. సైగల్ ప్రభావం నుండి ముఖేష్ బయటపడి 'జిందాహూఁ ఇస్ తరహ్' పాట పాడాడు.

వాలీసాహెబ్ తీసిన 'హీర్ రాంరఘూ' చిత్రం ద్వారా కో-కంపోజర్‌గా ఖయ్యాం పరిచయం.


ఖయ్యాం

దక్షిణాదిలో సూపర్‌హిట్ అయిన చంద్రలేఖ చిత్రం హిందీలో విడుదలయి అక్కడా సూపర్‌హిట్ అయింది. చిత్ర విజయానికి మూలకారణం పాటలు, డాన్సులు. అయినా సంగీత దర్శకుడు ఎస్.రాజేశ్వరరావు హిందీ సీమలో నిలదొక్కుకోలేదు.


ఎస్.రాజేశ్వరరావు

'ఆగ్', ఖేమ్‌చంద్ ప్రకాష్ స్వరపరిచిన 'ఆషా', నౌషద్ స్వరపరిచిన 'అనోఖీ అదా', 'మేలా', గులామ్ హైదర్ సంగీతం ఇచ్చిన 'షహీద్', 'జిద్దీ', హుస్నలాల్ -భగత్‌రామ్ స్వరపరిచిన 'ప్యార్ కి జీత్' సంగీత పరంగా మంచిహిట్ అయ్యాయి.

## 1949

ఆర్.కె.ఫిలిమ్స్ నిర్మించిన 'బర్సాత్' తో సినీ సంగీతంలో విప్లవాత్మక మార్పులు చోటుచేసుకున్నాయి. ఈ చిత్రంలోని 11 పాటలూ హిట్ కావటమే కాదు మూస పద్ధతిలో సాగిపోతున్న హిందీ సినీ సంగీతాన్ని కొత్త పుంతలు తొక్కించింది.



ఈ చిత్రం ఆడియో అమ్మకాలలో కూడా రికార్డు సృష్టించింది. అప్పటివరకూ వున్న రికార్డులను బ్రేక్‌చేసి సినీ సంగీతం ఒక పరిశ్రమగా అవతరించింది.

'బర్సాత్' చిత్రం లతాకున్న స్థానాన్ని మరింతగా పదిలపరిచింది. శంకర్-జైకిషన్ (సంగీత దర్శకులు), హస్రత్ జైపురి-శైలేంద్ర (గీత రచయితలు), లతామంగేష్కర్, ముఖేష్, రాజ్‌కపూర్‌లు కలిసిన 7గురు సభ్యుల సక్సెస్‌ఫుల్ టీమ్ ఏర్పడింది.

రోషన్ 'నేకీ ఔర్ బడీ' అనే ఫ్లాప్ చిత్రం ద్వారా సంగీత దర్శకునిగా పరిచయం. అయితే పాటలతో సహా ఆ చిత్రం ఘోరంగా దెబ్బతినటంతో ఆత్మహత్య చేసుకోవాలని రోషన్ భావించారు. అయితే నిర్మాత, రచయిత కిదార్‌శర్మ ఆయనక 'బావరేనైన్' చిత్రానికి అవకాశం కల్పించార.


రోషన్

శాస్త్రీయ సంగీతం అభ్యసించు ఒ.పి.నయ్యర్ 'కనీజ్' చిత్రానికి నేపథ్య సంగీతాన్ని అందించారు. ముంబై లో ఇదే ఆయనకు మొదటి చిత్రం.


ఒ.పి.నయ్యర్

బర్సాత్, అందాజ్, దులారీ, ఏక్ థీ లడకీ, మజ్‌బూర్ చిత్రాలతో పాటు అశోక్‌కుమార్ నటించిన 'మహల్' చిత్రంలోని 'ఆయేగా ఆనేవాలా...' పాట లతాకు తిరుగులేని స్థానాన్ని కట్టబెట్టింది.

'దులారీ' చిత్రంలోని 'రాత్ రంగీలీ మస్త్ నజారేఁ...', 'మిల్ మిల్ కే గాయేంగే...' పాటల ద్వారా రఫీ, లతాల తొలి డ్యూయెట్‌లు శ్రోతలు విన్నారు.

'లారా లప్పా...' అనే హిట్ సాంగ్ 'ఏక్ థీ లడ్‌కీ ' సినిమాకై లతాచే వినోద్ అనే అంతగా పేరు ప్రఖ్యాతులు లేని సంగీత దర్శకుడు పాడించారు.


లతా

ఈ సంవత్సరం విడుదలై సంగీత పరంగా విజయం సాధించిన వాటిలో నౌషద్ స్వరపరిచిన 'దిల్లగీ', సి.రామ చంద్ర 'సాజన్', అనిల్ బిశ్వాస్ నేతృత్వంలో 'లాడ్‌లీ', శ్యామ్ సుందర్ 'బజార్', హుస్నలాల్ -భగత్‌రామ్‌ల 'బడీ బహన్' ఉన్నాయి.

జనవరి 12 "సత్యం" వర్ధంతి సందర్భంగా...



# 'ఆశా' మెచ్చిన సంగీత దర్శకుడు "సత్యం"

డెబ్బై, ఎనభై దశకాల నుండి తెలుగు సినిమాల నిర్మాణంలో వేగం పెరిగింది. దాంతో చాలామంది సంగీత దర్శకులు ఈ వేగంతో వేము రాజీపడలేమని సినిమాలు తగ్గించుకోవడం, మరికొందరైతే మానుకోవడమూ జరిగింది. వేగం సినిమాల సంఖ్యను పెంచింది కానీ నాణ్యతను పెంచలేకపోయింది. ఇలాంటి తరుణంలో మారిన ట్రెండ్‌కు అనుగుణంగా సంగీతరచన చేస్తూ నాణ్యతకు భంగం వాటిల్లకుండా తన ఉనికిని నిలుపుకున్న అతికొద్ది మంది సంగీత దర్శకుల్లో ఒకరు సత్యం!

ఉత్తరాది సంగీత దర్శకద్వయం శంకర్ -జై కిషన్‌లను అభిమానించి, వారి 'రిథం'ను తన సంగీతంలో సమ్మిళితం చేసి "సత్యం మార్కు" సంగీతమనిపించుకున్నారు. ఇంకా చెప్పాలంటే తెలుగువారికి ఆయన "దక్షిణాది ఆర్డీ బర్మన్" గా గుర్తింపునొందారు. సత్యం పేరు చెప్పగానే మనకు "గున్న మామిడి కొమ్మ మీద", "ఓ బంగరు రంగుల చిలకా'', " ఏ దివిలో విరిసిన పారిజాతమో", "నీ కౌగిలిలో తలదాచి" వంటి మధురగీతాలు గుర్తుకువస్తాయి.

సత్యంగా దక్షిణ భారత చిత్రరంగంలో పేరొందిన చెళ్ళపిళ్ళ సత్యనారాయణ 1933లో శ్రీకాకుళం జిల్లా గుణుపురంలో జన్మించారు. ఆయన పూర్వీకులు సంగీతంలో అభినివేశం గలవారు. తాత చామర్తి సత్యం భాగవత కళాకారునిగా పేరొందినవారు. పార్వతీపురంలో ప్రాథమిక విద్యాభ్యాసం చేసే రోజుల్లోనే సంగీతం పట్ల ఆసక్తిని కనబరిచిన సత్యంను అప్పుడే సాలూరుకు మకాం మార్చిన ఆయన తండ్రి అక్కడి వ్రటాయుని

## సత్యం హిట్స్

"ఇదే పాట ప్రతీనోటా ఇలాగే పాడుతుంటాను" (పుట్టినిల్లు మెట్టినిల్లు), "కురిసింది వాన" (బుల్లెమ్మ బుల్లోడు), "ఇది పాట కానే కాదు"(తలంబ్రాలు), "తొలి సంధ్య వేళలో (సీతారాములు), "గాలి వానలో వాననీటిలో(స్వయంవరం), "ఆలనగా పాలనగా (కుంకుమ తిలకం), "దారిచూపిన దేవత" (గృహప్రవేశం), "శివశివ శంకరా", కండగెలిచింది, ఆకాశం దించాలా (భక్త కన్నప్ప), "నా జీవన బృందావనిలో (అమర దీపం), "ఆరనీకుమా ఈ దీపం (కార్తీకదీపం), "స్నేహమేరా జీవితం" (నిప్పులాంటి మనిషి), "శరణం నీ దివ్య శరణం (ముట్టిలో మాణిక్యం),

సీతారామశాస్త్రి వద్ద శిష్యునిగా చేర్పించారు. శిక్షణాకాలంలో సత్యం ప్రతిభను గుర్తించిన ఆది నారాయణరావు తండ్రి తమ కాకినాడలోని "యంగ్‌మెన్ హాపీ "క్లబ్‌లో చేర్పించారు. ఈ క్లబ్‌లో చేరడంతోనే సత్యం సంగీత జీవితం మలుపు తిరిగింది. ఇక్కడ పనిచేస్తూనే కాకినాడలో తన చదువును కొనసాగించారాయన. ఇలా 14 సంవత్సరాల వయసు నాటికే సంగీతకారునిగా, గాయకునిగా రూపుదిద్దుకున్న సత్యం ముఖ్యంగా 'డోలక్' వాయించటంలో విశేషమైన ప్రావీణ్యతను గడించారు. యంగ్‌మెన్ హాపీ క్లబ్ లో అంతా ఆయనను "డోలక్ సత్యం" గా పిలిచేవారు.

ఈ క్లబ్‌లో సభ్యులైన ఆదినారాయణరావు, అంజలి, రేలంగి, ఎస్వీరంగారావులతో కలిసి యుద్ధ నిధికోసం ముమ్మరంగా నాటక ప్రదర్శనలలో పాల్గొన్నారాయన.

ఇంతలో సి.పుల్లయ్య 'గొల్లభామ' చిత్రంలో పనిచేయడానికి అంజలీ దేవితో పాటు మరికొందరు "క్లబ్" సభ్యులు మద్రాసు వెళ్లారు. దాంతో మన 'సత్యం' ఒంటరివాడై ఈ నాటకాలు,సంగీతం మనకు సరిపడవని జీవితంలో స్థిరపడాలను కుని తప్పనిసరై వంశపారంపర్యంగా సంక్రమించే "కరణీకం'' చేయడానికి నిర్ణయించుకున్నారు. ఈ ఆలోచనలు ఒక కొలిక్కిరాకముందే అంజలీదేవి తాము నిర్మిస్తున్న 'మాయలమారి' చిత్రానికి సంగీత విభాగంలో పనిచేయడానికిగాను మద్రాసుకు పిలిపించారు. అలా ఆయన సినీరంగ ప్రవేశం జరిగింది. మాయలమారి చిత్రంలోని అన్ని శాఖల్లోనూ పనిచేసిన సత్యం ఒక పాత్రను కూడా పోషించారు. ప్రధానంగా సంగీత విభాగంలో సహాయ సంగీత దర్శకుడిగా టి.వి.రాజుతో కలిసి పనిచేశారు. ఆ పరిచయంతో తరువాతి కాలంలో రాజుగారి వద్ద చాలా చిత్రాలకు అసిస్టెంట్ మ్యూజిక్ డైరక్టర్‌గా చేశారు. వాటిలో ఒకటి "జయసింహ".

సహాయ సంగీత దర్శకుడిగా అయిదారేళ్లపాటు గడిపిన సత్యం ప్రతిభను గుర్తించిన నాయక్ అనే నిర్మాత తాము తీసే కన్నడ చిత్రం "రామాంజనేయ యుద్ధం"కు సంగీత దర్శకుడిని చేశారు. ఈ నాయక్ ఎవరో కాదు తెలుగు హీరోయిన్ చంద్రకళ తండ్రే. తొలి సినిమా సక్సెస్ కావడంతో ఆ వెంటనే "ఒందె ఒందియ హుగళు" అనే చిత్రానికి సంగీతం చేసే అవకాశం వచ్చింది. ఇదీ విజయవంతం కావడంతో కన్నడ రంగంలోసత్యం విజయయాత్ర మొదలై మరో



పి.సుశీల, ఎస్.పి.బాలసుబ్రహ్మణ్యంలతో సత్యం

రెండేళ్లలోపలే 30 కన్నడచిత్రాలకు సంగీత దర్శకత్వం వహించారాయన. అప్పట్లో కన్నడ చిత్రాల రికార్డింగ్‌లన్నీ ఎక్కువగా గోల్డెన్



స్టూడియోలోనే జరిగేవి. అదే స్టూడియోలో సినిమాలు తీనస్తా వస్తున్న నిర్మాత ఎస్.భావనారాయణ సత్యంలోని వైవిధ్యాన్ని గమనించి 1968 లో తన "పాల మనసులు" చిత్రానికి సంగీత దర్శకునిగా నియమించుకున్నారు. తెలుగులో అదే తొలి చిత్రం ఆయనకు. ఉదయ కిరణాలలోన ఇదే సమాధానం, పాలవంక సీమలో, బుడిబుడినడకల బుజ్జాయి, పగిలిన అద్దంలో అగుపించేదేమిటి-' పాటలు 'పాలమనసు లు'లో ఆయనకు మంచి పేరు తెచ్చి పెట్టాయి.

## సత్యం సంగీత దర్శకత్వం వహించిన కొన్ని చిత్రాలు

టక్కరి దొంగ చక్కనిచుక్క(1969), పగసాధిస్తా(1970), మట్టిలో మాణిక్యం, మాస్టర్‌కిలాడి(1971), బుల్లెమ్మ బుల్లోడు(1972), స్నేహబంధం, పుట్టినిల్లు మెట్టినిల్లు, జగమేమాయ(1973), నోము, నీడలేని ఆడది, గౌరి(1974), స్వర్గం- నరకం, మాయామశ్చీంద్ర, రామయ తండ్రి, తోటరాముడు (1975), భక్తకన్నప్ప, ఇద్దరూఇద్దరే(1976), అమరదీపం, ఎదురీత, ప్రేమలేఖలు (1977), లాయర్ విశ్వనాథ్(1978), కార్తీకదీపం, కోరికలే గుర్రాలైతే(1979), సీతారాములు(1980), ఘరానా గంగులు, చేసినబాసలు, చందమామరావే, పాలు - నీళ్లు, స్వప్న, మధురస్వప్నం, సుబ్బారావుకి కోపం వచ్చింది(1981), గృహప్రవేశం, కృష్ణార్జునులు, బంగారుకానుక, కోరుకున్న మొగుడు, చందమామ, స్వయంవరం(1982), కుంకుమ తిలకం(1983), దేవునిరూపాలు, పుణ్యం కొద్ది పురుషుడు(1984), ఆగ్రహం(1985), ప్రతిభావంతుడు, అల్లుడికోసం, తలంబ్రాలు, కారుదిద్దిన కాపురం(1986), కాంచనసీత(1988), సర్కార్ ఎక్స్‌ప్రెస్, రాజసింహ, పాలమనసులు, నేరం నాది కాదు ఆకలిది, దొంగలకు దొంగ, ప్రతీకారం

పాల మనసులు తరువాత 'రాజయోగం' సినిమా సత్యంకు సినీ రాజయోగాన్నే కల్పించింది. ఆ సినిమాలోని 'రావేల రసకేళిలోన' అనే పాట 'అనార్కలి' సినిమాలోని 'రాజశేఖరా' పాట స్థాయిలో ఉందని పలువురి ప్రశంసలను పొందింది. "సర్కార్ ఎక్స్‌ప్రెస్" కూడా 1968లోనే విడుదలైంది. 1969లో మరో నాలుగు చిత్రాలకు సంగీతంచేసిన సత్యం 20 ఏళ్లలో వెనక్కి తిరిగి చూసుకోనే లేదు.

తన 20 ఏళ్ల సినీ జీవితంలో ఎన్.టి.ఆర్., ఎ.ఎన్.ఆర్, కృష్ణ, శోభన్‌బాబు, కృష్ణంరాజు, రాజశేఖర్ వంటి హీరోలు నటించిన విజయవంతమైన చిత్రాలకు పనిచేశారు.

"పాలునీళ్లు" చిత్రంలో ఆశాభోంస్లే చేత 'ఇది మౌనగీతం' పాడించారాయన. సత్యం కంపోజింగ్ స్టైల్‌ను మెచ్చిన ఆమె ఈ పాటను ఉచితంగా పాడారు. సత్యం మరణించేవరకు తెలుగువాళ్లు ముంబైలో కనిపిస్తే "మా సత్యం" ఎలా ఉన్నారని ఆప్యాయంగా అడిగేవారామె. ఇంకా మహమ్మద్ రఫీని కన్నడంలో " వందే బాలు హిమ" అనే చిత్రంలో పాడించి పరిచయం చేశారాయన. కన్నడంలో పలు చిత్రాలకు అవార్డులందుకున్న సత్యం తెలుగులో "భక్తకన్నప్ప" చిత్రానికి ఉత్తమ సంగీత దర్శకునిగా నంది అవార్డు అందుకున్నారు. ఆయన సంగీతం అందించిన ఆఖరు చిత్రం "అంకుశం"(1989). తెలుగు, తమిళ, కన్నడ, హిందీ భాషల్లో కలిసి సుమారు 600 చిత్రాలకు సంగీత రచన చేసిన సత్యం కాలేయ సంబంధ వ్యాధితో బాధపడుతూ 1989 జనవరి 12న మద్రాసులో తుదిశ్వాస విడిచి తన సినీ సంగీత యాత్రను ముగించారు.

**-హెచ్.రమేష్ బాబు.**

# సత్యం హిట్స్

**చిత్రం: ప్రతీకారం**
**రచన: వెలువు ఆంజనేయ శాస్త్రి**
**గానం: ఎస్.పి.బాలు**

నారీ రస మాధురీ లహరీ
అనురాగ వల్లరీ ఆనందఝురీ ॥నారీ॥
శరద్రాత్రిలో చంద్రకాంతిలో
విరహములోనే పరవశించగా
శరద్రాత్రిలో చంద్రకాంతిలో
విరహములోనే పరవశించగా
సుమశరుడే సారించిన నారీ
సుమశరుడే సారించిన నారీ
వాలుకనుల వయ్యారీ ॥నారీ॥
అందాలన్నీ విందులుసేయ
అందెల రవళి సందడిసేయ
అందాలన్నీ విందులుసేయ
అందెల రవళి సందడిసేయ
వన మయూరిలా నాట్యమాడగా
వన మయూరిలా నాట్యమాడగా
జగతి నిండె హాయీ ॥నారీ॥

హంసానంది రాగంపై పూర్తిగా ఆధారపడిన తెలుగు సినిమాపాటల్ని వేళ్ళమీద లెక్కపెట్టవచ్చు. అటువంటి మంచి పాటల్లో ఇదొకటి. సినిమా విజయవంతం కాకపోయినా ఆ రోజుల్లో ఈ పాట ప్రతి వర్ధమాన గాయకుడికీ కంఠోపాఠంగా ఉండేది. ఈ పాటను పాడడాన్ని ప్రెస్టేజ్‌గా ఫీలయ్యేవారు. ఇప్పుడీపాట అరుదుగా లభించే పాటల లిస్ట్‌లోకి చేరిపోయింది. ఈ పాటని తమ మ్యూజిక్ లైబ్రరీలలో కలవాళ్ళు గర్వంగా చెప్పకోదగ్గ గీతమిది.

**చిత్రం: కన్నెవయసు**
**రచన: దాశరథి**
**గానం: ఎస్.పి.బాలు**

ఏ దివిలో విరిసిన పారిజాతమో,
ఏ కవిలో మెరిసిన ప్రేమగీతమో !
నా మదిలో నీవై నిండిపోయెనే.... ॥ఏ దివిలో॥
నీ రూపమే దివ్యదీపమై, నీ నవ్వులే నవ్యతారలై
నా కన్నుల వెన్నెల కాంతి నింపెనే.... ॥ఏ దివిలో॥
పాలబుగ్గలను లేత సిగ్గులు పల్లవించగా రావే!
నీలిముంగురులు పిల్లగాలితో ఆటలాడగా రావే! ॥పాల॥
కాలి అందియలు ఘల్లుఘల్లుమన
కాలి అందియలు ఘల్లుఘల్లుమన
రాజహంసలా రావే! ॥ఏ దివిలో॥
నిదుర మబ్బులను మెరపు తీగవై కలలు రేపినది నీవే
బ్రతుకు వీణపై ప్రణయరాగములు ఆలపించినది నీవే ॥నిదుర॥
పదము పదములో మధువులూరగా
పదము పదములో మధువులూరగా
కావ్యకన్యవై రావే! ॥ఏ దివిలో॥

బాలూ, జానకి, సత్యం కేరీర్‌లో విడివిడిగా ఓ ల్యాండ్‌మార్క్‌గా నిలిచిపోయిన గీతమిది. పీలూ రాగంపై ఆధారపడిన ఈ పాటను తొలుత 'గాంధీనగర్' అనే కన్నడ చిత్రం కోసం సత్యం గారు స్వరపరిచారు. పి.బి.శ్రీనివాస్, పి. సుశీల పాడారు. ఆ పాటను విన్న బాలూ గారు 'ఇలాంటి పాటను నేనెప్పుడు పాడతానోకదా!?' అని ఆ రోజుల్లో అనుకునేవారు. తెలుగులో పాడడానికి అవకాశం వచ్చినప్పుడు ఆల్మోస్ట్ ఎగిరిగంతేసినంత పని చేశారాయన. సినిమాలో ఈ పాట పూర్తవగానే ఆంధ్రాలోని చాలా థియేటర్లలో ప్రేక్షకులు ఎదురుగా ఉన్న ఓ ఫెర్ఫార్మెన్స్‌కి ప్రోత్సాహం ఇచ్చినట్టుగా కరతాళ ధ్వనులతో తమ హర్షాన్ని తెలియజేశారట.

**చిత్రం: అమరదీపం**
**రచన: ఆత్రేయ**
**గానం: బాలు, సుశీల**

అ: ఏ రాగమో యిది ఏ తాళమో
అనురాగానికి కనువైన శ్రుతి కలిపినామో
ఆ: ఏ రాగమో యిది ఏ తాళమో-
మన కళ్యాణ శుభవేళ మోగించు మేళమో
ఎదలో మెదిలే సంగతులన్ని
పలికెను సంగీతమై పలికెను సంగీతమై
అ: కలసిన కన్నుల మెరిసే కళలే
వెలసెను గమకములై వెలసెను గమకములై
ఆ: హొయలయిన నడకలే లయలైనవి
అ: చతురాడు నవ్వులే గతులయినవి
ఆ: సరి సరి అనగానే మరిమరి కొసరాడు
ఇ: మురిపాలే మన జంట స్వరమయినవి ॥ఏ రాగమో॥
అ: సిరికన్నె తనకు పరువమే కాదు
పరువూ కలదన్నదీ పరువూ కలదన్నదీ
ఆ: భ్రమరము తనకు అనుభవమే కాదు
అనుబంధముందన్నదీ అనుబంధముందన్నదీ
ఆ: కోకిలమ్మ గుండెకు గొంతున్నది
ఆ: కొమ్మలో దానికి గూడున్నది
అ: సరి మగవానికి సగమని తలపోయు
ఇద్దరు: మన జంట - కే - జంట సరి వున్నదీ ॥ఏ రాగమో॥

సినీ సంగీతంలో శుభపంతువరాళి రాగాన్ని చాలామంది శోక, విషాద, వేదనాపరమైన గీతాలకు మాత్రమే వాడడం జరిగేది. మాధవా మౌనమా సనాతనా (సత్యనారాయణ వ్రత మహాత్మ్యం), తనువు కెన్ని గాయాలైనా (ఆడబ్రతుకు), నవ్వలేక ఏడ్వాను ( ఒకే కుటుంబం)వంటి పాటలు మచ్చుకు కొన్ని. అటువంటి రాగంలో ఓ ప్రణయగీతాన్ని స్వరపరచటం నిజంగా ఓ చెప్పకోదగ్గ విశేషమే! ఈ పాటకు సత్యం ఉపయోగించింది ఆ రాగాన్నే! 'సరి మగవానికి సగమని తలపోయి' అంటూ స్వరాక్షరాలతో రచనా పరంగా ఆత్రేయచేసిన ప్రయోగాన్ని ట్యూన్ పరంగా శ్రోతలకు అందజేయటంలో సత్యం ప్రతిభను తెలియ జేస్తుందీ పాట.

**చిత్రం: గీత**
**రచన: జి.కె.మూర్తి**
**గానం: ఎస్.పి.బాలు**

పూచే పూలలోన వీచే గాలిలోన నీ అందమే దాగెనే
నీ అందెలే మ్రోగెనే ॥పూచే॥ ఓ చెలీ....ఓ చెలీ...
నా ఊహలో నీవు ఉయ్యాల లూగేవు
నా ఊహలో నీవు ఉయ్యాల లూగేవు
నా పూపిరై నీవు నాలోన సాగేవు
నీవు నా సర్వమె నీవు నా స్వర్గమె
నీవు నా సర్వమె నీవు నా స్వర్గమె
నీవు లేకున్న ఈ లోకమే శూన్యమే ॥పూచే॥
ఎన్నో జన్మల బంధము మనది
ఎవ్వరు ఏమన్న ఇది వీడనిది
ఎన్నో జన్మల బంధము మనది
ఎవ్వరు ఏమన్న ఇది వీడనిది
నీవు నా గానమే నీవు నా ధ్యానమె
నీవు నా గానమే నీవు నా ధ్యానమె
నీవు లేకున్న ఈ లోకమే శూన్యమే ॥పూచే॥

ఈ పాటకు ఆ రోజుల్లో విపరీతమైన క్రేజుండేది. ముఖ్యంగా కాలేజీ విద్యార్థులు, యూనివర్శిటీ విద్యార్థులు తెగ పాడేవారు. ఏ ఫిల్మ్ మ్యూజిక్ కాంపిటీషన్‌లోనైనా ఈ పాట ఎవరు పాడితే వారికే ఫస్ట్ ప్రయిజ్. అలా వుండేది! కొన్ని సినిమాలక్లో విలన్‌గా, కొన్ని సినిమాల్లో క్యారెక్టర్ ఆర్టిస్టుగా తర్వాత రోజుల్లో కనిపించిన నటుడు ప్రసాద్‌బాబు ఈ సినిమాలో హీరో! ఈ సినిమా బి.ఆర్.ఇశారా తీసిన 'చేతనా' అనే ఓ హిందీ చిత్రానికి రీమేక్. ఒరిజినల్ సినిమాలో ఉన్న పాట కన్నా ఎన్నో రెట్లు ఉన్నతంగా వుండే ట్యూన్‌ని సత్యం ఇచ్చారని - రెండు సినిమాలూ చూసిన వాళ్ళని తెలుస్తుంది. యమన్ రాగానికి మంచి ఉదహరణగా చెప్పకోదగ్గ గీతమిది.

# సత్యం హిట్స్

## చిత్రం: మట్టిలో మాణిక్యం
రచన: సి.నారాయణ రెడ్డి
గానం: ఎస్.పి.బాలు

రింఝిం రింఝిం హైదరబాద్
రిక్షావాలా జిందాబాద్
మూడు చక్రములు గిరగిర తిరిగితె
మోటరు కారు బలాదూర్ ॥రింఝిం॥
అటు చూస్తే చార్మినారు
ఇటుచూస్తే జామా మసీదు
ఆ వంక అసెంబ్లీ హాలు
ఈ వంక జూబిలి హాలు
తళతళ మెరిసే.... తళతళ మెరిసే హుసేనుసాగరు
దాటితె సికింద్రబాదూ ॥రింఝిం॥
ఒక తలపై రూమీటోపీ
ఒక తలపై గాంధీ టోపీ
'క్యా' భాయ్ అని అంటాడొకడు
'ఏమోయ్' అని అంటాడొకడు
మతాలు భాషలు వేరయినా...
మతాలు భాషలు వేరయినా
మనమంతా భాయీ భాయీ ॥రింఝిం॥
ఉన్నవాడికి తింటే అరగదు
లేనివాడికి తిండే దొరకదు
పరుపులున్నా పట్టదు నిదర
కరకునేలను గురకలు వినరా
హెచ్చుతగ్గులు తొలిగేరోజూ
హెచ్చుతగ్గులు తొలిగేరోజు
ఎప్పుడొస్తుందో ఏమో ॥రింఝిం॥

హైద్రాబాద్‌లోని విశేషాల గురించి సినారె మద్రాసులో కూర్చుని రాసిన పాటయిది. హైద్రాబాద్ అంతా ఆయనకు కొట్టిన పిండే కనుక అతి తక్కువ టైమ్‌లో రాసి నిర్మాణ బృందంతో శభాషనిపించుకున్నారు. 1970లో రిలీజైన హిందిసినిమా 'పెహచాన్' సినిమాలో శంకర్ జైకిషన్ సంగీత దర్శకత్వంలో ముఖేష్ పాడిన 'బస్ యహీ అపరాద్ మై హర్ బార్ కర్‌తా హు, ఆద్‌మీ హూ ఆద్‌మీ సేప్యార్ కర్ తా హూ' అనే పాట పాడేరు. ఆ పాటలో 'లు లు లూ లూ లు లు ' అనే హమ్మింగ్ ఒకటుంది. ఆ హమ్మింగ్‌ని ఈ 'రిమ్ జిమ్' పాటలోకి సత్యంగారు ఎంత చక్కగా అడాప్ట్ చేశారో రెండు పాటల్నీ విన్నవారికి తెలుస్తుంది.

## చిత్రం: సీతారాములు
రచన: దాసరి నారాయణరావు
గానం: ఎస్.పి.బాలు

తొలి సంజ వేళలో - తొలి పొద్దు పొడుపులో
తెలవారే తూరుపులో - వినిపించే రాగం భూపాలం
ఎగిరొచ్చే కెరటం సింధూరం ॥తొలి॥
జీవితమే రంగుల వలయం
దానికి ఆరంభం సూర్యుని ఉదయం ॥జీవితమే॥
గడిచే ప్రతి నిమిషం ఎదిగే ప్రతిబింబం
గడిచే ప్రతి నిమిషం ఎదిగే ప్రతిబింబం
వెదికే ప్రతి ఉదయం - దొరికే ఒక హృదయం
ఆ హృదయం సంధ్యారాగం - మేలు కొలిపే అనురాగం ॥తొలి॥
సాగరమె పొంగులనిలయం
దానికి ఆలయం సంధ్యా సమయం ॥సాగరమే॥
వచ్చే ప్రతి కెరటం చేరదు అది తీరం
వచ్చే ప్రతి కెరటం చేరదు అది తీరం
లేచే ప్రతి కెరటం అది అంటదు ఆకాశం
ఆ ఆకాశంలో ఒక మేఘం - మేలుకొలిపే అనురాగం ॥తొలి॥

తెలుగు సినీ సంగీతంలో భూపాల రాగంలో ఉన్న పాటలు చాలా తక్కువ. ఒక వేళ వున్నా చాలావరకు భక్తి గీతాలకు పరిమితమయిపోయాయి. భావుకతను ప్రతిబించిందే ఇటువంటి పాటలకు భూపాల రాగాన్ని ఉపయోగించడం సత్యం సాధించిన ఒక రికార్డు.

## చిత్రం: టక్కరిదొంగ చక్కని చుక్క
రచన: సి.నారాయణరెడ్డి
గానం: ఎస్.పి.బాలు

అ: ఓ చక్కని చుక్కా
ప: నడకలు చూస్తె మనసవుతుంది
సొగసులుచూస్తె మతిపోతుంది
ఓయబ్బో ఏమిసింగారం ఓయబ్బో లేత బంగారం
చ: చూడు యిటు చూడు పగవాడు కాదు జతగాడు
నవ్వు అర నవ్వు రతనాల పెదవిపై రువ్వు
చూడు యిటు చూడు పగవాడు కాదు జతగాడు
నవ్వు అర నవ్వు రతనాల పెదవిపై రువ్వు
ఒక కంట మంటలను కురిపించు
ఒక కంట మంటలను కురిపించు
ఒక కంట మల్లెలను మరిపించు
ఓయబ్బో ఏమి చెలి సొగసు
ఓయబ్బో ఏమి తలబిరుసు ॥నీ నడకలు॥
చ: ఊగి అటుసాగి ఒక నాగులాగ చెలరేగి
విసిరి అటు కసిరి తనువెల్ల చీకటులు ముసిరీ
ఊగి అటుసాగి ఒక నాగులాగ చెలరేగి
విసిరి అటు కసిరి తనువెల్ల చీకటులు ముసిరీ
యీ పూట నన్ను ద్వేషించేవు
యీ పూట నన్ను ద్వేషించేవు కానీ...
ఆ పైన నన్నె ప్రేమించేవు
ఓయబ్బో ఏమి ఆ విసురు
ఓయబ్బో యేమి ఆ మెరుపు॥2॥ ॥నీ నడకలు॥

బాలూ అంటే సత్యం గారికి ఎనలేని అభిమానం. పదిమందిలో వున్నప్పుడు 'బాలూగారూ' అనిపిలిచినా క్లోజ్ సర్కిల్స్‌లో వున్నప్పుడు 'కొడుకూ'అని పిలిచేవారు. బాలూ తొలి రోజుల్లోని హిట్స్ లో సత్యంగారి కాంట్రిబ్యూషన్ చాలా వుండేది. ఆ పాటలో - 'ఒక కంట మంటలను కురిపించు' అనే లైను దగ్గర బాలు కంఠం జీరపోయింది. ఆ పాట సుమారు 7 టేకులు పాడితే ఒకే ఒక టేకులో అలా జరిగింది. 'ఆ ఒక్కలైను తక్కిన బావున్న టేక్స్‌లోంచి తీసి జాయిన్ చేస్తాంలే' అని బాలూకి మాట ఇచ్చారు. కానీ - పొరపాటు ఎవరిదోగాని జీరపోయిన టేకులోని పాటే బైటకొచ్చేసింది. సత్యం గారికి బాలూ అంటే ఎంతో ప్రేమున్నా- మిగిలిన సాంకేతిక నిపుణలకు బాలూ పట్ల ఎంత స్నేహభావం వున్నా కొన్ని కొన్ని తప్పులు-ఎంత జాగ్రత్తగావున్నా- మనచెయ్యి దాటిపోతుంటాయనడానికి ఈ పాట ఉధాహరణ.

## చిత్రం: పుట్టినిల్లు - మెట్టినిల్లు
రచన: సి.నారాయణ రెడ్డి
గానం: ఎస్.పి.బాలు

ఇదే పాట - ప్రతీచోట ఇలాగే పాడుకుంటాను
పలుకలేని వలపులన్నీ పాటలో దాచుకుంటాను
నా పాట విని మురిశావు ఆ పైన నను వలచావు
కలలాగ నను వలచావు లతలాగ పెనవేశావు
ఇక గానమై ఒక ప్రాణమై జతగూడి మనమున్నాము ॥ఇదే॥
నాడేమి ఉందని భ్రమసేవు నేడేమి లేదని విడిచేవు
ఆ మూడుముళ్లను మరిచేవు నా పాల మనసును విరిచేవు
ఈనాడు నను విడనాడినా ఏ నాటికైనా కలిసేవు ॥ఇదే॥

1967లో శంకర్-జైకిషన్ సంగీత దర్శకత్వంలో 'అమన్'అనే ఓ సినిమా వచ్చింది. ఆ సినిమాలో రఫి పాడిన - ఆజ్‌కిరాత్ / ఎ కైసేరాత్/ కి హమ్‌కో నీంద్ నహి ఆతీ- అనే పాట చాలా పాపులర్. ఈ పాటకు నకలుగ 'మహాబలుడు'లో 'మగాడంటె మజావున్న'అనే పాట వచ్చింది. ఒక పాట తీసుకుని ఆ పాటప్రేరణతో పేర్లల్‌గా మరో పాట చెయ్యటంలో సత్యం గారు అఖండుడు. 'ఆజ్‌కిరాత్' పాట ట్యూన్‌ని పల్లవి వరకు ప్రేరణగ తీసుకుని అదే కట్స్‌తో వేరే ట్యూన్‌తో ఆయన చేసిన పాట- ఇదే పాట ప్రతీచోటా! ఈపాటకు సంబంధించిన ఇంకో విషయం ఏమిటంటే - తెరమీద శోభన్‌బాబు ఈ పాటను పాడుతుంటే అక్కడ ఆయన పాడే ఆ పాటను కండక్ట్‌చేసే వ్యక్తిగా సత్యంగారు (సూట్‌వేసుకుని) కనిపిస్తారు.

# మాస్కు చాటు మహానటి

**- రాజా**

యోగేశ్వరరావు కాఫీ తాగుతూ తన అవార్డులు అవీ చూసుకుంటూ మురిసిపోతూ ఉంటాడు.

ఫోన్ మోగుతుంది.

యోగే : (ఫోన్ ఎత్తి) హలో... నేనే యోగేశ్వర్రావునే... ఎవరూ... ఓరి నువ్వుట్రా జోగినాధం... ఏంటి విశేషాలూ....? దుర్వార్తా...!?

ఇన్‌కంటాక్స్ వాళ్లు రైడ్ చేస్తారా...? ఆఁ ... నా దగ్గరేం ఉందిరా.....నా బొంద! ఏడిసినట్టుంది! అవున్రా నటుడిగా పేరు సంపాదించుకున్నాను, దర్శకుడిగా కూడా నా టాలెంట్ ప్రూవ్ చేసుకోవాలనుకొన్నాను. నిర్మాత దొరక్క నేనే సిన్మా తీసుకుంటున్నాను. అంత మాత్రాన కట్టలకట్టలు నిలవ చేసేసినట్టేనా...? అలాగా.... అంతేనంటావా.... ఎలామరి....!? ఈ గండం తప్పించుకునే మార్గమే లేదంటావా... చెప్పరా బాబు చచ్చినీ కడుపున పుడతాను... ఆవిడ ఎవరూ... ఇన్‌కమ్‌టాక్స్ ఆఫీసరు భార్యకి అన్నకూతురా...

ఫోటోజెనిక్ ఫేసేనా... ఆ మాత్రం కూడా బావుండకపోతే హీరోయిన్‌గా ఎలా ఛాన్సివ్వమంటావురా...

అయినా బెదిరింపేమిట్ట? పోలీస్ కంప్లయింట్ ఇచ్చానంటే ఊచలెక్కట్టుకుంటాడు వెధవ...!

ఏంటి.... ఈ మధ్య పోలీసులు వాళ్ళక్కావలసిన వాళ్ళమీద ఎవరైన కంప్లైంట్ ఇస్తే కొత్తటైప్‌లో కంప్లైంట్‌ని విత్‌డ్రా చేసుకునేట్టు చేస్తున్నారా...

వామ్మో... ఈ టెక్నికెప్పుడు కనిపెట్టార్రా బాబూ... తప్ప దంటావా... అయితే ఓ పన్చేస్తా... ఆ అమ్మాయిని పంపించు... బావుంటే ఓకే... లేకపోతే ఎలాగోలా తనంతట తానే 'నాకీ వేషం వద్దు బాబోయ్' అనేట్టు చేస్తా... అందుకు ఓకేనా?

అబ్బే.... నీచ పాత్ర లివ్వనివ్వన్రా బాబూ... హీరోయిన్ వేషమే... పంపించు చెప్తా....

ఏంటీ నిన్ననే ఇచ్చావా నా అడ్రసు... వార్నీ...

అదిగోరా బెల్లు... ఇక ఉంటా...

(కాలింగ్ బెల్ మోగుతుంది. వెళ్ళి తలుపు తీస్తాడు.)

యోగే : ఎవరండీ...

పుపాజ : నన్ను... ఇన్‌కమ్‌టాక్స్ ఆఫీసరు వారి మిసెస్ పంపించారు... మీకింకా ఫోనేదీ రాలేదా?

యోగే : ఆ..ఆ.. వచ్చింది వచ్చింది... ఇప్పుడే ఆ ఫోన్ మాట్లాడి ఇలా తిరిగానో లేదో అలా మీరొచ్చేశారన్నమాట-ఎక్స్‌ప్రెస్ లాగ?

పుపాజ : అంతేనండి... ఫీలింగ్స్‌ని ఎక్స్‌ప్రెస్ చేయడం మీద ఆధారపడ్డ వాళ్లం కదా... ఎక్స్‌ప్రెస్ లాగే రావాలి.

యోగే : వామ్మో...

పుపాజ : ఇంతకీ మీరు ప్రయోగేశ్వరావుగారే కదూ?

యోగే : నా పేరు యోగేశ్వర్రావు మాత్రమేనండీ... ఇంటిపేరు మాత్రం ప్రతిభండి. అందరూ ప్రతిభా యోగేశ్వరరావు అంటారు మరి. మీరేంటి నా పేరుని అలా రిపేరు చేసేశారు?

పుపాజ : నన్ను హీరోయిన్‌గా పరిచయం చేస్తూ ప్రయోగం చేయబోతున్నారు కదండీ అందుకే మీ ఇంటిపేరు ప్రతిభలో మొదటి అక్షరాన్ని - మీ ఇంటి పేరైన యోగేశ్వరరావుతో కలిపి ప్రయోగేశ్వరావు అని నేనే మీకు పేరు పెట్టేశా.

యోగే : ఆహా! సాధారణంగా కొత్తగా పరిచయం చేసేటప్పుడు హీరోయిన్‌లకి డైరెక్టర్లు పేర్లు పెడ తారు. ఇది ఇట్నించి అటు! ఏం చేస్తాం.... ఇన్‌కమ్‌టాక్స్ ఇన్‌ఫ్లుయెన్స్...

ఇంతకీ మీకు యాక్టింగ్‌లో ఏమైనా అనుభవం...!?

పుపాజ : ఆ... ఆ విషయంలో మీరేం భయపడక్కర్లేదండీ మీరు శంకరాభరణం చూశారా...?

యోగే : చూశా.

పుపాజ : అందులో శంకరశాస్త్రి ఇంటిని ముట్టుకుంటే 'జెయ్యి' మంటూ నాదం వస్తుంది చూడండీ మా ఇంట్లో ఎవర్నయినా సరే ఇలా టచ్ చేస్తే చాలు అలా రాలుతుంది నటన...

యోగే : అలాగా!?

పుపాజ : ఏమైనా యాక్ట్ చేసి చూపించమంటారా?

యోగే : అవునండి... ఓ చిన్న డైలాగు... జస్ట్... జడ్జిమెంటు కోసం... అంతే...

పుపాజ : ఆ... నా దగ్గర ఇమ్మిడియట్‌గా స్క్రిప్ట్‌లేవీ లేవు... మీరేవన్నా ఇస్తారా...

యోగే : ఎందుకివ్వనండీ... ఇదిగో... ఇది చూసి చెప్పండి.



పుపాజ : ఓకేనండి...

**'ఏవండీ... ఎంత మాటన్నారండీ దయచేసి ఇంకెప్పుడూ అలా అనకండి. ఇది గనుక సీత వింటే ఆమె తల ఢిల్లీ పోతుంది తెలుసా?'**

యోగే : ఒక్క నిముషం... ఒక్క నిముషం... ఏంటన్నారు... తల ఢిల్లీ పోవటమా... తల ఢిల్లీ పోదు, కలకత్తా పోదు తల్లీ, అది తల్లడిల్లి పోవటం.

పుపాజ : పాండిసార్ ఇవన్నీ నటించేవాళ్ళు పట్టించుకుంటే డబ్బింగ్ ఆర్టిస్టులు ఎలా బ్రతుకుతారు?

యోగే : వామ్మో... డబ్బింగ్ గురించి కూడా తెలుసా? చచ్చాంపో.

పుపాజ : అవునండీ... హీరోయిన్‌లు ఇలాంటివేవీ పట్టించుకోకూడదు. వీలైనప్పుడల్లా యాపిల్ జ్యూస్‌లు తాగాలి. ఎంతొస్తే అంతే చెయ్యాలి. నోరు తిరక్కపోతే ముద్దు ముద్దుగానే మాట్లాడాలి. జనం కూడా అదే లైక్ చేస్తారట.

పుపాజ : ఇందులో ఉన్నట్టే చేశా కదండీ....

యోగే : చేశారండీ... కానీ ఆ 'కెవ్' సౌండేంటీ అని...!?

పుపాజ : అదా స్క్రిప్టులో ఉన్నదే కదండీ... తండ్రి ముఖంలోకి చూసి '**కెవ్ మనును**' అని రాశారు. అలాగే చేశాను. ఏం తప్పా అండీ?

యోగే : అబ్బే మీది తప్పు ఎందుకు అవుతుందండీ... ఈ స్క్రిప్ట్ రాశాడు చూడండీ... వాడిది... వాడిది... తప్పంతాను.

పుపాజ : అలా చెప్పండి... నేను ముందే అనుకున్నాను నేను తప్పు చెయ్యటం ఏంటా అని.



యోగే : వోరినాయనో... ఫీల్డుకి రాకముందే ఇంత నాలెడ్జ్ సంపాదించేస్తే ఎలా అండీ... అయినా ఇవన్నీ ఎవరు చెప్పారు మీకు.

పుపాజ : నాకెవ్వరు చెప్పలేదండీ... షూటింగ్ చూసి తెల్సుకున్నా...

యోగే : పోన్లెండమ్మా... డైలాగ్ పార్ట్ ఒదిలేయండి... యాక్షన్ పార్ట్‌కొద్దాం... ఇదిగో ఈ స్క్రిప్ట్ చదివి కనీసం యాక్టింగైనా చేసి చూపించండి చూద్దాం...

పుపాజ : ఆఁ... ఆఁ.... ఓకే ఇందులో రాసి ఉన్న ప్రకారం మీరు తండ్రి - నేను కూతురు అనుకుందాం... మీ కాళ్ళ మీద పడి, లేచి, మీ ముఖం చూసి అందులో ఉన్నట్లు చెయ్యాలి అంతే కదా.

యోగే : అంతేనండి.

పుపాజ : సరే చూడండి...

..... **కెవ్వ్వ్వ్వ్వ్**

యోగే : అదేంటమ్మా ఆ సౌండేంటి

యోగే : వామ్మో... ఇంత కాన్ఫిడెన్స్ అయితే ఎలా తల్లోవ్ (తనలో)

పుపాజ : అవునండీ... యాక్టింగ్ నా బ్లడ్‌లోనే ఉంది.

యోగే : ఆహా!? ఎప్పుడు చేయించుకున్నారు బ్లడ్ టెస్ట్?

పుపాజ : ఛ... ఊరుకోండి పిచ్చి జోకులూ మీరునూ... మొత్తానికి డైరెక్టరనిపించు కున్నారు...

యోగే : ఖర్మ

పుపాజ : ఖర్మ కాదండీ నిజం... మా నాన్న గారు చాలా మంచి నటులు. ఇప్పుడు కాదు గానీ అయిన చిన్నప్పుడైతే ఇంట్లో సినిమా పోస్టర్ల ఫోటోలు అవీ పెట్టి పూజ చేస్తూ వాళ్ళని బ్రహ్మాండంగా ఇమిటేట్ చేస్తూ ఉండేవారట... మీకు తెలీదా?

యోగే : అబ్బే... నేను బొత్తిగా అజ్ఞానుణ్ణి తల్లీ! ఫీల్డులో ఉన్నానన్నమాటే గాని కొంతమంది మహానుభావుల జీవితచరిత్రలే తెలీవు నాకు

పుపాజ : ఇలా నిజం ఒప్పుకున్న వాళ్ళంటే నాకెంత ఇష్టమో.

యోగే : (వెటకారంగా) చాలాథాంక్సండీ...నేనూహించని లెవల్లో నన్ను పొగిడినవాళ్ళు ఇప్పటిదాకా నాకు ఎదురుకాలేదంటే నమ్మండి. ఇంతకీ మీరు మీ నాన్నగారి పోలికంటారు...అమ్మగారి పోలికలేవీ లేవంటారా...!?

పుపాజ : అదెలా...నేను పుట్టగానే మా అమ్మ చనిపోయిందిగా ఇంకా ఆవిడ పోలికలెలా వస్తాయి నాకు?

యోగే : హుఁ... బతికుంటేనే పోలికలు వస్తాయన్నమాట చనిపోతే రావన్నమాట.... ఇలాంటి గొప్ప గొప్ప విషయాలు ఇంకెన్ని తెలుసుకోవాలో

పుపాజ : కరెక్ట్ ఇంకో విషయం కూడా తెలుసుకోవాలి మీరు

యోగే : ఏంటో అది

పుపాజ : చిన్నప్పట్నించి నేను తాగి పెరిగిన

పాలలోనే ఉంది నటన...

యోగే : ఒక్క మీరేంటండీ... ప్రపంచం మొత్తం ప్రజలు తాగుతున్న పాలలో సగానికి సగం నీళ్ళే కదండీ...

పుపాజ : అబ్బ... నేనంటున్నది కల్తీ పాల గురించి కాదండీ... నేను తాగిన పాలు-నటనను జీర్ణించుకుని రంగరించుకొని ఇవ్వగా పితికిన పాలండీ.

యోగే : ఏవండీ ఇంతవరకు మీరు చెప్పినవన్నీ ఎలాగోలా అర్థం చేసుకోగలిగాను. ఇది మాత్రం నా వల్ల కావటం లేదంటే నమ్మండి...

పుపాజ : సరే... చెప్తా వినండి... మాకు పాలుపోసే పాలమ్మాయి తన దగ్గర ఉన్న ఆవులకి, గేదెలకి ఓ విచిత్రమైన అలవాటుచేసిందండీ...గొప్పగొప్ప నటీనటులు నటించిన గొప్పగొప్ప సినిమాల వి.సి.డి.లు చూపిస్తూ పాలు పితికేది. అలాటి పాలు తాగి పెరిగానన్న మాట నేను...

యోగే : అందుకని మీ అణువణువులో నటన తాండవిస్తోందంటారు.

పుపాజ : కరెక్ట్... ఇప్పటికర్థం చేసుకున్నారు ఈ పుపాజాని.

యోగే : పుపాజా... అదేంటి?

పుపాజ : అది నా పేరండి

యోగే : పేరా... ఇంద్రజ విన్నా(ను) పాకీజా విన్నా(ను) ఈ పుపాజా ఏంటీ..

పుపాజ : పు... పా... జ... అంటే పురాణ పాత్రల కోసం జన్మించినదీ అని అర్థం...

యోగే : ఆహో... ఓహో... యోగేశ్వర్రావ్... నీజన్మ ధన్యం... నీ బ్రతుకు చరితార్థం...

పుపాజ : ఏంట్సార్... ఏదో అంటున్నారు.

యోగే : అవునమ్మా... మీలాగ పురాణ చిత్రాల కోసం జన్మించిన వారి గురించే నా అన్వేషణ... అది ఇన్నాళ్ళకి ఫలించింది.

పుపాజ : కరెక్ట్‌గా అన్నారండీ... పౌరాణిక పాత్రలు మాత్రమే ధరించి - యన్.టి.ఆర్.లా, కె.ఆర్.విజయలా పేరు తెచ్చుకోవడమే నా లక్ష్యం, ఆశయం, కర్తవ్యం.

యోగే : అదృష్టం-ఏమిటో... నేనిప్పుడు తీస్తున్న చిత్రం కూడా పౌరాణికమే... అందులో హీరోయిన్ మీరే!

పుపాజ : అబ్బ... ఎంతమంచి మాట చెప్పేరండీ... ఇంతకీ ఏంటండీ ఆ సినిమా..?

యోగే : అదేనండీ వాలి-సుగ్రీవ కథ. అందులో హీరోయిను వాలి భార్య తార. ఆ పాత్ర కనుక మీరు వేస్తే తారాపథంలో మినుకుమినటం ఖాయం.

పుపాజ : థాంక్సండీ... మీ మేలు ఈ జన్మలో మర్చిపోలేను.

యోగే : మరేం ఫర్లేదమ్మా... కాకపోతే మీరు నన్ను ప్రయోగేశ్వరరావు అని పిలిచారు కాబట్టి మీరు కూడా పాత్రల కోసమే పుట్టారు కాబట్టి ఓ ప్రయోగం చేద్దాం అనుకుంటున్నాను.

పుపాజ : ఏంటండీ అది?

యోగే : మన తెలుగు వాళ్ల పురాణాలు అవీ అద్భుతంగా తీస్తారు. కాని ఓ చిన్న విషయంలో మిస్టేక్ చేస్తున్నారండీ... దాన్ని నేను సవరించాలను కుంటున్నాను.

పుపాజ : ఏంటండీ అది?

యోగే : మీరు గమనించారో లేదో ఈ రామాయణానికి సంబంధించిన సినిమాల్లో వాలి సుగ్రీవుల్ని, వారి సైన్యాన్ని చూపించినపుడు వెనక తోకలు, ముందుకి ముఖాన మాస్క్‌లు అవీ పెట్టి చూపిస్తారు.

పుపాజ : అవును.

యోగే : అవునా... మరి వారి భార్యలని చూపించినపుడు మాత్రం మంచిగా మామూలు మనుషుల్లా చూపిస్తారు. ఇది తప్పుకాదూ...

పుపాజ : తప్పులాగే ఉందండీ...

యోగే : ఉంది కదా... అందుకే నేను తియ్యబోయే సినిమాలో ఆడవాళ్ళకి కూడా తోకలు, మాస్క్‌లు పెడదాం అనుకుంటున్నా...

పుపాజ : అంటే హీరోయిన్‌కి కూడానా అండీ.

యోగే : అయ్యో... హీరోయినే మెయిన్ కదండీ...డైరెక్టర్ చెప్పాలనుకున్నది ఎస్టాబ్లిష్ అవాలంటే హీరోయినే కదా మెయిను...

పుపాజ : అంటే... నేను... తోక, మాస్కు...

యోగే : ఓ... బ్రహ్మాండంగా ఉంటుందండీ... అదుర్స్..

పుపాజ : వద్దండీ... బావుండదండీ...

యోగే : భలేవాళ్ళండీ... ఇంతా విని ఇప్పుడు బావుండదంటారా పైగా పురాణ పాత్రల కోసం జన్మించి... ఏం ఫరవా లేదండీ... కావాలంటే గ్లామర్ మాస్కు, గ్లామర్ తోక తెప్పిస్తానండీ... 'భారతీయుడు','భామనే సత్యభామనే' సినిమాల్లో కమల్‌హాసన్‌కి మేకప్ చేసినతన్ని కూడా రప్పిస్తానండి ఫారిన్నుంచి....

పుపాజ : ఏవండీ ఒద్దండీ... ప్లీజండి.

యోగే : అబ్బెబ్బెబ్బె... ఇంకేం మాట్లాడకండి... మీరే మా హీరోయిను... అంతే... మనం తీస్తున్నాం... అదరగొట్టెయ్య బోతున్నాం... అంతే

పుపాజ : ఏవండీ ఒక్కసారి కళ్ళు మూసుకుంటారా.

యోగే : ఏం ఇప్పుడే... ఇక్కడే... మేకప్ చేసేసుకుని చూపిస్తారా... నాకేం అబ్జక్షన్ లేదు.(కళ్లు మూసుకుంటాడు)

(పుపాజ మాయం అయిపోతుంది)

యోగే : పుపాజ గారూ.. పుపాజ గారు? నాకు తెలుసనండీ మీరు మాయం అయిపోతారని...

ఒరే జోగినాధం... ఏవనుకున్నావురా యోగేశ్వర్రావ్ అంటే... ఇంకెప్పుడూ ఇలాంటి రికమండేషన్లు పంపక... ◆



### కళా పోషకుడూ-కళాకారుడూ.. జగన్మోహనుడూ...

# శ్రీ శ్రీ శ్రీ ఆనంద గజపతి మహారాజా!

**(1850-1897)**



శ్రీకృష్ణదేవరాయల పేరు ఎత్తగానే మనకి అష్టదిగ్గజాలు గుర్తొచ్చి ప్రబంధ పరిమళాల్తో మనసంతా హాయి అనిపిస్తుంది...

అలాగే భోజమహారాజు పేరెత్తగానే... కవికుల గురువు కాళిదాసు స్ఫురణకొచ్చీ... ఉజ్జయినీ నగరంలోని మహాకాళేశ్వరుడి మందిరంలో ఊదిన శంఖధ్వని... గుండెల్లో ప్రతిధ్వనిస్తుంది.

అలాగే ప్రభువులకీ-కళాకారులకీ విడదీయలేని అనుబంధం. ఆ అనుబంధాన్ని... అందమైన మైత్రిగా మల్చుకున్న ప్రాతఃస్మరణీయుడు ఆనంద గజపతి మహారాజా...

ఆ వందిరిని ఆసరా చేసుకుని ఎన్ని మల్లెలు-మొల్లలు, సంపెంగలు... సన్నజాజులు తమ కళాసౌరభాన్ని అన్ని దిశలా విస్తరింపజేసాయో...

డ్యూక్ ఆఫ్ బంకింగ్‌హామ్ వంటి పాశ్చాత్యుల చేత ప్రిన్స్‌చార్మింగ్ (జగన్మోహనుడు)గా పేరొందినవాడు ఆనంద గజపతి...

అసలా పేరులో లాలిత్యంతో కూడిన గాంభీర్యం కనిపిస్తుంది

గురజాడ అప్పారావుగారన్నట్లు "He is a great scholar who has attracted to his court literary stars of the first magnitude"

నిజంగా అతిశయోక్తి కాదు గానీ... అరవై నాలుగు కళల్లో ఏ కళలో ప్రావీణ్యం ఉన్నా సరే ఆనందగజపతుల వారి ఆస్థానంలో బతుకంతా హాయిగా గడిచిపోయేది. అంతటి రసికుడాయన... ఇటు కర్ణాటక సంగీతంతో బాటు-అటు హిందుస్థానీ సంగీతం మీద కూడా మోజు పెంచుకునీ...

వీణవెంకట రమణదాసు, దూర్వాసుల సోమయాజులు వంటి వారితో పాటు... ఉస్తాద్ మహబత్‌ఖాన్-ఉస్తాద్ నిషావల్లీ అబీదుల్లా-మనవ్వర్ ఖాన్‌లను ఆస్థాన విద్వాంసులుగా ఆదరించాడు...

ఇక ఆయన స్వయంగా... వీణ, సితార్ వాయించడంలో ప్రవీణులు... తెలుగులో ఎన్నో జావళీలు, స్వరజతులు, తానవర్ణాలు రాశారు. ధ్రుపద్ ఖయాల్, తిల్లానా వంటి వాటిల్లో ఆనందగజపతి ప్రతిభ అమోఘం! ఆనంద గజపతి గారి పత్ని శ్రీమతి వనకుమారీదేవి పేరున తచ్చూరి సింగరాచార్య సోదరులు రాసిన రచనలని రాజావారే ముద్రింపించారు. అలాగే పూనా గాయక సయాజ్ శాఖకు... అప్పట్లో ఆరువేల రూపాయలు బహుమానంగా ఇచ్చారు.

ముందే చెప్పినట్లు ఈ 'జగన్మోహనుడి' రూపం చూసే వాళ్ళందర్నీ కట్టిపడేసేది... అందువల్ల వొచ్చిన చిరు అహంకారం ఆనందగజపతుల వారికి అలంకారంగా భాసించేది.

ఆ కాలంలో రాజనర్తకీమణులూ. దేవాలయాల్లో దేవదాసీలుగా జీవిస్తున్న వారి మీద రాజా వారికి సానుభూతి ఉండేది.

అంచేత వేశ్యవృత్తికి తిలోదకాలిచ్చీ... ఆత్మ గౌరవాన్ని కలిగించే లలిత కళల్ని నేర్చుకోమని ఎంతో మందిని ప్రోత్సహించారు.

అందులో చాలా మంది మహారాజా గారి సలహా పాటించి లలిత కళల్లో నిష్ణాతులై... అటు డబ్బూ... ఇటు కీర్తి కూడా సంపాదించి తమ మార్గనిర్దేశకుడైన ఆనందగజపతి వారి ఫోటోకి దీపం పెట్టుకుంటూ బతికారు.

ఆనంద గజపతుల వారి వారసులు నిర్మించిన విజయనగరం సంగీత కళాశాలకి ఓ చరిత్ర ఉందది... అదేంటంటే...

రాజా వారి ఆంతరంగిక కార్యదర్శి చాగంటి జోగారావు. రాజావారు, జోగారావు గారు... సాయంత్రాల పూట వ్యాహ్యాళికి బయలుదేరి పిచ్చాపాటి మాట్లాడుకుంటున్న సందర్భంలో

"జోగారావుగారూ మీ అబ్బాయేంచేస్తున్నాడయ్యా?"

"..................."

"జోగారావు గారూ మిమ్మల్నే...."

కళ్లనిండా నీళ్లు కక్కుకున్నాడు జోగారావు గారు.




"అదేమిటండీ... ఏవయిందీ..."

"వాడు పుట్టు గుడ్డి బాబూ... ఏమి చేయలేని అసమర్థుడు"

రాజావారి కడుపులో చెయ్యెట్టి దేవినట్టయింది"

చాలానొచ్చుకున్నారు...

"ఓ పన్జేస్తే... మీవాడికి సంగీతమేమన్నా నేర్పిస్తే"

"నేర్పిస్తే ఏదో కాలక్షేపంగా ఉండొచ్చు..." నసిగారు జోగారావు గారు...

"కాలక్షేపం కాదండీ... జీవనభృతి... అపారమైన కీర్తీనూ..."

సరే వెంటనే... ఫలానాచోట... సంగీత కళాశాల నిర్మిద్దాం...

"మా ఒక్క కుర్రాడి కోసం-కళాశాలా..."

"ఏమోనండీ ఏది ఎలా జరగాలో అలాగే జరుగుతుందీ.. ఈ విజయనగరం సంగీత కళాశాలకి మీ వాడి వల్ల బీజం పడాలని రాసుందీ... జరిగింది!"

అంతే... చాగంటి జోగారావుగారు పాదాల మీద పడిపోయారు. రాజా వారు అతణ్ణి లేపి అక్కున చేర్చుకుంటూ... 'ఇది నా అదృష్టమండీ... మీ పిల్లాడికి కళ్లు లేకపోవడం వల్ల నాకు ఈ కోణంలో కళ్లు తెరుచుకున్నాయ్..."

అక్కణ్ణించీ... ఆంధ్రదేశమంతా ఓ వెలుగు వెలిగింది. విజయనగరం సంగీత కళాశాల... వందమంది సంగీతకారులు అందులోంచి వచ్చారు. శ్రీ ఆదిభట్ల నారాయణదాసుగారు ద్వారం వెంకటస్వామి నాయుడు గారు... ఘంటసాల వెంకటేశ్వరావు గారు... ఎస్.జానకి... ఎన్నో వేలమంది...

ఆనందగజపతి మహారాజావారి విద్యా వైదుష్యాల గురించి పుంభావ సరస్వతి ఆదిభట్ల నారాయణ దాసు గారిలా రాశారు. "రాజావారి

ఆస్థానంలో ఒకడు రోజురోజంతా సభ దద్దరిల్లిపోయేలా రాగాలాపన చేస్తాడు. మరొకడు ఫిడేలు మీద విచిత్ర వర్ణాలు వాయిస్తాడు... ఒకడు మృదంగం మీద ఇంద్ర ధనుస్సుల్ని సృష్టిస్తాడు... మరొకడు వీణ మీద రాగంతో పాటు సువాసనలు కూడా పుట్టిస్తాడు... ఒకరు కవిత్వం, ఒకరు సాముగరిడీ, మరొకరు రుద్రవీణ, మరొకరు రుద్ర తాండవం...

ఇన్నెందుకూ... ఆనందగజపతుల వారి సభ ముందు... ఇంద్రసభ దిగదుడుపు...

ఆనందగజపతీంద్రుని
కే నరులున్ సాటిగాంచ రీవిన్, శీవిన్
గానకవిత ప్రవీణత
ధీ, నయ బలరూప సంగతిన్, పితృభక్తిన్.

ఎన్నో రచనలు చేసిన ఆనంద గజపతి మహరాజా వారి ఒకే ఒక తాన వర్ణం మాత్రం లభ్యమయింది...

తాన వర్ణానికున్న లక్షణాన్ని బట్టి-సాహిత్యానికి చాలా ప్రాధాన్యత ఉండీ... రాగ ప్రాధాన్యం గానూ... రాగాన్ని తానయుతంగా పాడుకోడానికి వీలుంటుంది!.

ధన్యాసి రాగం-ఖండజాతి ఆది తాళంలో అమ్మవారి మీద సంస్కృతంలో రాసిన-

దేవిత్వం యదధిరనుపశ్యతి
నన్యల్పువ్యశ్యతి-

చరణం మాత్రం'కైవల్యదాయినీ ' అన్న ఏకపద వాక్యం.

తన సంస్థానాన్ని మరో 'భువన విజయం'లా తయారు చేసిన ఆనందగజపతి... ఆంధ్ర ప్రజలకి ఆచంద్రతారార్కంగా గుర్తుండిపోతారు.

-తనికెళ్ళ భరణి



1-15 డిసెంబరు హాసంలో మీ వ్యాసం షారుపలల్లి వారి సంగీత వైభవాన్ని సాక్షాత్కరింప జేసింది. అంతకు ముందు సంచికలు బాపన్న శాస్త్రి గారి పై మీ వ్యాసం చదివాక వారి 'గురుపరంపర' స్ఫురణకు వచ్చి మది పులకించింది. బాల మురళీగారికి రాజమహేంద్రవరంలో సన్మానం జరిగిన సంధర్భంగా మా నాన్నగారు, కళా ప్రపూర్ణ మధునా పంతుల వారు రచించిన ఒక చిన్న పద్యం గుర్తుకు వచ్చింది.

'విశ్వమున రామ గానంపు విత్తు చల్లి 'ఆకు మళ్ల' నుబెంచె త్యాగయ్య కృతులు పొలము పండించే 'దక్షిణామూర్తి' పాట 'పారుపల్లి' కోసి 'మురళి' లో పంటలోసి' త్యాగరాజు, ఆకుమళ్ల వెంకటసుబ్బయ్య గారు సుగర్ల దక్షిణామూర్తిగారు, పారుపల్లి రామకృష్ణయ్య పంతులు గారు మంగళంపల్లి బాల మురళీకృష్ణ...

ఇలా ఆ సంగీత మూర్తులను ఈ చ్ని కవితలో మధునా పంతుల వారు ఆవిష్కరించిన తీరు మీ వ్యాసం చదివాక జ్ఞప్తిలోకి వచ్చింది. కృతజ్ఞతలు -

భవదీయులు
మధునామూర్తి
సీనియర్ సబ్ ఎడిటర్,
ఆంధ్రప్రభ/ విశాఖ పట్నం.

హాసం 1-15 నవంబర్ 2002 సంచికలో శ్రీ ద్వారం 'వెంకటస్వామి నాయుడు గారి'పై మీ వ్యాసం ఆయనగారి బిల్హరి రాగాలాపన వింటున్నట్లనిపించి మళ్లీ మళ్లీ చదివాను. వీలైతే మళ్లీ ప్రింటు చేయమని 'హాసం' ను అడగండి. (ఆర్టు పేపరు మీద)

భవదీయ
ఎల్. వెంకటేశ్వర్లు.

(డాక్టర్ సి.విజయలక్ష్మిగారు రచించిన 'ఆంధ్రప్రదేశ్ సంస్థానాలు-సంగీత వాఙ్మయం' చదివి, స్పందించి)

-భరణి

ఈ వ్యాసంపై అభిప్రాయాన్ని
శ్రీ తనికెళ్ల భరణికి తెలియజేయదలుచుకునే
వారు
**తనికెళ్ల భరణి**
కేరాఫ్: "హాసం", 502,
శ్రీబాలాజీ నిలయం,
13-1-212, మోతీనగర్,
హైదరాబాదు-500 018.
అడ్రసుకు ఉత్తరాలు పంపాలి.

## ఘంటసాల పై సమీక్షావ్యాసాలకు ఆహ్వానం

తెలుగు శ్రోతలు అమితంగా అభిమానించి ఆరాధించే శ్రీ ఘంటసాలకు గాయకుడిగా, సంగీత దర్శకుడిగా రెండు పార్శ్వాలున్నాయి. ఈ రెండింటిపై సమగ్రమైన తులనాత్మక సమీక్షను / పరిశోధనను శ్రీ ఘంటసాల సంగీత సంస్మరణ కళాపీఠం (మచిలీపట్టణం) వారు అభిలాషిస్తూ రచయితలకు సాదరపూర్వక ఆహ్వానం అందిస్తున్నారు.

గాయకుడిగా శ్రీ ఘంటసాల వేల సంఖ్యలో ఎన్నెన్నో రీతుల్లో గతుల్లో పాడారు. చలన చిత్రాలకు, ఆకాశవాణికి, ప్రైవేటు రికార్డులకై వివిధరసాలలో, వివిధ భావాలలో పాడి నేపథ్యగానకళలో అద్భుత విజయాలను సాధించారు.

సంగీత దర్శకుడిగా 100 కి పైగా సాంఘిక/పౌరాణిక/జానపద/ఐతిహాసిక చిత్రాలకు, ప్రైవేటు రికార్డులకు సంగీతం సమకూర్చి వివిధ స్వరధర్మాలు కలిగిన గాయనీ గాయకుల గళ పటిమను శ్రోతలకు చవిచూపారు. ఈనాటికీ అవి వన్నె చెడని స్వరపారిజాతాలే.

పై రెండు విభాగాల్లో శ్రీ ఘంటసాల కనబరిచిన ప్రజ్ఞా పాటవాల్ని దేనికదే ప్రత్యేక ప్రకరణంగా వింగడిస్తూ, సంబంధిత కోణాలన్నిటినీ సహేతుకంగా పరామర్శిస్తూ - సోదాహరణ పూర్వక విశ్లేషణతో పై రెండు అంశాల మీద విడివిడిగా వ్యాసాలు వ్రాసి మాకు పంపగోరుతున్నాము. న్యాయ నిర్ణేతలు ఎంపికచేసిన వ్యాసాలకు చెరొక రూ॥1000/-ల వంతున నగదు పారితోషికాన్ని అందజేయడం జరుగుతుంది. వ్యాసాలు పంపవలసిన ఆఖరితేదీ ఏప్రిల్ 30, 2003.

రచయితలు పాటించవలసిన నియమనిబంధనల సమాచారం కొరకు సరిపడా తపాలా బిళ్లలు అతికించిన స్వంత చిరునామా కవరుతో జనవరి 31 లోపున పంపవలసిన చిరునామా -

correspondent, S.G.S.S.Kalapeetham, FF-1, 23-30-6, Sri Sai Residency, Kanakaraju Street, S.N.Puram, Vijayawada-520011

# పద్మనాభం ఆత్మకథ



## సీరియల్ 8

సినిమా నిర్మాణం అంటే ధైర్యం వచ్చింది. తరువాతి ప్రయత్నంగా ప్రఖ్యాత నాటక రచయిత, మాటల రచయిత, హాస్యబ్రహ్మ భమిడిపాటి కామేశ్వరరావు గారి కుమారుడు, 'కీర్తి శేషులు' నాటకం ద్వారా సుప్రసిద్ధుడు అయిన శ్రీ భమిడిపాటి రాధాకృష్ణగారి 'ఇదేమిటి' నాటకం ఎంచుకున్నాం. నేను ఆ నాటకప్రదర్శనను మద్రాసులోని వాణీమహల్‌లో చూశాను. నాకు బాగా నచ్చింది.



రాజమండ్రిలో 'దేవత' 50 రోజుల ఫంక్షన్‌లో రాధాకృష్ణ వచ్చి కలిశారు. అది ఆయన స్వంతవూరు. మాటలు జరిగాయి. కొద్ది మార్పులు చేసి దాన్ని 'పొట్టి ప్లీడర్' సినిమాగా తీశాం. సంభాషణలు రాధాకృష్ణగారే వ్రాశారు.

నేను ప్రధాన పాత్ర ధరిస్తూనే శోభన్‌బాబు, గీతాంజలిలను రొమాంటిక్ పెయిర్‌గా అవకాశంవిచ్చాం. నాకు జోడీగా వాణిశ్రీ నటించింది. 'దేవత'కు దర్శకత్వం వహించిన హేమాంబరధరరావు గారే 'పొట్టిప్లీడరు'కు కూడా దర్శకులు.

ఈ సినిమా కూడా బాగానే పోయింది.విజయవాడలో వందరోజుల వేడుక చేశాం. ఆ సందర్భంగా ఆడంబరంగా ఖర్చు పెట్టకుండా గాంధీనగర్‌లో వాణీ ఫిలింస్ ఆవరణలో అన్నదానం చేశాం. అందరూ సంతోషించారు.

వ్యక్తిగతంగా నిరాడంబరంగా ఉండడమే నచ్చుతుంది నాకు. 1946లో గాంధీగారు మద్రాసు వచ్చారు. అప్పుడు ఆ మహనీయుణ్ని స్వయంగా చూశాను. నిరాడంబరంగా జీవితాన్ని గడపడంలో ఆయన స్ఫూర్తి నాకు ఎంతోవుంది. ఆయన్నే కాదు, జవహర్‌లాల్ నెహ్రూగారిని, బాబూ రాజేంద్రప్రసాద్ గారిని, ఇంకా ఎందరో రాజకీయ దిగ్గజాలను చూడడం, కొంతమందితో పరిచయం ఏర్పడడం జరిగింది.

అన్నదానం చేయడం వెనుక ఒక పరమార్థం ఉంది. నిర్మాణ సంస్థ



దర్శకుడు హేమాంబరధరరావు



మరుపురాని బాణీ కూర్చిన కోదండపాణి

'దేవత'లో శ్రీ ఘంటసాల గారు పాడిన 'బొమ్మను చేసి' ఎంతో పాపులర్ అయింది. వీటూరి గారు రెండు పల్లవులు రాశారు.

ఒకటి- నవ్వలేవు ఏడ్వలేవు  
ఓడిపోయా వోయ్ మేధావి,  
నవ్వించువాడు, ఏడ్పించువాడు  
వున్నాడు వేరే మాయావి

రెండు- బొమ్మను చేసి ప్రాణము పోసి  
ఆడేవు నీకిది వేడుక,  
గారడి చేసి గుండెను కోసి  
నవ్వేవు ఈ వింత చాలిక

దాని తరువాత చరణాలు రాయాలి. మొదటి పల్లవిలో డబ్బింగు ఛాయలు వున్నాయి. రెండవ పల్లవి సెలక్టు చేశాం. చరణాలు వ్రాయడం మిగిలింది. కానీ 20 రోజులు అయినా చరణాలు రాయలేకపోయారు శ్రీ వీటూరి. అప్పుడు శ్రీశ్రీ గారిని కలిసి పల్లవి వినిపించి చరణాలు రాయమన్నాము. రెండు రోజుల్లోనే చరణాలు రాశారు శ్రీశ్రీ.

అందాలు సృష్టించినావు దయతో నీవు  
మరల నీ చేతితో నీవే తుడిచేవులే  
అనురాగ మధువు అందించి నీవు  
హాలహల జ్వాల చేసేవులే,  
కొండంత ఆశ అడియాస చేసి  
గాడాంధకారాన విడిచేవులే-

ఒకనాటి ఉద్యానవనమూ నేడు కనము,  
మరల మరుభూమిగా నీవు మార్చేవులే,  
దీపాలు నీవె వెలిగించినావే  
గాఢాంధకారాన తోసేవులే,  
ఆనందనౌక పయనించు వేళ,  
శోకాల సంద్రాన ముంచేవులే

పల్లవి వీటూరి, చరణాలు శ్రీశ్రీ వ్రాసిన ఈ పాట ప్రతి కచేరీలో తప్పనిసరిగా యిప్పటికీ పాడుతూంటారు. అంత హిట్ అయింది.



చరణాలు మాత్రం వ్రాసిన శ్రీశ్రీ



పల్లవి మాత్రం వ్రాసిన వీటూరి

| | | |
|---|---|---|
| ఆనంద్ | : | ఓహో చక్కని చిన్నది ఒయ్యారంగ ఉన్నది<br>ఊరించేటి కన్నులతో నన్నే చూడన్నది |
| లత | : | చిన్నది చాలా మంచిది నిన్నే నమ్ముకున్నది<br>నీవే తప్ప వేరెవరూ లేనే లేరన్నది ॥ఓహో॥ |
| ఆనంద్ | : | వెచ్చగ జవ్వని తాకితే పిచ్చిగ ఊహలు రేగునే<br>రెపరెపలాడే గుండెల్లోన ప్రేమనిండేనే |
| లత | : | అయ్యో పాపం |
| ఆనంద్ | : | తీరని తాపం |
| లత | : | భావ కవిత్వం చాలునోయి పైత్యంలోన జారకోయి<br>పెళ్ళికి ముందు ప్రణయాలు ముళ్ళ బాణాలు |
| ఆనంద్ | : | ॥ఓహో॥ |
| లత | : | పెద్దల అనుమతి తీసుకో ప్రేమను సొంతం చేసుకో<br>హద్దు పద్దు మీరినా ఆట కట్టేను |
| ఆనంద్ | : | యస్ అంటారు మా వాళ్ళు |
| లత | : | నో అంటేనే టకరాలు |
| ఆనంద్ | : | తల్లిదండ్రి కూడదంటె గుళ్ళో పెళ్ళి చేసుకుందాం<br>ధైర్యం చేసి నీవేగా దారి చూపావు |
| లత | : | ॥చిన్నది॥ |
| ఆనంద్ | : | మనసే దోచిన సుందరి మమతే మల్లె పందిరి<br>పందిరిలోన మేనులు మరిచి పరవశించాలి |
| లత | : | అపుడే కాదు |
| ఆనంద్ | : | ఎపుడంటావు |
| లత | : | తొందరలోనే మూడుముళ్ళు అందరిముందు వేయగానే<br>తోడూనీడై కలకాలం సాగిపోదాము |
| ఆనంద్ | : | ॥ఓహో॥ |





అన్నపూర్ణా వారి 'చదువుకున్న అమ్మాయిలు' సినిమాలో పద్మనాభంది కామెడీలో మిక్స్ అవుతూ విలనీ చూపించిన పాత్ర. ఇందులో ఆయనకు జంటగా ఇ.వి.సరోజ నటించింది. ఈ సినిమాలో వీరి జంటకి రెండు పాటలున్నాయి. అందులో ఓ పాటయిది. ఈ పాటను పి.బి.శ్రీనివాస్, ఆశాంతా కులకర్ణి పాడేరు.



నడిపేటప్పుడు మేము ఆ విషయం ఎప్పుడూ గుర్తెరిగి ఉండేవాళ్లం. రేఖా మురళీసంస్థలో బ్రేక్‌టైంలో చాలా మంది - నటీనటులు, టెక్నీషియన్లే కాదు - బయటివారు కూడా వచ్చి భోంచేసి వెళ్లేవారు. కొందరు స్నేహపూర్వకంగా వచ్చే వారు. కొంతమంది పనిలేక అవస్థపడి వచ్చేవారు. ఎవరు వచ్చినా భోంచేసి వెళ్లాల్సిందే.

'అన్నం పరబ్రహ్మ స్వరూపం'! ఈ సత్యాన్ని చాటి, ఆచరించి, చెప్పిన వారు శ్రీనాగయ్య గారు! వారి స్వంతసంస్థ రేణుకా ఫిలిమ్స్‌లో సంస్థతో సంబంధం ఉన్నా లేకపోయినా, వెళ్లి టిఫిన్, భోజనం సంతృప్తిగా తినేవారం. ఆ స్ఫూర్తి నాకు ఇప్పటికీ ఉంది. మా సంస్థలో ఆర్టిస్టులు, టెక్నీషియన్స్, ఆఫీస్‌బాయిస్ అందరూ సమానంగా భోంచేయాల్సిందే. యిప్పటికి ఎంతోమంది రేఖా మురళి సంస్థ ఆతిథ్యం గురించి చెబుతుంటారు.

నా కథ చెబుతూంటే మా సోదరులు సుదర్శనం, పురుషోత్తంల గురించి కూడా చెప్పాలి. సుదర్శనం, నేనూ కలిసే మద్రాసుకు వచ్చామని, కెమెరా చూసి భయపడి అతను వెనక్కి వెళ్లిపోయాడని రాశాను కదా. కొన్ని సంవత్సరాల తరువాత సుదర్శనం తమిళనాడు-ఆంధ్రా సరిహద్దులో ఉన్న తిరుత్తణిలో ఒక హోటల్‌లో పనిచేస్తున్నాడు. నేను తిరుత్తణి సుబ్రమణ్యేశ్వరుని దర్శనానికి వెళ్లి అతన్ని కలిశాను.

మా నాన్న అమ్మ సుబ్బమ్మ గారి తమ్ముడు గోపాలయ్య గారు ఫ్లూట్ వాయించేవారు. వారి ఇన్స్పిరేషన్‌తో సుదర్శనం ఫ్లూట్ నేర్చుకున్నాడు. గుడి మెట్ల మీద కూర్చొని ఫ్లూట్ వాయించి వినిపించాడు. చాలా ప్రావీణ్యం సంపాదించాడనిపించింది. నటుడు కాలేక సినిమారంగాన్ని విడిచిన సుదర్శనాన్ని సంగీతవిభాగంలో పరిచయం చేస్తే మంచిదనిపించింది.

మద్రాసు తిరిగివస్తూనే ఫ్లూటిస్టు రాజన్న గారికి సుదర్శనం గురించి చెప్పాను. ఆయన ఘంటసాల గారి పార్టీలో పనిచేస్తున్నాడు. వెంటనే రమ్మని చెప్పారు. ఆ విషయం తెలుపుతూ ప్రయాణం ఛార్జీలకు కొంత డబ్బు ఎం.ఓ' చేశాను. సుదర్శనం మద్రాసు వచ్చి ఒక సంవత్సరం పాటు రాజన్న



గారి దగ్గర శిష్యరికం చేసి ఫ్లూటు బాగా నేర్చుకొన్నాడు. తరువాత సూరిబాబు గారి డ్రామా పార్టీలో చేరాడు. తరువాత శ్రీ వేణుగారి మ్యూజిక్ దర్శకత్వంలో వున్నాడు. ఆ తరువాత మహాదేవన్ పార్టీలో పర్మినెంటుగా పనిచేశాడు. ముఖ్యంగా 'మూగ మనసులు' లో 'ముద్దబంతి పూవులో మూగ కళ్ల వూసులు' పాట సావిత్రి గారి మీద, నా మీద నాగేశ్వరరావు గారు పాడినట్టు చిత్రించారు. అందులో వచ్చే ఫ్లూట్ సోలో సుదర్శనం వాయించినదే!

ఇంకో సోదరుడు పురుషోత్తం కొన్నేళ్లు గుంతకల్లులో బసవరాజు కంబైన్స్ డిస్ట్రిబ్యూషన్ ఆఫీసు పెట్టాడు. చిత్రనిర్మాణంలో నాకు చేదోడువాదోడుగా ఉన్నాడు. ప్రస్తుతం సింహాద్రిపురంలో రిటైర్ అయివున్నాడు.

(ఇంకావుంది)

(ఫోటో కర్టెసీ - సంజయ్ కిషోర్)

జనవరి 4 రాహుల్ వర్ధంతి సందర్భంగా...



# గాయకుడిగా ఆర్.డి.

అయిదు సంవత్సరాల క్రితం దివికేగిన అతనిలో దివ్య సంగీత దర్శకుడే కాదు, స్వత సిద్ధంగానే అతనిలో ఒక గాయకుడున్నాడు. సంగీతం పట్ల విపరీతమైన ఇష్టం వుంది. పై పెచ్చు తండ్రి సచిన్‌దేవ్‌బర్మన్ ప్రఖ్యాత సినీ సంగీత దర్శకుడు. అలీ అక్బర్ ఖాన్ దగ్గర తాను నేర్చిన మౌత్ ఆర్గనును రాహుల్ తన తండ్రి ఆర్కెస్ట్రాలో వాయించేవాడు. దాంతో పాటా, పాట మట్లు కట్టడం ప్రయాసలేకుండా పట్టుబడ్డాయి.

బర్మన్‌దాదా "బందినీ" చిత్రంలోని "ఒరే మాఝీ" "సున్‌మెరే బంధూరే"(సుజాత) పాటలతో కీర్తి సంపాదించినట్లే రాహుల్ "ఓ మాఝీ తేరేనయ్యా సే చూటా కినారా" పాట శక్తి సామంత తీసిన 'ఆర్‌పార్' (1986)లో పాడి శ్రోతల మనస్సుల్లో తనదయిన ముద్రవేసాడు. ఈ పాటలు విన్నవాళ్ళు తండ్రీ కొడుకులిద్దరూ ఒకే మార్గంలో ప్రయాణిస్తున్నారనుకున్నారు. కానీ రాహుల్‌కు 1980లలోనే కష్టకాలం వచ్చింది. సంగీత దర్శకునిగా అవకాశాలు తగ్గాయి. 'ఆర్‌పార్'లో అతను పాడిన పాట బాగా హిట్టయివుంటే అతను ఇంకా వేదాంతపరమైన పాటలు పాడ్డానికి మొగ్గుచూపేవాడేమో. సెమీ-క్లాసికల్, సెమీ ఫిలాసఫికల్ టచ్ వున్న పాటల పట్ల అతనికి ఇష్టం హెచ్చుగానే వుండేది.

రాహుల్ వాయిస్ అతని సంగీత దర్శకత్వంలో పాడిన మేల్ ఆర్టిస్టుల కంటే గొప్పది కాకపోవచ్చు. అయినప్పటికీ అతని వాయిలో సాహిత్యంలోని భావం ప్రస్ఫుటంగా ప్రతిఫలించేది. ఏదైనా పాటల్లో సందర్భం వచ్చినప్పుడు అతను తన గొంతుతో ఒక బిట్టయినా పాడ్డానికి సిద్ధపడేవాడు. అమిత్‌కుమార్‌కు చేసిన పాటల్లో అతని గొంతులో రాహుల్‌దాక్కుని పాడుతున్నారని అనిపించేది.

బాగా పాప్యులర్ అయిన "బడే అచ్చేలగ్‌తే హై" (బాలికా బధు) పాటలో అమిత్ గొంతు రాహుల్ గొంతును పూర్తిగా పోలి వుండడం గమనించవచ్చు. ఈ పాటలో రాహుల్ ఒక చరణంలో తన గొంతు కలుపుతాడు. కానీ అతను ఏ చరణం పాడాడు అనేది కనుక్కోవటం నిపుణులైన శ్రోతలకు మాత్రమే సాధ్యం.

తను సంగీత దర్శకత్వం వహించిన పాటల్లో ఒకటీ అరా ముఖ్యమైన చరణాలు పాడి ఆ పాటలకు అందం తెచ్చినా తనపేరు టైటిల్ కార్డ్స్‌లో రావాలని కానీ క్రెడిట్ సంపాదించాలని కానీ ఆలోచించేవాడుకాదు.

ఉదాహరణకు 'కారవాన్'లో ఆశాపాడిన "పియాతూ ఆబ్‌తో ఆ జా" పాటను రాహుల్ పెట్టిన కేకలు "మోనికా ఓ మై డార్లింగ్"ని విడిచిపెట్టి వింటే ఆ పాట అందం కనబడదు. రాహుల్‌దేవ్ తన వాయిస్‌తో ఆపాటకు కొత్త రంగులు సంతరించిపెట్టాడు. ఆ పాట ఈనాటికీ శ్రోతల మనస్సుల్లో నిలిచిపోవడానికి రాహుల్

---

ఇలా ఓ గ్రీటింగ్ కార్డును తయారుచేసి చూడండి. (ఇది పిల్లలకు మాత్రమే - పెద్దలు చూడరాదు)




సంక్రాంతి సందర్భంగా... కొన్ని ప్రామిస్లు

...నువ్వే బట్టలిస్తే...
అవే కట్టుకుంటాం!
...నువ్వేం పెడితే అదే తింటాం
టీవీ వేపు చూడకుండా
చదువుకుంటాం!
నువ్వు చెప్పిన మాటే
వింటాం! ఎందుకంటే...
నువ్వు మా
అమ్మవు గా




14-01-2003

పేజి నెం.1

పేజి నెం.2

(పేజి నెం.1ని మడతపెడితే పేజి నెం.2కి ఇలా రావాలన్నమాట)

చేసిన గిమ్మిక్కే కారణం. 'అబ్‌నబీ'సినిమాలో లతా - కిశోర్‌పాడిన "హందోనా దో ప్రేమీ దునియా ఛోడ్ చలే"పాటలో రైల్వే స్టేషన్ దగ్గర హీరో హీరోయిన్లను ఎటు వెళ్తున్నారనడిగే వాయిస్ రాహుల్‌దే. 'హరే రామ - హరే కృష్ణ'లో లతా వెర్షన్ "ఫూలోంకా తారోంకా సబ్‌కా కహనా హై" పాటలో కిశోర్‌సాహు నోట వినిపించిన "డాడీ కా మమ్మీకా సబ్‌కా కహనా హై ఏక్ హజారోంమే తేరే బహనా హై" చరణం రాహుల్ వాయిస్ నుంచి వచ్చిందే. అలా అక్కడక్కడా చెదురు మదురుగా వినిపించిన ఈ ముక్కలు పంచమ్ (రాహుల్‌ను పరిశ్రమ అప్యాయంగా పిల్చుకునే పేరు) కళాతృష్ణని మరిచిపోలేని విధంగా శ్రోతల మనస్సుల్లోనాటాయి.

1970 లో పంచమ్ పాడిన సోలోలు డ్యూయెట్లు మంచి పేరు సంపాయించాయి. 'ఆర్‌పార్'లో పాడిన సీరియస్ పాట వినడానికి బాగున్నా అతనికి పేరు తేలేదు. రఫీ రాహుల్‌లు కలిసి 'షాన్'లో 'యమ్మా యమ్మా' పాట పాడారు. అలాగే సపన్ చక్రవర్తితో కలిసి 'గోల్‌మాల్'లో టైటిలు సాంగు పాడాడు. పంచమ్ ప్రాణసమానుడైన మిత్రుడు కిశోర్‌తో కలిసి 'పుకార్'లో ఒక పాట పాడారు.

ఒకవేళ పంచమ్ ఒక సోలో పాడాల్సి వస్తే దానికి తన గళం అవసరమా కాదా అని ఆలోచించేవాడు. వచ్చుకదాని తగుదునమ్మా అని పాటల్లో 'గొంతు' దూర్చేవాడు కాదు.కాదు. అసలు 'షోలే'లో మంచి పేరు తెచ్చిన 'మెహబూబా మెహబూబా' పాట తను పాడేవాడు కాదు. మొదట ఆ పాట గొంతులో శృంగారం పలికించగల ఆశాభోంస్లే తో పాడిద్దామనుకున్నారు. అలా ఆమె పాడిన పాటలో జలాల్‌ఆగా అక్కడక్కడ తన గొంతు కలపాలని నిర్ణయించారు. అప్పటికే డెమిస్ రూసో పాట ఒకటి విని వున్న జావేద్ అఖ్తర్ ఆనంద్‌బక్షి, రమేష్ సిప్పీలు ఆ పాటను సోలే విధంగా ఈ పాట పాడటానికి పంచమ్ ఒక్కడే తగినవాడని నిర్ణయించి వత్తిడి తెచ్చి ఆ పాట అతనిచేత పాడించారు. ఆఖరు నిమిషంలో తీసుకున్న నిర్ణయమైనా, ఆ పాటకు సమకూడిన అందాన్ని అజరామరత్వాన్ని చూసి సరైన నిర్ణయంగా భావించాలి. కొన్ని అలా సమకూరుతాయి. గుల్జార్ కావాలని కోరి "ధన్నోంకా ఆంఖోంమే రాత్‌కా సుర్మా" పంచమ్ చేత పాడించాడు. 'కస్మేవాదే'లో



భార్య ఆశాతో ఆర్.డి.బర్మన్

'కల్ క్యాహోగా కిస్‌కో పతా!' పాట, 'సమందర్‌మే నహాకే' పాట పంచమ్ ప్రవృతికి సూటవుతాయి. ఏది జరగాల్సి వుందో అది జరుగుతుంది. భయపడి లాభం లేదు. అన్నదే అతని వ్యక్తిత్వపు లక్షణం, అతని ఫిలాసఫీ.

బాధను పలికించే పాటలు కూడా పంచమ్ బాగా పాడగలడు. సాజిద్ హుస్సేన్ మ్యూజికల్స్ హమ్‌కిసీసే కమ్ నహీ, జమానాకో దిఖానాహైలో "తుమ్ క్యాజానో మొహబ్బత్‌క్యాహై". "దిల్‌లేనా ఖేల్‌హై దిల్‌దార్‌కా" పాటల్లో పంచమ్ బాధల వంతెన మీద నడిచాడా అన్నంత గొప్పగా

---

ఇలా ఓ గ్రీటింగ్ కార్డును తయారుచేసి చూడండి. (ఇది పిల్లలకు మాత్రమే - పెద్దలు చూడరాదు)

మొదటి పేజీని మడత తీసేసి, వెనుకనున్న రెండవ పేజీలోనున్న మ్యాటర్‌తో కలుపుకుంటే ఇలా ఉంటుందన్నమాట

* ఉతికి ఇస్త్రీ చేసివుంటే ......నువ్వే బట్టలిస్తే...
  అవే కట్టుకుంటాం!
* మాంఛి రుచిగా వేడిగా వుంటే....నువ్వేం పెడితే అదే తింటాం
* చెత్త ప్రోగ్రాంలు వస్తుంటే..... టీవీ వేపు చూడకుండా
  చదూకుంటాం!
* హోటల్‌కెళ్దాం అన్నప్పుడు..... నువ్వు చెప్పిన మాటే
  వింటాం! ఎందుకంటే...
  నువ్వు మా
  అమ్మవుగా
* మేమేం చెప్పినా
  నమ్మవుగా....

టోటల్‌గా పేజ్ నెం.2 లెంగ్త్ ఇది

పేజీ నెం.1 వెనుక భాగం

గొంతులో తన బాధను ఆవిష్కరించాడు. కుమార్‌గౌరవ్ పూనమ్ ధిల్లాన్‌లు నటించిన 'రొమాన్సు'లో పంచమ్ సోలో "ఏ జిందగీ కుచ్ భీ నహి'' సినిమా ఫ్లాపయినా పాట మరచిపోలేనిదయింది.

రొమాంటిక్ పాటలకొచ్చేసరికి పంచమ్ తన ఆత్మీయ సహచరి ఆశాతో కలిసి ఒక సాంద్ర ప్రణయ వాతావరణాన్ని పాటల్లో కల్పించాడు. కాకపోతే వారిద్దరు కలిసి ఏడెనిమిది పాటల కంటే ఎక్కువ పాడలేదు. వాళ్లిద్దరూ మొదట పాడన పాట 'ఓమెరీ జాన్ మైనే కహా' (ది ట్రెయిన్). అదే చిత్రంలో రఫీ పాడిన 'గులాబీ ఆంఖే, కిస్‌లియే మైనే ప్యార్ కియా'(లతా) పాటలుంచి పంచమ్-ఆశాల పాట పక్కకు పడేశారు.

వాళ్లిద్దరూ ఆ మరుసటి సంవత్సరమే 'అప్నాదేశ్' లో పాడారు. ఆ పాట "దునియా మే లోగోంకో దోఖా కభీ హోజాతాహై''. (రాజేష్‌ఖన్నా- ముంతాజ్‌ల మీద ఈ పాట చిత్రీకరించారు.) 'ఖేల్ ఖేల్‌మే'లో ఆశా - పంచమ్‌లు గుర్తుంచుకోదగ్గ పాటలు పాడారు. సరదా డ్యూయెట్సు ఆశా-కిశోర్‌లు పాడగా 'సప్నా మెరా టూట్ గయా'లో పంచమ్ పాడాడు. ఎంచేతో 'జోషిలా'లో పంచమ్ - ఆశాలు పాడిన 'నాజా జాసే జా'పాట మరుగునపడింది. కానీ ఆశాతో డిస్కో 'జానే జా ఓ మెరీ జానే జాన్' (సనమ్ తేరే కసమ్) బాగా పేరు తెచ్చుకుంది. ఆశాతో పంచమ్ పాడిన ఆఖరి డ్యూయెట్ 'ఏ దిన్‌తో ఆతా హై'(మహాన్). విషాదమేమిటంటే పంచమ్ కెరీర్ మీద అప్పటికే మబ్బులుకమ్మాయి.

గాయకుడిగా రాహుల్ కెరీర్‌లో ఒక కుతూహలకరమైన మలుపుంది. చాలా ఎన్నిక చేసుకొని పాడిన పాటలు కొన్ని, ఇష్టంలేకున్నా ఇతరేతర కారణాల వల్ల పాడినవి కొన్ని, అన్ని కలిపి తక్కువే పాడినా పంచమ్ హంసగీతా 'క్యాభలా హై క్యాబురా హై'. గుల్జార్ తీసిన 'లిబాస్'కై (చిత్రం విడుదల కాలేదు) పాడాడది. జీవించడంలో వున్న కష్టం ఏమిటో వ్యక్తం చేసే పాట అది. తాను ఎప్పుడూ ఎవరితో కలిసి పాడటానికి సాహసించలేకపోయాడో ఆవిడతో కలిసి మొదట సారిగా మైక్రోఫోన్ ముందుకెళ్లాడతను. ఆమె లతామంగేష్కర్!

గుల్జార్ మాటల్లో చెప్పాలంటే "పంచమ్ ఎక్సలెంట్ గాయకుడు. అతనికి క్లాసికల్ సంగీతంలోని మర్మాలన్నీ తెలును. నా సినిమాలకు అతడు రెండు పాటలు పాడాడు. కానీ చాలా సందర్భాల్లో అతను తన గొంతును అరువిచ్చాడు. ఉదహారణకు జబ్బార్‌పటేల్ చిత్రం 'ముసాఫిర్'లో ఒక పాటలో పడవవాడి గొంతు పంచమ్‌దే. గాయకుడిగా అతను ఒక పాటను పదే పదే పాడి పరిపూర్ణత పొంది అప్పుడు రికార్డింగ్‌కి వస్తాడు. నేను 1994లో చేసిన ఆల్బమ్‌లో అతని పాటలు 'రాహ్ పే రహతే హై', 'కోయిజదియా జలే కహీ' గుర్తు చేసుకోండి. 'దిల్ పర్‌దేశీ హై' పాటల ఒరిజినల్ సౌండ్ ట్రాక్సు పంచమ్ పాడినవే. వాటి ననుసరించి ఆశా పాడగా రికార్డు చేశారు.''

రాహుల్‌దేవ్ బర్మన్ సంగీత కారుడుగానే కాక గాయకుడిగా కూడా తన సొంత ముద్ర వేసి శ్రోతల హృదయాల్లో తనకొక స్థానం కల్పించుకున్నాడు.

**-ఎస్.కె.రామారావు**

# హిందీ బాణీలు - తెలుగు పాటలకు ఓణీలు

గతపక్షం డిసెంబరు 24న త్యాగరాయగానసభలో 'హాసం' సౌజన్యంతో "హిందీ సినీసంగీత దర్శకులు - తెలుగు సినీగీతాల బాణీలు' అనే పేర సంగీత విభావరి నిర్వహించబడింది. 'హాసం' చైర్మన్ శ్రీ వరప్రసాద్ రెడ్డి అధ్యక్షత వహించిన ఈ సభకు ముఖ్య అతిథిగా విచ్చేసిన డా. సి. నారాయణరెడ్డి మాట్లాడుతూ హిందీ సంగీతదర్శకులలో చాలామందితో పనిచేసిన తన అనుభవాలు గుర్తుకుచేసుకున్నారు. ఓపి నయ్యర్ ముందుగా ఇచ్చిన ట్యూనుకు 'నిను విడిచి నేనుండలేను' పాట వ్రాయడం జరిగితే, స్వర్గీయ సి.రామచంద్ర గీతరచన తర్వాతనే సంగీతరచనకు ఉపక్రమించేవారని తెలిపారు. పక్షపత్రికగా వెలువడుతున్న 'హాసం'లో పక్షపాత ధోరణి లేకుండా అందరి గురించీ 'కవర్' చేస్తున్నారని చమత్కరించారు. చక్కటి పత్రిక అని అభినందించారు.



హిందీసంగీతదర్శకులు బాణీలు సమకూర్చిన అత్యధికశాతం పాటలు వ్రాసిన ఆచార్య సి.నారాయణ రెడ్డి - ముఖ్య అతిథిగా సభలో ప్రసంగిస్తూ, వేదికపై ఆసీనులైనవారు -శ్రీ శరత్ గోపాల్, 'హాసం' చైర్మన్ శ్రీ వరప్రసాద్ రెడ్డి.

అధ్యక్షోపన్యాసంలో శ్రీ వరప్రసాద్ రెడ్డి 'శంకర్-జైకిషన్, లక్ష్మీకాంత్ ప్యారేలాల్, బప్పీలాహిరి, ఓ.పి.నయ్యర్, సి.రామచంద్ర, రవీంద్రజైన్, సలిల్‌చౌధురి,ఆర్.డి.బర్మన్, రవి వంటి హిందీ సంగీతదర్శకులు తెలుగు సినిమాలకు సేవ చేశారని. 'సరిగమలు' వంటి సినిమాలలో రవి హిందీబాణీలకు తెలుగు ఓణీలు కట్టబెట్టి తెలుగు సినీ సంగీతాన్ని సుసంపన్నం చేశార'ని ప్రశంసించారు.

సావేరి కల్చరల్ అసోసియేషన్ తరఫున యన్.భవాని నిర్వహించిన ఈ సభలో శ్రీ శరత్ గోపాల్ గౌరవ అతిథిగా, సినీ విజ్ఞాన విశారద శ్రీ ఎస్.వి.రామారావు వ్యాఖ్యాతగా పాల్గొన్నారు. చంద్రతేజ, సురేఖామూర్తి, కె.ఎస్.ఆర్.మూర్తి, రమణకుమారి, విజయకుమార్, ఖాసిం తదితరులు 'జీవితచక్రం', 'మజ్నూ', 'రౌడీగారి పెళ్లాం', 'ఆలాపన', 'అక్బర్-సలీం-అనార్కలి', 'నీరాజనం', ఇతర సినిమాల పాటలు పాడి వినిపించారు. సభ చివర్లో శ్రీ చంద్రతేజ అమరగాయకుడు ఘంటసాల పద్యం పాడే తీరును సోదాహరణంగా విశ్లేషించి సభికులను రంజింపజేశారు. ◆




# తానా రజతోత్సవాలు

తానా రజతోత్సవాలలో భాగంగా గతపక్షం డిసెంబరు 22న హైదరాబాదులో జరిగిన ముగింపు కార్యక్రమంలో ప్రసిద్ధ గాయని వాణీ జయరాం సంగీత విభావరి జరిగింది. అన్నమయ్య సంకీర్తన 'ఇందిరానామ మెందరికే..' అంటూ ప్రారంభించిన ఆమె కచేరీ 'శృతి నీవు..గతి నీవు..(స్వాతికిరణం), 'ఎన్నెన్నో జన్మల బంధం..' (పూజ), 'ఒక బృందావనం' (ఘర్షణ) వంటి పాప్యులర్ తెలుగుగీతాలతో బాటు 'బోల్‌రే పపీహరా' కూడా పాడి శ్రోతలను అలరించారు. తానా వారు మరో కార్యక్రమంలో 'అన్నమయ్య-పల్లెపదాలు' అనే వినూత్న కార్యక్రమాన్ని ఏర్పాటు చేశారు. అన్నమయ్య పాడిన పల్లెప్రజల జీవితాల పాటలు - జోలపాటలు, లాలిపాటలు, గొబ్బిపాటలు, జాజిరపాటలు, సువ్విపాటలు, పెళ్లిపాటలు - లతో కూర్చబడిన ఈ కార్యక్రమాన్ని కొండవీటి జ్యోతిర్మయి చౌదరి నిర్వహించారు.

# టూకీగా...

గతపక్షం డిసెంబరు 29 న పశ్చిమగోదావరి జిల్లాలోని ఆకివీడులో సరిగమ సంగీత పరిషత్ అనే సంస్థ ఘంటసాల జయంత్యోత్సవం సందర్భంగా సినీసంగీత విభావరి ఏర్పాటు చేశారు. శ్రీమతి ఘంటసాల సావిత్రి గారు విశిష్ట అతిథిగా, డా. కె.వి.రావు గారు ప్రత్యేక అతిథిగా పాల్గొన్న ఈ సభ లో పాడిన పాటలకు న్యాయ నిర్ణేతగా సంగీతదర్శకులు శ్రీ ఆకాష్ వ్యవహరించారు.

గాయకుడు, సంగీతదర్శకుడు వందేమాతరం శ్రీనివాస్ 'అమ్ములు' చిత్రంతో ముఖ్యపాత్రధారి కూడా కాబోతున్నారు. వేరే చెప్పనక్కరలేదు, ఆ సినిమాకు సంగీతం సమకూర్చినది ఆయనే!

అంతర్జాతీయ స్థాయిలో ఖవ్వాలి గానంలో 'మల్లికా - ఎ - ఖవ్వాలి' (ఖవ్వాలీ సామ్రాజ్ఞి) గా వాసి కెక్కిన షకీలా బాను భోపాలీ డిసెంబరు 15 న ముంబయ్‌లో తన 60 వ యేట మరణించారు. ఏడేళ్ల వయసునుండి పాటలు పాడుతున్న షకీలాబానుకు దిలీప్‌కుమార్ సినిమాలలో అవకాశం కల్పించారు. సినిమాల ద్వారా, దేశవిదేశాలలో జరిపిన కచేరీలద్వారా ఎంతో ఖ్యాతిని, ధనాన్ని సంపాదించుకున్న ఆమె చివర్లో దారిద్ర్యాన్ని చవిచూడవలసివచ్చింది.

ఆమె పాడిన 'సెహర్ కా వక్త్ హై', 'అబ్ తుమ్ పే ఛోడ్ దియా హై', 'జహర్ దే యా జామ్ దే', 'దమా దమ్ మస్త్ కలందర్', 'యమ్మా యమ్మా', 'ఆజ్ కీ తాజా ఖబర్' వంటి ప్రఖ్యాత గీతాలు గానప్రియులకు కలకాలం గుర్తుంటాయి.

'వక్త్ 'కభీ-కభీ', 'చాందినీ', 'దిల్ తో పాగల్ హై', 'దిల్‌వాలే దుల్హనియా లే జాయేంగే' వంటి తన సినిమాల ద్వారా పదికాలాలపాటు నిలిచే సంగీతాన్ని శ్రోతలకు అందించిన యష్‌చోప్డాకు దాదా ఫాల్కే అవార్డు లభించింది. సాహిర్ లుధియాన్వీ అభిమాని అయిన యష్, ఆయన మరణానంతరం జావేద్ అఖ్తర్‌ను గీతరచయితగా పరిచయం చేశారు.

# తమిళ హాస్యనటుడు వి.కె.రామస్వామి ఇకలేరు!

తమిళం నుండి డబ్ అయిన సినిమాల ద్వారా తెలుగు ప్రేక్షకులకు కూడా సుపరిచితుడయిన సీనియర్ హాస్యనటుడు వి.కె.రామస్వామి గతపక్షం డిసెంబరు 24 న చెన్నయ్‌లో మరణించారు. దాదాపు 500 సినిమాలలో నటించిన శ్రీ రామస్వామి హాస్యనటుడిగానే కాక కారెక్టరు నటుడిగా కూడా రాణించారు. సినిమా కెరియర్‌లో ఉత్తరార్థంలో గొంతుచించుకుని మాట్లాడడం ట్రేడ్ మార్కుగా పెట్టుకున్నా శ్రీ రామస్వామి సున్నితమైన హాస్యాన్ని కూడా పండించగలిగారు.



రామస్వామి స్వర్గీయ శివాజీగణేషన్‌కు అత్యంత ఆప్తుడు. శివాజీకి పేరు తెచ్చిన తొలిచిత్రం - 'పరాశక్తి' ఆయనకు కూడా తొలిచిత్రం. దానిలో ఆయన చిన్న విలన్. శివాజీతో ఎన్నో సినిమాలలో నటించడమే కాదు, కాంగ్రెసు నుండి బయటకు వచ్చేసి శివాజీ 'తమిళగ మున్నేట్ర మున్నని' అనే పేరిట పార్టీ స్థాపించగా ఆయన వెంట నడిచిన అతి కొద్దిమందిలో రామస్వామి ఒకరు. సినిమా రంగానికి వచ్చేముందు ఎస్.ఎస్.కృష్ణన్ డ్రామా ట్రూప్‌లో పనిచేసిన రామస్వామిని తమిళనాడు ప్రభుత్వం 'కలైమామణి' బిరుదుతో సత్కరించింది.

నటుడిగా సంతృప్తి చెందని రామస్వామి నిర్మాతగా మారి చేతులు కాల్చుకున్నారు. 50 ఏళ్లగా సినీరంగంతో పెనవేసుకున్న అనుబంధం చివరిరోజుల్లో అక్కరకు రాలేదు. ఏడుగురు పిల్లల పెద్దకుటుంబీకుడైన రామస్వామి జీవిత చరమాంకంలో ఖరీదైన వైద్యానికి నోచుకలేదు. తన 79 వ ఏట ప్రభుత్వాసుపత్రిలో కన్నుమూసారు.



రాజ్‌కపూర్ తన సినిమాల ద్వారానే కాదు, ఆ సినిమాల ద్వారా అందించిన సంగీతం వల్ల కూడా రసజ్ఞులకు గుర్తుండిపోతాడు. ఆయన సినిమాలలో సంగీతదర్శకులుగా ఎవరి పేరు వేసినా, నిజానికి ఆయన భాగస్వామ్యం దానిలో చాలా ఎక్కువ అంటారు. స్వయంగా ఎన్నో వాయిద్యాలు వాయించగలిగిన రాజ్ తన సినిమాలకు సంగీతం సమకూర్చడానికి ఎంత శ్రమించాడో ఆయన సన్నిహితులే చెప్పగలగాలి. రాజ్‌కపూర్ కూతురు రీతూ నందా తండ్రికి ఆప్తురాలే! తండ్రి గురించి 'రాజ్‌కపూర్ స్పీక్స్' అనే పుస్తకం వ్రాసి డిసెంబరు 14 న రాజకపూర్ జన్మదినం నాడు ప్రధానిచే ఆవిష్కరింపజేసింది. పెంగ్విన్ ద్వారా ఈ పుస్తకం మార్కెట్‌లోకి వస్తోంది.

# బాపు రమణలకు లైఫ్‌టైమ్ అవార్డు

హ్యూమర్ - 2002 పేర డిసెంబరు 15 న హైదరాబాదులో జరిగిన ఒక సభలో శ్రీ అక్కినేని నాగేశ్వరరావు బాపు, ముళ్లపూడి వెంకటరమణలకు, హాస్యానికి వారు చేసిన సేవలకు గాను 'లైఫ్‌టైమ్ అవార్డు' ప్రదానం చేశారు. అవార్డు అందుకున్న ఇతర ప్రముఖులు - హాస్యనటులు అల్లురామలింగయ్య, కార్టూనిస్టులు ఆర్.కె.లక్ష్మణ్, మేరియో మిరాండా. బాపు జన్మదినం నాడు జరిగిన ఈ సభలో ఆయన కార్టూన్ సంపుటాలు 1,2 ఆవిష్కరింపబడ్డాయి.

# శృతినందన్

కోల్‌కతాలోని "శృతినందన్" అనే సంస్థ వ్యవస్థాపకుడు పండిత్ అజయ్ చక్రవర్తి అనే హిందూస్తానీ గాయకుడు యాభై సంవత్సరాలు నిండిన సందర్భంగా ఇటీవల ముంబాయిలోని నెహ్రూ సెంటర్లో సన్మానం జరిగింది. సభలో ప్రఖ్యాత సినీ సంగీత దర్శకులు నౌషాద్, ఇళయరాజా, ఉత్తమ్‌సింగ్, ప్రసిద్ధ గాయకుడు దినకర్ కైకిణీ తదితరులు ప్రసంగించి అజయ్ చక్రవర్తి కృషిని మెచ్చుకున్నారు. ఆనాడు పటియాలా, జైపూర్ వంటి "ఘరానా"లు సంగీతానికి పేరు పొందితే ఇప్పుడంతా ఎమ్‌టీవీ ఘరానాయే వినబడుతోందని నౌషాద్ చమత్కరించారు. పాశ్చాత్యులకు ఆనాటి మొజార్ట్‌ను ఆరాధించడమే తెలుసనీ ఈనాడు అజయ్ చక్రవర్తి రెండు వందలమంది మొజార్ట్‌ను తయారు చేస్తున్నారనీ ఇళయరాజా మెచ్చుకున్నారు. ఆ సభలో అజయ్ కుమార్తె కౌశికి గానాన్ని అందరూ ప్రశంసించారు.

పేదకుటుంబంలో పుట్టిన అజయ్ చక్రవర్తి తన తండ్రి అజిత్‌కుమార్ వద్ద సంగీతం నేర్చుకోవడం మొదలెట్టి తరవాత ఉస్తాద్ బడేగులాం అలీఖాన్ కుమారుడైన మునవ్వర్ అలీ వద్ద శిష్యరికం చేశాడు. ప్రకాశ్ ఘోష్ అనే ఆయనవద్ద లలిత సంగీతం, హార్మోనియం వగైరాలు కూడా అభ్యసించి రవీంద్ర భారతి యూనివర్సిటీలో మాస్టర్స్ డిగ్రీ పుచ్చుకున్నాడు. ప్రఖ్యాత తబలా, హార్మోనియం విద్వాంసుడు జ్ఞానప్రకాశ్ ఘోష్ కూడా ఆయనకు గురుతుల్యుడే.

దేశ విదేశాల్లో ఎన్నో గానచేరీలు చేసి ప్రశంసలనూ, ప్రేక్షకుల అభిమానాన్నీ పొందిన అజయ్ చక్రవర్తికి 1993లో మధ్యప్రదేశ్ ప్రభుత్వపు "కుమార్ గంధర్వ" తొలి అవార్డు లభించింది. సంగీత రిసెర్చ్ అకాడమీ ఫెలోగా స్వర్ణపతకం కూడా పొందారు. కొన్నేళ్ళ క్రితం రేడియో (వివిధ్‌భారతి)లో క్లాసికల్ రాగాలను పరిచయం చేసే "సంగీత్ సరితా" కార్యక్రమాన్ని కూడా ఆయన కొన్నాళ్ళు నిర్వహించాడు. అందులో రాగేశ్రీవంటి రాగాలను శాస్త్రీయ, లలిత సంగీతాల్లో ట్రీట్ చేసే రెండు రకాల పద్ధతులను ఆయన ఆసక్తికరంగా వివరించేవాడు.

అనంతరం "శృతినందన్" సంస్థ గురించిన డాక్యుమెంటరీ చిత్రాన్ని ప్రదర్శించారు. అది



అయిదంతస్తుల "సెల్ఫ్ కంటెయిన్డ్" భవనం. దాని బేస్‌మెంట్ స్టూడియో, ఇతర అంతస్తుల్లో సంగీత పాఠాలు నేర్పే గదులుగా వచ్చే సంగీతజ్ఞులకు వసతులూ, విద్యార్థులు సంగీతాన్ని ఆస్వాదించడమే కాక సంగీతంలో మైక్‌ల ఉపయోగాలూ, రికార్డింగ్ విశేషాలూ, హాల్ ఆకూస్టిక్స్ వివరాలూ ఇలా ఎన్నో నేర్చుకునే సదుపాయాలున్నాయి. శృతినందన్‌లో ఎనిమిది వందల మందిదాకా విద్యార్థులు శిక్షణ పొందుతున్నారు. వీరిలో అధికసంఖ్యాకులు




# హాస్యాభిషేకం




మల్లాది వెంకట కృష్ణమూర్తి కొత్తపుస్తకం- 'హాస్యాభిషేకం' అనే జోక్స్ కలెక్షన్ బుక్‌లో ఆయన పలురకాల జోకులు అందించారు. ఆపుస్తకంలో చెణుకుల ద్వారా అందించిన హాస్యానికి మచ్చుతునకలు కొన్ని :-

✷ 'ఖర్చులు తగ్గించుకోవటం ఎలా' అనే పుస్తకం రీ ప్రింట్‌లో ఏంజరిగింది?

-వెల రూ.30 నించి 36కి పెరిగింది.

✷ సుకుమార్ తన భార్యని ముద్దు పెట్టుకోవడం ఎందుకు మానేసాడు?

-తను డయబెటిక్ అని, ఆమె ముద్దు తియ్యగా వుంటోందని.

✷ కుక్కర్లకి విజిల్స్ ఎందుకు కనిపెట్టారు?

-టి.వి.లో మునిగిపోయిన ఇల్లాళ్ళని వంటింటికి పిలవడానికి.

✷ హెన్‌పెక్డ్ హజ్బెండ్ అంటే ఎవరు?

-ఆత్మహత్యచేసుకోవడానికి తన భార్యను అనుమతి అడిగేవాడు.

✷ కలల్లోని ఆనందం ఏమిటి?

-మధ్యలో ప్రకటనలు రావు.

✷ చాలామంది మధ్యతరగతివాళ్ళ ఆర్థిక సమస్య ఏమిటి?

-డబ్బు వారి నిత్యావసరాలకే సరిపోవడం.

✷ వార్తాపత్రికల ఆఫీసుల్లో ఎక్కువగా గాలి ఎక్కడ వీస్తుంటుంది?

-'సర్క్యులేషన్' డెస్క్ దగ్గర

✷ ఇ.ఎన్.టి. డాక్టరంటే?

-'ముక్కు' పిండి మరీ డబ్బు వసూలు చేసేవాడు.

✷ ఆపరేషన్‌తో బట్టతలమీద జుట్టు మొలిపించుకుంటే కలిగే ప్రమాదము?

-డాక్టర్ బిల్ చూశాక జుట్టు పీక్కోవడం.

**లోకరీతిపై ఆయన విసుర్లు :**

❀ తెలిసిన అందమైన ఆడవాళ్ళని చూసిన కొందరు మగాళ్ళు వాళ్ళని పలకరించకుండా వుండలేరు. వాళ్ళు మళ్ళీ నోరెత్తకుండా జవాబివ్వడం ఎలాగంటే...

మగాడు : మిమ్మల్ని ఎక్కడో చూసినట్లుందే?

ఆడది : అవును! అందుకనే అక్కడికివెళ్ళడం మానేసాను.

మగాడు : ఈ సీట్ ఖాళీగా వుందా?

ఆడది :అవును... మీరిక్కడ కూర్చుంటేనే కూర్చున్న సీటు కూడా ఖాళీ అవుతుంది.

మగాడు : నేను నీకోసం ఏమైనా చేస్తాను.

ఆడది : మంచిది. ముందు మీ బేంక్ చెక్‌లో సంతకాలు చేసి తీసుకురండి.

మగాడు : నేను నీ కోసం గంగలో దూకమన్నా దూకుతాను.

ఆడది : థాంక్స్! ఆ పనిచేసి ఇక బయటికి రాకండి.

మగాడు : మిమ్మల్ని ప్రేమిస్తున్నాను.

ఆడది : సారీ! నేను జంతువుల ప్రేమని అంగీకరించను.

మగాడు : నీకు నా మనసిచ్చాను.

ఆడది : సారీ బాస్! గిఫ్ట్ నేను తీసుకోను.

❀ అరవైలో ఇరవైలా ప్రవర్తించేవారు ఎవరై వుంటారు?

- 20వ ఏట అవి ఏవీ చేయనివారై వుంటారు.

స్థానికులూ, పొరుగు ప్రాంతాలవారే అయినా ఇతర రాష్ట్రాల నుంచి వచ్చేవారు లేకపోలేదు. అజయ్, ఆయన భార్య చందన వీడియో మానిటర్ల ద్వారా ఒకేసారిగా ప్రతి క్లాసులోనూ ఏం నేర్పుతున్నారనేది పర్యవేక్షిస్తూ ఉంటారు. డాక్యుమెంటరీలో విద్యార్థుల సోలో, బృందగానాలు రెండిలోనూ గొప్ప ప్రతిభ కనిపించింది. అందులో హిందూస్తానీ శాస్త్రీయ గానం, వాద్య సంగీతం, లలిత సంగీతం, జానపద సంగీతం ఇలా అనేక రకాలు నేర్చుకోవడం చూపించారు. **అన్నిటికన్నా ఆశ్చర్యపరిచినది ఆ బెంగాలీ పిల్లలు డా.బాలమురళీకృష్ణ స్వరపరిచిన కల్యాణి రాగ మాలిక తిల్లానా పాడడం. (ఆ సంస్థకు విచ్చేసిన ప్రముఖులలో బాలమురళి కూడా ఉన్నారు)** మంచి సంగీతం ఎక్కడిదైనా అనుకరించి నేర్చుకోదగినదే అనే అభిప్రాయం సంస్థ సంచాలకులకు ఉన్నట్టు దీన్ని బట్టి తెలియ వస్తోంది. ముంబాయి సభలో నౌషాద్‌గారు అన్నట్టు శాస్త్రీయసంగీతం మన దేశపు గొప్ప సాంస్కృతిక వారసత్వంలో అతి ముఖ్యమైన అంశం. అజయ్ చక్రవర్తి వంటివారు దాన్ని పరిరక్షించడానికి చేస్తున్న ఈ ప్రయత్నం ఇతరులకు కూడా స్ఫూర్తినిస్తే ఎంతో బావుంటుంది.

**డా॥ కొడవటిగంటి రోహిణీప్రసాద్**




## ఇది యస్పీబాల సుబ్రహ్మణ్యం సమర్పిస్తున్న శీర్షిక

**మీకు తెలుగు ఎంత బాగా తెలుసో, మీ పదసంపద ఎటువంటిదో బేరీజు వేసుకోవడానికి ఉద్గ్రంథాల దాకా పోనక్కరలేదు. ఈ సంచికలో కనబడే సినిమాపాటలలోని మాటలతో కూర్చిన ఈ శీర్షికలో సరైన అర్థం అనుకున్న మాటపై టిక్కుపెట్టి బాలూ గారిచ్చిన సమాధానాలతో సరిచూసుకోండి.**

1. ఝరి (ప్రతీకారం... నారీ రసమాధురి)
   ఎ) వాగు బి) చీర అంచు
   సి) వేగము డి) ప్రవాహము
2. బాళి (సువర్ణసుందరి-పిలువకురా)
   ఎ) వాగ్దానము బి) ములిక
   సి) కోరిక డి)ఆనందము
3. త్రాహి (సువర్ణసుందరి-పిలువకురా)
   ఎ) ఇవ్వు బి) రక్షించు
   సి) పాము ధరించినవాడు
   డి) తీసుకో
4. మోడి (సువర్ణసుందరి-పిలువకురా)
   ఎ) మాయ బి) సంగీతము
   సి) తొందర డి) అనాదరము
5. వినుత (సువర్ణసుందరి-జగదీశ్వరా)
   ఎ) పక్షి బి) పొగడబడిన
   సి) ఆకాశ వీథిన డి) కుమారుడు
6. ప్రమథులు (సువర్ణసుందరి-జగదీశ్వరా)
   ఎ) మొదట పుట్టినవారు బి)స్త్రీలు
   సి) ప్రమాదము కల్గించువారు
   డి) శివుని అనుచరులు
7. తనియగ (సువర్ణసుందరి- హాయి హాయిగ ఆమని)
   ఎ) తృప్తిపడగ బి) ఒంటరిగా
   సి) కలువగా డి) యాడగా
8. తరాజు (సువర్ణసుందరి-ఏరా మనతోటి)
   ఎ) త్రాసు బి) పొగుడువారు
   సి) ప్రేమించు డి) పాటపాడు
9. పలుచన చేయు (సువర్ణసుందరి-పిలువకురా)
   ఎ) పిలుచు బి) చులుకన చేయు
   సి) ప్రేమించు డి) పాటపాడు
10. రవళి (ప్రతీకారం... నారీరసమాధురీ)
   ఎ) గుంపు బి) పాట
   సి) శబ్దం డి) మువ్వ

### జవాబులు

1) d 2) c 3) b
4) d 5) b 6) d
7) a 8) a 9) b
10) c

## 'హాసం' ఆడియో క్లబ్ డేటా బేస్

సంస్థ పేరు :........................ స్థాపించినసంవత్సరం:..................

ఉద్దేశ్యము :........................ సభ్యుల సంఖ్య :..................

అడ్రసు :........................................

........................ పిన్‌కోడ్ నెం:..................

కార్యాలయం ఫోన్ నెంబర్, ఈ మెయిల్ :........................

కార్యనిర్వాహక సభ్యులు 1. ☎

2. ☎

3. ☎

సంప్రదించవలసిన వ్యక్తి, (ఫోన్ నెంబరుతో సహా) : తేదీ:.........




సంగీత సాహిత్యాలకు సముచిత స్థానం కల్పించిన సంస్థల్లో అంజలీ పిక్చర్స్ కూడా ఒకటి. భార్యాభర్తలైన నటి అంజలీదేవి, సంగీత దర్శకుడు ఆదినారాయణరావు కలిసి ఆ బ్యానర్‌పై నిర్మించిన చిత్రాలన్నీ మంచివే అయినా 1957లో విడుదలయిన




చిత్రం గడించిన కీర్తి ప్రతిష్టలు మాత్రం సాటిలేనివి. ఒకరకంగా తెలుగువారి శక్తి సామర్థ్యాలను ఉత్తరాది వారికి చవి చూపించిన చిత్రమిది. ఈ చిత్రాన్ని తెలుగు, తమిళ భాషలలోనే కాక హిందీలో కూడా నిర్మించారు. హిందీలో కూడా అక్కినేని, అంజలీదేవి నటించటం, తమ పాత్రలకు తామే డబ్బింగ్ చెప్పుకోవడం ఒక ఎత్తు అయితే ఉత్తమ సంగీత దర్శకునిగా ఉత్తరాదిన ఆదినారాయణరావు ఎంపిక కావటం మరో ఎత్తు. ఇంతటి ఘన చరిత్ర గల 'సువర్ణ సుందరి' చిత్రంలో సముద్రాల రాఘవాచార్య కర్తృత్వం వహించగా అత్యంత ప్రజాదరణ పొందిన కొన్ని పాటలివి.

సరళ: ఓ బంగారు వన్నెల రంగారు సంజా -
రంగేళి ఏతెంచెనే-నారాజా
కోరస్: చెంగూన రాడాయెనే ॥బంగారు॥
సరళ: ఎల పొద్దూగని తొలి ముద్దూగొనీ... ఓ ఓ ఓ
ఎలపొద్దూగనీ తొలి ముద్దూగొనీ-తనే వస్తానని
ఠీవిగా-నా రాజా రాడే నమా చేరగా
ఓ చెలియా-రాడేమో ఈ చాయగా ॥బంగారు॥
సరళ: జత జేరే తొలి వెత దీరే చెలీ
కోరస్: ఓ ఓ ఓ
సరళ: జత జేరే తొలి వెత దీరే చెలీ - ఏలా సూరేడటూ
డాయగా - నా రాజా జారే మటుమాయగా
కోరస్: ఆ మనసూ మారెనేమో రాయగా
సరళ: ఓ ఓ ఓ
కోరస్: ॥బంగారు వన్నెల॥
సరళ: సొగసెంచీ మరీ సిగ నుంచి విరీ-వగ ముంచి గిరిగీసెనూ-
నారాజా ఏ గారడో జేసెనూ
కోరస్: ఓ చెలియా రాగాలు దోచేసెనూ
సరళ: ఓ...
కోరస్: ॥బంగారు వన్నెల॥













ఈ పాటను పి.లీల, బృందం పాడగా సూర్యకళ, కొందరు ఉపపాత్రధారులతో అభినయించటం జరిగింది. 1952 లో వచ్చిన 'బైజు బావ్‌రా'లో 'దూర్ కొయి గాయె/ధున్ ఎ సునాయె' అనే పాటొకటుంది. నౌషాద్ సంగీత దర్శకత్వంలో షంషాద్‌బేగం, లతా, రఫీ పాడేరాపాటని. ఆ పాటలో నీటి కోసం కడవలతో వెళ్తున్న అమ్మాయిలు హీరోయిన్‌ని ఉడికించటం, దూరం నుంచి హీరో ఆలాపించడం... ఇవన్నీ ఆ సినిమా చూసిన వారికి గుర్తుండే ఉంటాయి. ఆ పాట చిత్రీకరణ, పాటలో ఘటాన్ని ఉపయోగించిన తీరు-ఇవన్నీ ఈ 'బంగారు వన్నెల రంగారు సంజా' పాట రూపకల్పనకు ప్రేరణగా నిలిచి వుండవచ్చు. ఈ పాటను ట్యూన్‌తో సహా ఆలపించుకుంటూ ఉంటే-సాహిత్యంలో విరుపులు, పదాల పొందిక చక్కని స్వీయానుభవంగా మిగులుతాయి.

కైలాసం : ఏరా!- ఏరామనతోటి గెల్చే-ధీరులెవ్వరురా! రణ-శూరు లెవ్వరురా! భళాభళి;
కోరస్ : ॥ఏరా మనతోటి॥
కైలాసం : అద్దిరభన్న-గుద్దుల బెల్లం-గుభిగుభిగుభిగుభి వీపుకు సున్నం
దుబ్ దుబ్ దుబ్ దూదేకుడూ- ఆ దెబ్బలతో తోకపీకుడూ
అరె ఆంజనేయుడికి అన్నదమ్ములం-భీమసేనుడికి పెద్ద కొడుకులం
కోరస్ : అద్దిరభన్నా
కైలాసం : లోభులనెత్తిన మొట్టేవాళ్ళం లోకుల కెపుడు పెట్టేవాళ్ళం
కోరస్ : అద్దిరభన్నా
కైలాసం : ఈ సీమకు మేమే రాజులం-ఆహా తిండికి పోతురాజులం
అరె సాగితే మహారాజులం
కోరస్ : అరె చతికిలబడితే తరాజులం ॥ఏరా మనతోటి॥
కైలాసం : పిన్నా పెద్దా-భేదం లేదూ కొద్దీ గొప్పా తేడాలేదు
కోరస్ : అద్దిరభన్నా
కైలాసం : జుట్టూజట్టూ ముడిపెడతాం-చెవులకు తాటాకులు కడతాం
కోరస్ : అద్దిరభన్నా
కైలాసం : మా సొంత మన్నదే లేదు-మేం చుప్పనాతులంగాదు
ఎప్పుడు కోపం రాదు-అది వచ్చినదంటే పోదూ
కోరస్ : అది వచ్చినదంటే పోదూ ॥ఏరా మనతోటి॥
కైలాసం : మీసంజూడు-రోసం జూడూ-పక్కనున్న సావాసంజూడు
కోరస్ : అద్దిరభన్నా
కైలాసం : సైెయని ఎవ్వడు ముందుకు రాడూ-వచ్చాడంటే యింటికి పోడూ
కోరస్ : అద్దిరభన్నా
కైలాసం : ఈ బాటకు సుంకం కట్టు-మా కాళ్ళకు దణ్ణం పెట్టు
అరె చిక్కెర చేతిలో జుట్టుఇక -తిరగెయ్‌ర పెసరట్టు
కోరస్ : ఇక తిరగెయ్‌రా పెసరట్టు
కైలాసం : అద్దిరభన్నా-గుద్దులు బెల్లం గుభిగుభిగుభిగుభి వీపుకు సున్నం
దుబ్ దుబ్ దుబ్ దుబ్ దూదేకుడూ-ఆ దెబ్బతో తోక పీకుడు
కోరస్ : ఆ దెబ్బతో తోకపీకుడూ ॥ఏరా మనతోటి ॥
















ఈ పాటను మాధవపెద్ది సత్యం, పిఠాపురం నాగేశ్వరరావు, బృందం పాడగా రేలంగి, రమణారెడ్డి, బాలకృష్ణ అభినయించారు. ఇది ఓ సరదా పాట. అంచేత సంగీతం-సాహిత్యం ఆ స్థాయిలోనే వుంటాయి. పట్టించుకోకుండా ఎంజాయ్ చెయ్యదల్చుకుంటే పాట మధ్యలో వచ్చే ఇంటర్ల్యూడ్‌లో కొంత పాశ్చాత్య ధోరణి కూడా ఉంటుంది. కాస్త పట్టించుకుంటే పల్లవిలో మోహనరాగచ్ఛాయలు కూడా కనిపిస్తాయి.

కోరస్: ఓ ఓ ఓ ఓం నమశ్శివాయః సిద్ధంనమః ॥ఓం॥
సుందరి: జగదీశ్వరా-పాహి పరమేశ్వరా
దేవా పురసంహారా-ధీరా నటశేఖరా
త్రాహి కరుణాకరా-పాహి సురశేఖరా
కోరస్: ఆ ఆ ఆ ॥జగదీశ్వరా॥
సుందరి: శంభోహరా-వినుత-లంబోదరా-అంబావరా కావరా
కోరస్: ఆ ఆ ఆ ॥శంభో॥
సుందరి: వరమీయరా గౌరి వర సుందరా గౌరివర సుందరా
కోరస్: నిన్నే కని మేము కొలిచేము గంగాధరా
దేవ గంగాధరా ఆ ఆ ॥జగదీశ్వరా॥
సుందరి: ప్రమధులు పాడా ఫణిగణమాడా-పార్వతి సయ్యాడా
మౌని వరుల్ నిను మనసారా-గని పారవశంబున కొనియాడ
కోరస్: ఓ ఓ ఓ ఓ
సుందరి: నడిపెడు సుందర నటనకు జతులిడ-నందీయ మర్దియ నాదమే
కోరస్: మధురాతి మధుర శృతి గీతమే
సుందరి: ధిమిత ధిమిత ధిమితైతై తయ్యని-తాండవమాడిన పాదమే
కోరస్: మది సేవించిన సమ్మోదమే
సుందరి: జగంబులా ఏలికా శివకామ సుందరి నాయకా ॥జగంబు॥
కోరస్: ఓ ఓ ఓ ఓ ॥ప్రమధులు॥

















ఈ పాటను పి.సుశీల, బృందం ఆలపించగా అంజలీదేవి, కొందరు ఉపపాత్రధారులతో అభినయించారు. సన్నివేశ ప్రాధాన్యంగా అక్కినేని నాగేశ్వరరావు కూడా కనిపిస్తారు. ఈ పాటకు భీంప్లాస్ రాగం ఆధారం. ఆ రోజుల్లో వచ్చిన కొన్ని భక్తి గీతాలు సినిమాలకు మాత్రమే పరిమితమైపోకుండా బైట విడిగా కూడా పాడుకునే స్థాయిలో వుండేవన్న విషయం ఈ పాట సాహిత్యాన్ని గమనిస్తే అర్థమవుతుంది.

పిలువకురా
అలుగకురా
నలుగురిలో నను ఓ రాజా
పలుచన సలుపకురా ॥పిలువకురా॥
మనసున బాళీ మరువను లేరా
చలమున మోడి సలువకు రాజా
సమయము కాదుర నిను దరిచేర ॥సమయము॥
కరుణను నన్నీవేళ మన్నించరా రాజా ॥కరుణ॥॥పిలువకురా॥
ఏలినవారి కొలువుర సామి
మది నీ రూపె మెదలిన గాని
ఓయన లేనురా కదలగలేరా ॥ఓయన॥
కరుణను నన్నీవేళ మన్నించరా రాజా ॥పిలువకురా॥














ఈ పాటను సుశీల బృందం పాడారు. అంజలీదేవి తక్కిన నట్టువరాళ్ళతో అభినయించారు. ఇంటర్‌లూడ్స్‌లో అక్కినేని వేణువు వాయిస్తూ కనిపిస్తారు. హిందోళరాగంలో స్వరపరచబడిన ఈ పాట కూడా మూడు భాషలలోనూ సరిసమానంగా హిట్ అయింది. తమిళంలో 'అషైకాదే', తెలుగులో 'పిలువకురా', హిందీలో 'ముఝే నా బులా' పాటలలో ఏది గొప్పది అంటే ఓ పట్టాన తేల్చి చెప్పటం కష్టం. కాకపోతే హిందీకొచ్చేసరికి పాడుకోవటానికి కాస్త సులువుగా మలిచారు. తెలుగు పాటలో పల్లవి చివర్న 'పలుచన సలుపకురా' అనే పదం తర్వాత కొంత ఇన్‌స్ట్రుమెంటల్ మ్యూజిక్ వస్తుంది. ఆ మ్యూజిక్ లేకుండా ఆలపిస్తే -విన్న వారికి, పాడుకున్న వారికి కాస్త అసంపూర్ణంగా ఉంటుంది. కానీ హిందీలో ఆ వెలితిని చాలా తెలివిగా పూరించి, విజయ శంఖం పూరించారు ఆదినారాయణరావు. అది ఏమిటో ఎలాగో రెండు పాటలను దగ్గర పెట్టుకుని విన్న వారికి మాత్రమే తెలుస్తుంది.

ఆమె: ఆ ఆ ఆ
హాయి హాయిగా ఆమని సాగె ॥హాయి॥
సోయగాల గన వోయీ సఖా హాయి సఖా ॥హాయి॥
అతడు: లీలగా పువులు గాలికి ఊగ ॥3॥
సనిదమదనిస
ఆమె: గమగమదనిస
ఇద్దరూ: రిసని దని/సరిసని/సరిసని
దనిని దనినిదని మదద మదదమగ
గరిగమదని ॥లీలగా॥
కలిగిన తలపుల వలపులు రేగ ॥కలిగిన॥
ఊగిపోవు మది ఉయ్యాలగా జంపాలగా ॥హాయి॥
ఆమె: ఏమో... ఏమో తటిల్లతిక మేమరుపు ॥2॥ మైమరపేమో
అతడు: మొయిలు రాజు దరి మురిసినదేమో
ఆమె: మైమరపేమో
అతడు: మొయిలు రాజు దరి మురిసినదేమో
ఇద్దరు: వలపు కౌగినుల వాలిసోలి ॥వలపు॥
ఊగిపోవు మది ఉయ్యాలగా జంపాలగా ॥హాయి॥
ఆమె: చూడుమా చందమామ అటు చూడుమా చందమామ
అతడు: కనుమా వయ్యారి శారద యామిని కవ్వించె
ప్రేమా చూడుమా చందమామ
ఆమె: వగల తూలె విరహిణుల ॥వగల॥
అతడు: మనసున మోహము రేపునదవురా ॥మనసు॥
ఇద్దరూ: ఊగిపోవు మది ఉయ్యాలగా జంపాలగా... ఆ... ॥హాయి॥
అతడు: ఆ...
కనుగవా తనియగా ప్రియతమా కలువలు విరిసెనుగా ॥కను॥
ఆమె: చెలువము కనుగొనా ॥2॥
మనసానంద నాట్యాలు చేయునోయి
ఆనంద నాట్యాలు చేయునోయి
ఇద్దరు: నిరిగమదనిస దనిస
సనిసగరిగ సరినిసదని మదనిస నిరినిరి
దనిదని మదమద గమగమ గమదనిన గమదనిన దనిసా



ఈ పాటను ఘంటసాల, జిక్కి పాడారు. తెరపై అక్కినేని, అంజలీదేవి అభినయించారు. పల్లవినుంచి మొదటి చరణం వరకు హంసానంది రాగంలోను, 'ఏమో తటిల్లతిక' అనే రెండో చరణాన్ని దర్బారీ కానడ రాగంలోను 'చూడుమా చందమామ' అనే మూడో చరణాన్ని బహార్ రాగంలోను, 'కనుగవ తనియగ' అనే నాలుగో చరణాన్ని కళ్యాణి రాగంలోను స్వరపరిచారు. నాలుగు విభిన్న రాగాలను కలిపినా వింటున్నపుడు ఎక్కడా ఒక జంప్‌లాగ కాని, ఓ జర్క్‌లాగాని ఫీలవం. ఇదే పాటని హిందీలో చిన్న చిన్న మార్పులతో మనం గమనించవచ్చు. తెలుగులోను, హిందీలోను చరణాల స్వరకల్పన ఒకేలా ఉంటుంది. కానీ తెలుగు పల్లవి 'హాయి హాయిగా ఆమని సాగే'కి హిందీ పల్లవి 'కుహూ కుహూ బోలే కో యలియా'కి ట్యూన్‌లో కొద్దిగా తేడా ఉంటుంది. తెలుగు పాట రెండో చరణంలో 'మైమరపేమో' అన్న మాటని జిక్కి ఆలపించగా హిందీలో అదే స్థానంలో ఉన్న 'హో సఖీతాహై' అనే పదాన్ని లతా చేత కాక రఫీతో పలికించారు. ఆ రెండు పాటల మధ్య ఈ మాత్రం తేడా కూడా ఉందని అంటే ఇప్పటికీ నమ్మని వాళ్లు ఉన్నారు. నాటి నుండి నేటి వరకు ఎవరు పాడితే వారి శక్తి సామర్థ్యాలకు పరీక్షగా నిలిచే ఈ గీతాన్ని పోటీలలో పాడటం అంటూ జరిగితే బహుమతిని పొందకుండా వెనక్కు వెళ్ళిన వాళ్ళని మునివేళ్ళ మీద లెక్క పెట్టవచ్చు. సంగీతం పెద్దగా నేర్చుకోకపోయినా ఈ పాటని స్వరాలతో సహా పాడేవారు ఇంటికొకరైనా గల కుటుంబాలు ఆంధ్రదేశంలో చాలా ఉన్నాయి. అంతేకాదు ఈ గీతం లేని క్లాసిక్ కలెక్షన్స్ ఆడియో లైబ్రరీ కూడా ఉండి ఉండదు. ఉంటే అవి క్లాసిక్ కలెక్షన్‌గా అనిపించుకోదు కూడా. అదీ ఈ గీతం సాధించిన ఘన విజయం. తెలుగు సినీ సంగీతానికి సంబంధించినంత వరకు ఇది ఒక శాశ్వత విజయం.

పై రెండు (తెలుగు) పాటలలో సముద్రాల సీనియర్ రచనా సామర్ధ్యాన్ని వర్ణించాలంటే సరియైన తూకపు రాళ్లు దొరకవనే చెప్పాలి. ఇటీవల ఈ పాటను పాడుతున్న ఓ ఔత్సాహిక గాయకుణ్ణి ఆఖరు చరణంలో గల 'కనుగవ తనియగ' అంటే అర్ధం ఏమిటి అని అడగటం జరిగింది. దానికతడు-కనుగవ అంటే చూడవా, తనియగ అంటే తనివితీరా అని అర్ధం-అన్నారు. నిజానికి కనుగవా అనే పదాన్ని అక్కడ నేత్ర ద్వయం అర్ధంలో రాయటం జరిగింది. అలాగే పిలువకురా అనే పాటలో బాళి, మోడి వంటి పద ప్రయోగాలు జరిగాయి. ఇప్పుడు అటువంటి పదాలు వాడితే నిఘంటువులో అర్ధాలు వెతుక్కునే సమయం, జిజ్ఞాస కూడా లేకుండా 'ఎందుకొచ్చిన గొడవండి తీసేసి ఇంకో మాట వెయ్యరాదా' అని అంటారు కూడా. కాలక్రమంలో కొన్ని పదాలు లుప్తమయిపోతుంటాయి. వాటిలో ఈ పదాల్ని కూడా చేర్చాలేమో. అసలు లుప్తం అన్నమాటే కాలగర్భంలో కలిసి పోయిందేమో... ఏది ఏమైనా అటు సాహితీ ప్రయోగాల్ని గాని ఇటు స్వరప్రయోగాలను గాని ఇటువంటి పాటల ద్వారా మరోసారి అవగాహనకు తెచ్చుకోగలిగితే విజ్ఞాన సంపద మరికాస్త పెరిగినట్టే.

సుందరి : అ - అ - అ
సాకీ : నీ నీడలోన నిలిచేనురా - యువతీ మనోజా
పాట : నీ నీడలోన నిలిచేనురా
నిను కొలిచేనురా-యువతీ మనోజా
ఏనాటికైనా నీదానరా -యువతీమనోజ
రాజా ఏనాటికైనా నీ దానరా
నవశోభలీను నామేను
నీ పూజకేనురా యువతీ మనోజా
ఏనాటికయినా నీ దానరా
అ-అ-అ
నీ తీయని కొనగోరుల మీటి ॥2॥
మేళవించిన హృదయవిపంచి మేళవించిన ప్రేమ విపంచి
మురిసిన చిరుగాలి సోకునా మొరసి భవదీయ గీతమే
వినిచేనే మేళా, ఏనాటి కయినా నీదానరా
యువతీ మనోజా ఏనాటికయినా నీదానరా అ- అ-అ



ఈ పాటను పి.సుశీల, బృందం పాడగా ఉప పాత్రధారులైన కొందరు నట్టువరాళ్ళతో అంజలీదేవి అభినయించారు. ఈ పాటలో రాగేశ్రీ, కమాచ్ రాగచ్ఛాయలు మిళితమై వున్నాయి. సాహిత్యపరంగా ఈ పాటలో కూడా గమనించండి. ఫ్రెష్‌గా ఓ జానపద చిత్రాన్ని గాని, పౌరాణిక చిత్రాన్ని గాని ఇప్పుడు తీసినా మొరసి, వినిచేనే లాంటి పదాల్ని ఆ చిత్రాలలో ఊహించగలమా...!? కళాకారుల ప్రతిభను పూర్తిగా వాడుకోగల వాతావరణం జతపడినప్పుడే జిజ్ఞాస వున్నవారి మెదడుకి మేత కల్పించగల సృష్టి ఆవిర్భవిస్తుంది. లేకపోతే తర్వాతి తరం చెప్పుకోడానికి మిగలని-ఆత్మలేని-రూపాలు అంకురిస్తూ వుంటాయి.

సుందరి :
బొమ్మాలమ్మా బొమ్మలూ చూడండి బలే బొమ్మలూ
రండి పాపలూ ఇలా రండి
బొమ్మలా పసా చూడండి చౌకేనండి...ఓ ఓ ఓ ॥బొమ్మ॥
ఓ-ఓహో రాణి ఇదో నాగరాణీ- ॥2॥ కానీ చేతిబోణీ కొనీ కనూ పూబోణి
ఏదికొన్నా ఖరీదొక బేడేసుమా- ॥2॥ ఏరికోరి కొనండివి మీకే సుమా
రండి రండి రండి పాపలు ఇలా రండి
బొమ్మలా పసా చూడండి-చౌకేనండి-బొమ్మలమ్మా బొమ్మలూ
మిలమిలా తళతళా మెరిసిపోయె బొమ్మా
నిగానిగా కనూగనా జిగేలనే బొమ్మా ॥మిలమిలా॥
మేలు మేలయిన బొమ్మలు చూడండయా ॥2॥
కారుచౌకైన బేరము విడకండయా-రండి రండి పాపలూ ఇలా రండి
బొమ్మలా పసా చూడండి-చౌకేనండీ-బొమ్మలమ్మా బొమ్మలూ
గొల్లభామ- పల్లెటూరి పిల్ల-కీలుగుర్రము
బాలరాజు - చంద్రలేఖ - బాలనాగమ్మ
అరటిపళ్లు, జామిపళ్ళు, ద్రాక్షగుత్తులు
ఆడపిల్ల లాడుకొనే లక్కపిడతలూ
శిల్పలక్ష్మి జనించెను మా నాటనే-
శిల్పవిద్యా ఫలించెను మా వీటనే
రండి రండి పాపలూ ఇలా రండి
బొమ్మలాపసా చూడండి చౌకేనండి
బొమ్మాలమ్మా బొమ్మలూ



ఈ పాటను పి.సుశీల పాడగా అంజలీదేవి-ఉపపాత్రధారులతో అభినయించారు. సుశీల గొంతులో పలికిన ఎక్స్‌ప్రెషన్లు ఈ పాటకి జీవం. ఈ సినిమా రిలీజయ్యే రోజుల్లో అణాలు, బేడలు ఉండేవి. అందుకే 'ఏది కొన్నా ఖరీదొక బేడే సుమా' అనే వాక్యం చోటుచేసుకుందనుకోవాలి-లేకపోతే ఈ జానపద చిత్రానికి కథాకాలం, అప్పుడు చలామణిలో ఉన్న మారక ద్రవ్యం గురించి ఊహిస్తే ఆ వాక్యం చర్చకు నిలబడుతుందా... సందేహమే!? అలాగే ఈ సినిమా విడుదలయ్యే నాటికి పాపులర్ సినిమాలుగా ముద్ర పడిన-'గొల్లబామ', 'పల్లెటూరి పిల్ల', 'కీలుగుర్రము', 'బాలరాజు', 'చంద్రలేఖ', 'బాలనాగమ్మ' సినిమాల పేర్లను వాడుకోవటంలో కూడా కొంత వ్యాపారాత్మకమైన తెలివితేటలు కూడా ఉన్నాయనుకోవటంలో తప్పులేదు. పైగా అందులో అధికభాగం సినిమాలు అంజలీదేవి నటించినవే.!

అమ్మా! అమ్మా! అమ్మా!
అమ్మా అమ్మా అమ్మా యని అడిగేవు బాబూ
మీ అమ్మ ఎట నున్నదో ॥అమ్మా అమ్మా అని॥
పలుకాడలేని-పసివాడవే-నువ్వు -తెలిపేదెలా బాబూ
అమ్మను కలిసేదెలా బాబూ
పతి సతులను బాసి బ్రతుకన్నరోసి-మగవేషమే వేసి
అల్లాడు తల్లి అగుపించినా నువ్వు-తెలిసేదెలా బాబూ
అమ్మను కలిసేదెలా బాబూ
విధి చేతివ్రాలే శాపాలపాలై-ఈరీతి జవరాలై
అల్లాడు తండ్రి అగుపించినా నువ్వు-తెలిసేదెలా బాబూ
అయ్యను కలిసేదెలా బాబూ
అనాధాళికి ఆలన పాలన దేవుడే
మహాదేవుని సన్నిధి చేరరా బాలుడా-దయజూచి దరిజేర్చినా
ఆ దేవుడే గతిరా మహాదేవుడే గతిరా



ఘంటసాల పాడిన ఈ నేపథ్య గీతాన్ని బాబ్జీ (నాటి పుష్పవల్లి కుమారుడు), అంజలీదేవి, రాజసులోచనపై చిత్రీకరించారు. శుభపంతువరాళి రాగం ఈ పాటకు ఆధారం. ఆవేదన, ఆర్తి ఈ రాగంలో బాగా పండుతాయి. పైగా పాడింది ఘంటసాల కావటంతో విన్నవారి హృదయం ద్రవిస్తుందనటంలో సందేహం లేదు. ఈపాటను బాగా సాధన చేస్తే శుభపంతువరాళి రాగంపై కొంత అవగాహన ఏర్పడుతుంది. ■




## తారాగణం

అంజలి, నాగేశ్వరరావు, రాజసులోచన, రేలంగి, గిరిజ, గుమ్మడి, సూర్యకళ, సి.యస్.ఆర్, ఇ.వి.సరోజ, రమణారెడ్డి, వసుంధర, బాలక్రిష్ణ, మోహన, పేకేటి, బాల, మాస్టర్ బాబ్జి, కె.వి.యస్.శర్మ, రాజారెడ్డి, కోటేశ్వరరావు, లక్ష్మయ్య చౌదరి, ఏ.ఎల్.నారాయణ, రామచంద్రరావు, పసుపులేటి సత్య, రెడ్డి, ఆచారి, మొదలగువారు.

దర్శకుడు : వేదాంతం రాఘవయ్య

నిర్మాత : ఆదినారాయణరావు

## టెక్నీషియన్లు

| | | |
|---|---|---|
| కథ | : | సదాశిబ్రహ్మం అండ్ ఆదిత్యన్ |
| మాటలు | : | మల్లాది రామకృష్ణశాస్త్రి |
| ఫోటోగ్రఫీ | : | యం.ఏ.రెహమాన్ |
| మ్యూజిక్ | : | ఆదినారాయణరావు |
| శబ్దం | : | జె.సూర్యనారాయణ |
| కళ | : | వాలి |
| నృత్యం | : | వెంపటి సత్యం |
| మేకప్ | : | హరిబాబు, నాగేశ్వరరావు, పోతరాజు |
| ఎడిటింగ్ | : | యస్.యన్.ప్రకాశం |
| ప్రొడక్షన్: (ఎగ్జిక్యూటివ్) | | సుబ్రహ్మణ్యం |
| స్టిల్సు | : | (సత్యం జైహింద్ స్టూడియో) |
| స్టూడియో | : | వీనస్ |



# 'ఇక బయలుదేరండి'

ఇలా జరిగితే మీరు మీ బంధువుల ఇంట్లో చాలాకాలంగా తిష్ట వేసినట్టు లెక్క!

సత్యమూర్తి BV



హాల్లో బదులు 'కాస్సేపు ఆ స్టోర్ రూంలో కూర్చోండి మా ఫ్రెండ్స్ వస్తారు' అని అంటే



వాళ్ళ ఫ్రెండ్స్ వచ్చి కాఫీలు అవీ తాగాకా ఎంగిలి కప్పులను మిమ్మల్ని తీసేయమని పురమాయిస్తే...



'రాత్రి మిగిలిన అన్నం అవీ చూపించి, ఇది మధ్యాహ్నం, రాత్రిపెట్టుకు తినండి. మేము పెళ్ళికెళ్తున్నాం' అని బాగా కారాలు, ఉప్పు వేసిన కూర, పులుసు పెట్టి వెళ్తే...



'ఈవేళ పనివాడు రాలేదు. మా పిల్లల్ని ఎత్తుకుని స్కూల్లో దిగబెట్టండి' అంటే...




రోజూ ప్రొద్దుటే మీకు కాఫీ ఇచ్చేటప్పుడు డైనింగ్ టేబుల్ మీద, బస్ స్టాండ్‌కి, రైల్వేస్టేషన్‌కి వెళ్ళే దారి చూపించే మేప్‌లు ఉంచితే...



కావాలని వాల్వ్ కట్టేసి 'నీళ్లు పైకి రాటం లేదు బాబూ. కిందకెళ్ళి నాలుగు బిందెలు నీళ్ళు తీసుకురా. లిఫ్ట్ కూడా పాడయింది' అంటే...

# 'స్వరం' నిక్షిప్త చిత్రం



సంగీత దర్శకులు సత్యం (రెండవ వ్యక్తి), టి.వి.రాజు, ఘంటసాల, కె.వి.మహదేవన్,
పి.బి.శ్రీనివాస్, ఆచార్య ఆత్రేయ, ప్రతిభాశాస్త్రి తదితరులు

# Blueprinting the future from the past



The world around us is full of unseen biological wonders, many of them endowed by nature with miraculous cures for the ills of man.

But it takes a particularly discerning eye to see these hidden cures.

At Shanta, we take quiet pride in the fact that our scientists possess this type of penetrative vision.

One example of their path-breaking research is Shanvac-B, India's first indigenous family vaccine against Hepatitis-B. Another is betacarotene, an antioxidant manufactured from algae found in the high seas. A third is Shanferon, an indigenous anti-cancer drug...

Working 24 hours a day, 365 days a year, Shantha's scientists are ceaselessly pushing back the frontiers of the unknown. To bequeath mankind with a healthier future - through the miracles of Biotechnology.

**SHANTHA BIOTECHNICS PVT. LTD.**

3rd Floor, Serene Chambers, Road No 7, Banjara Hills, Hyderabad, India.
Tel : +91-40-3548507, 3608843 Fax : +91-40-3548476 E-mail : info@shanthabiotech.com
www.shanthabiotech.com